# సకలనీతిసమ్మతము

## మడికిసింగన

సంపాదకులు :

విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావు

డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనం : హైదరాబాదు - 4

# విజ్ఞప్తి

'సకలనీతిసమ్మతము' మడికి సింగనచే కూర్పబడిన సంకలన గ్రంథము. ఆంధ్రభాషలో ఇట్టి సంకలనగ్రంథములకు శ్రీకారము చుట్టినవాడు సింగనామాత్యుడు. ఇందు ఆయన తనకు పూర్వులైన ఆంధ్రకవుల గ్రంథముల నుండి రాజనీతిపద్యముల నేర్చి కూర్చినాడు. ప్రాచీనాంధ్రవాఙ్మయచరిత్రకిది చాల ముఖ్యగ్రంథము.

ఇట్టి ఉత్తమగ్రంథమును సుప్రసిద్ధ విద్వాంసులు కీ.శే. మానవల్లి రామకృష్ణ కవిగారు 1923 లో సంపాదించి ప్రకటించిరి. ఆ తరువాత ఎవరును దీనిని పరిశీలింపలేదు. ఈ గ్రంథమును మరల పరిశీలించి విశేషకృషిచేసి విపులపీఠికతో ముద్రణకు సిద్ధము చేసి యిచ్చిన పండితులు శ్రీ నిడుదవోలు వేంకటరావు గారికిని, డా. పి. యస్. ఆర్. అప్పారావు గారికిని ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి పక్షమున కృతజ్ఞతలు తెలుపుకొనుచు, ఈ గ్రంథము ఆంధ్రావళి మోదము బడయగలదని ఆశించుచున్నాను.

దేవులపల్లి రామానుజరావు,

కార్యదర్శి

# పీఠిక

## 1. పరిచయము

ప్రాచీనాంధ్రకవి మడికి సింగన రచించిన 'సకల నీతిసమ్మతము' అను నీ గ్రంథము క్రీ. శ. 1923లో శ్రీమానవల్లి రామకృష్ణకవి మహోదయులచే విస్మృతకవుల కృతులలో పదవదిగా ప్రకటితమైనది. కవిగారా సంవత్సరముననే దీనిని ముద్రించినను, వారిప్పటికరువదేండ్ల క్రిందటనే ఈ గ్రంథము నెఱుగుదురు. క్రీ. శ. 1910లో వారు ప్రకటించిన 'ప్రబంధ మణి భూషణము' పీఠికలో నీ గ్రంథమునుగూర్చి యిట్లు వ్రాసియున్నారు.[1]

"ఇట్టి సంచితకృతులు సంస్కృతమున విస్తారముగా గలవు. ఆంధ్ర భాషలో నాకు లభించినంతవఱకు పరికింప నట్టికృతికర్తల మడికి సింగనయే ప్రథముఁడు. అతఁడు ప్రాచీన పంచతంత్రి, ప్రాచీన కామందకము, ముద్రామాత్యము, నీతిభూషణము, బద్దెననీతి, కుమారసంభవము, భారతము, మనుమంచిభట్టు నశ్వశాస్త్రము మొదలగు గ్రంథములలోని రాజనీతిపద్యముల నన్నియు నేఱి సకలనీతిసమ్మతమను గ్రంథమును గూర్చెను" (పుట 1).

కవిగారీ సకలనీతిసమ్మతమును ప్రకటించుటయేగాక, యెనిమిది పుటలలో విశేషవిషయవిలసితమగు నొక యుపోద్ఘాతము వ్రాసియున్నారు. దాని మూలమున — మన ప్రాచీనాంధ్రవాఙ్మయ చరిత్రలో నెన్ని కావ్యములు నష్టమైనవో తెలియుటయేగాక, తెలుగు సాహిత్యమున నీ నాటికి పరిశీలనలేని, శాస్త్రవాఙ్మయమును గూర్చిన నూతనవిశేషములు తెలియుచున్నవి. ఇది చాల విలువగల గ్రంథమైనను, నీ నలభై ఏదేండ్లనుండి దీనిని కూలంకషముగా గాకపోయిన— అథవా ఆలవోకగానైన — విమర్శకులు పరిశీలింపలేదు.

1. వనపర్తి బ్రహ్మవిద్యావిలాస ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

ఈ గ్రంథప్రశస్తినిగూర్చి- పునర్ముద్రణావశ్యకతనుగూర్చి నేను మూడుపరియాయములు హెచ్చరించితిని.[2] నేటికిది ద్వితీయముగానేగాక, అద్వితీయముగా కూడ ముద్రణమైనందులకు ఎంతో సంతోషింపవలసియున్నది.

ఈ గ్రంథమింతవఱకు అజ్ఞాతవాసము చేయుచున్నందున ప్రథమముగా గ్రంథమునుగూర్చి, గ్రంథస్థవిషయములనుగూర్చి తెలిసికొనుట యావశ్యకమగుట గాన వానితో ప్రారంభించుచున్నాను.

## 2. గ్రంథరచనావిధానము

శ్రీ కవిగారి వ్రాతనుబట్టి యిది సంకలనగ్రంథమగుటస్పష్టము.

సింగన తాను రచియించినది సంకలనగ్రంథమేయైనను, దీనిని 'ప్రబంధ'మనియే వ్యవహరించియున్నాడు- ప్రబంధమువలె నిందు, కృత్యవతరణిక, షష్ఠ్యంతములు, ఆశ్వాసాద్యంత పద్యములు, గద్య గలవు- "నారద వసిష్ఠ పరాశరబాదరాయణ భృంగ్వాంగిరసగురు శుక్రమతానుసారంబై దేవ మానవ రాక్షసంబులగు నయశాస్త్రంబులు పరీక్షించి యంధ్రభాషా కోవిదులగు సుకవీంద్ర రచితంబైన ముద్రామాత్య- పంచతంత్రీ- బద్దె భూపాల- చాణక్య- ధౌమ్య- విదుర- ధృతరాష్ట్ర- బలభద్ర- కామందక- గజాంకుశ- నీతిసార- నీతిభూషణ- క్షేమేంద్ర- భోజరాజవిభూషణ- పురుషార్థసార- భారత- రామాయణాది మహాకావ్యంబులు, పురాణేతిహాసంబులు, కందనామాత్యునీతితారావళి, లోకోక్తి - చాటుప్రబంధంబులయందును గల నీతివిశేషంబు లూహించి తత్తత్సారాంశంబులయ్యైవిషంబుల వర్గసంగతంబుగా సకలనీతి సమ్మతంబను పేరనొక్క-

### ప్రబంధంబు

రచియింపుదునని ప్రబంధసారంబునకు ననుగుణంబుగా నే పురుషునిం బ్రార్థింతునో యని వితర్కించి" అని సింగన వ్రాయుటయే గాక గద్యయందు-

---

[2] పూర్వగ్రంథములు పునర్ముద్రణావశ్యకత భారతి సం. 26-సం. 6 436-441. పుటలు

ఆకర గ్రంథములు. భారతి- జూలై. 1963.
,, ,, 1967.

"ఇది శ్రీనరసింహ ప్రసాదలబ్ధకవితా విలాస భారద్వాజసగోత్రా య్యలార్యపుత్ర సరసగుణధుర్య సింగనార్య ప్రణీతంబైన సకలనీతిసమ్మతంబను 'ప్రబంధంబు' నందు...... ప్రథమాశ్వాసము" అని వ్రాయుట వలన సింగనదృష్టిలో నిది ప్రబంధమే.

## 3. సంకలన గ్రంథములు

సింగన యిట్లు స్పష్టముగా ప్రబంధమని నిర్దేశించినను, ఇది సంకలన గ్రంథమే. సంకలనగ్రంథమనగా కవి, తనకు పూర్వమందున్న కవుల కావ్యములనుండి వర్ణనాంశములుగాని శాస్త్రవిషయములుగాని సేకరించి, వానిని వర్గీకరించి, ఏకాకారమైన యొక కృతిగా సమకూర్చు సాహిత్యప్రక్రియ. సింగన తనకు ముందిట్టి గ్రంథరచన లేకపోవుటచేత, తాను సమకూర్పబోవు కృతి నిట్లు, బహుమనోహరముగా సమర్థించియున్నాడు—

సీ. " ఆలోల కల్లోలమగు దుగ్ధనిధిఁ ద్రచ్చి
దేవామృతము తేటఁదేర్చుపగిది
గంధకారుడు మున్నుగల వస్తువులు జోకఁ
గూర్చి సుగంధంబు గూడినట్లు
అడవిపువ్వులతేనె లన్నియు మధుపాళి
యిట్టలంబుగ జున్నువెట్టుభంగిఁ
దననేర్పు మెఱసి వర్తకుఁడు ముత్తెములీడు
గూర్చి హారంబు తాఁగుచ్చు కరణిఁ

గీ. గృతులు మునుసెప్పినట్టి సత్కృతులు ద్రవ్వి
కాంచుకంటెను నొకచోట గానఁబడఁగ
సకలనయశాస్త్రమతములు సంగ్రహించి
గ్రంథమొనరింతు లోకోపకారముగను." 14

ఇట్లొక ప్రణాళిక నిర్ణయించుకొని సింగన, తనకు పూర్వసుకృతుల నుండి పద్యములను సేకరించినాడు— కాని పద్యములన్నియు నితరకవులవే గదా— అందువలన— వానిని వర్గీకరణముచేసి, వానినొకదానితో నొకటి యను సంధించునట్లు, తిరిగి యీ రీతిని చెప్పినాడు—

క. "కడివెఁడు దుగ్ధము లోపలఁ
దొడిఁబడఁగొణిదెండునల్ల తోఁడంబడిన
ట్లెడనెడ నొక్కొకపద్యం
బడరించి మదీయ కావ్యమని వ్రాయింతున్". 16

ఆయా వర్గముల పద్యముల కతుకులుగా, తాను సొంత పద్యములను వ్రాసియున్నాడు. పాలు పెరుగై విస్తరిల్లుటకు 'తోడు' స్వల్పమే ఆవశ్యకము గదా !

పై పద్యమున "వ్రాయింతు" అన్నక్రియ గమనింపదగినది- "వ్రాయు" అన్న క్రియకు- పూర్వకాలమున- కేవలము లిఖించుటయే యని యర్థము- అనగా, ఒకరు చెప్పినది వ్రాతమూలకముగా గ్రంథస్థము చేయుట. ఇప్పుడట్లుగాక, "అతడీ గ్రంథము వ్రాసెను", "వారిన్ని గ్రంథములువ్రాసిరి" అని గ్రంథరచనకు పర్యాయపదముగా వాడుకలోనికి వచ్చినది.[1]

సింగన "వ్రాయింతు" అను క్రియనుబట్టి, అతడు లేఖకులనుబెట్టి- ఆయా గ్రంథములనుండి పద్యములు ఎత్తి వ్రాయించెనని విశదమగుచున్నది. అయితే కేవలము వ్రాయించుటయేగాక- వానిని సంధానము చేసినరీతిని ఇట్లు సరసముగా వివరించియున్నాడు-

"మును కవులెల్లఁ జెప్పినవి మున్నొని చర్వితచర్వణంబుగా
బనివడి వ్రాయనేల కవి ప్రాజ్ఞులు చిత్తములందు జూడుఁ డా
ఘనుఁడగు ప్రౌఢమాలకరి కమ్మని పువ్వులుగూర్చి దండ గ
ట్టిన క్రియ నీతిదామము ఘటింపుదు మీరలు మెచ్చునట్లుగన్." 8

పై రచనావిధమునుబట్టి- సకలనీతిసమ్మతము సంకలనగ్రంథ శాఖకు సంబంధించినది యని స్పష్టము. ఈ శాఖలో తొలిది సింగన కృతియే. సకలనీతిసమ్మతము తరువాత మఱికొన్ని సంకలనగ్రంథములు వెలసినవి.

1. "వ్రాసితిమున్ ప్రతాపుకథ పండితమానులగుండె నీరుగా
వ్రాసితి వెన్కనయ్యుష వివాహము సిద్ధసుధా ప్రవాహమున్"
— అని వేదము వేంకటరాయశాస్త్రిగారు.

ఈ శాఖచరిత్రను, విశిష్టతను తరువాత వివరింతును. ప్రస్తుతము ప్రథమ సంకలన గ్రంథకర్తయగు సింగనకవినిగూర్చి తెలుసుకొందము.

## 4. మడికి సింగన

మడికి సింగన శ్రీనాథయుగమున వెలసినమహాకవి. సకల నీతిసమ్మతిమే కాక, మఱి మూడు కృతులీతనివి లభించినవి. అవి– 1. పద్మపురాణోత్తరఖండము, 2. భాగవతము దశమస్కంధము (ద్విపద), 3. జ్ఞాన వాసిష్ఠ రామాయణము– మూడును ముద్రితములైనవే. వీనినిగూర్చిగాని, సింగన రచనలు ప్రాచీనాంధ్రసాహిత్యమున కెట్లుపయోగపడునన్న విషయమునుగూర్చిగాని, అతని కవితా రచననుగూర్చిగాని యింతవఱకు పర్యాప్తమైన పరిశీలన జరుగనేలేదు. సింగనకృతులలో– సకలనీతి సమ్మతము– సంకలన గ్రంథశాఖకు ఆద్యమైనట్లుగా, జ్ఞానవాసిష్ఠరామాయణము– ఆంధ్రవేదాంతవాఙ్మయమునకు శ్రీకారము చుట్టినది.

నేటి వాఙ్మయచరిత్రలలో ఒక్క గ్రంథమున మాత్రమే పద్మపురాణమునుగూర్చిన విమర్శ వివరణ కలదు.[1] పద్మపురాణోత్తరఖండమును– భాగవతదశమస్కంధమును సింగన కందనమంత్రి కంకితము చేసెను. కందన మంత్రి పూర్వులు కాకతి గణపతిదేవచక్రవర్తి కాలమునుంచీ ప్రసిద్ధులు– కందనమంత్రి అన్నకేసనమంత్రి రామగిరిదుర్గము రాజధానిగా సబ్బినాటి రాష్ట్రాన్ని పరిపాలించిన గురిజాల ముప్పభూపాలుని అమాత్యులుగానుండి బాహుధర్మకార్యములు చేయుటయేకాక, రాజనీతిజ్ఞులని ప్రఖ్యాతి నార్జించినారు.

## 5. సింగనకాలము

మడికి సింగన తన కాలాన్ని తాను రచించిన పద్మపురాణోత్తర ఖండములో ఇట్లు తెలిపినాడు—

"ఆ కర యుగానల మృగాంక
శకవత్సరములై పరగు శార్వరిని బుణ్య

1. సమగ్ర ఆంధ్రసాహిత్యం. నాలుగవసంపుటము. 60–69 పుటలు

ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చు
నుడుపాలసుతవాసరమునందున్
శ్రీకరముగా మడికి సింగన
తెనుంగున రచించెఁదగఁ బద్మపురాణం
బా కమలమిత్రశశిలాంఛనువుగఁ
గందసచివాగ్రణికి మంగళమహాశ్రీ.''

ఈ పద్యమున నిచ్చిన శకవత్సరము — కర - 2, యుగ - 4, అనల - 3, మృగాంక - 1 — "అంకానాం వామతో గతిః" అను సూత్రము ననుసరించి 1342.- ఇది శకముగాన దీనికి 78 కలిపిన యెడల క్రైస్తవ శకాబ్దము వచ్చును - 1342 + 78 = 1420 - కాబట్టి క్రీ. శ. 1420 ప్రాంతము మడికి సింగన కాలమని నిర్ణీతమైనది. 1

క్రీ. శ. 1917లో వీరేశలింగము పంతులు గారు మొదలుకొని వాఙ్మయ చరిత్రకారులు, సాహితీవిమర్శకు లందఱును పై కాలము నామోదించి ప్రమాణీకరించిరి. కీర్తిశేషులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, క్రీ శ. 1948లో సింగన కాలమునుగూర్చి తమ 'రెడ్డిరాజ్యముల చరిత్ర'లో విమర్శించుచు ని క్రింది రీతిని వ్రాసియున్నారు—

అందు 'ఆకరయుగానలశశాంకశక' అన్న పూర్వోక్త పద్యము పెను వెంటనేగల యాంగ్లేయ వాక్యము లిట్లున్నవి.

According to this, the date is Saka1342, corresponding to the Cyclic year Sarvari, Wednesday, the 5th Tithi of the month of Margasira. The fortnight, whether it was the bright half or the dark half, is not stated. The date is irregular as the fifth Tithi in the said month does not fall on Wednesday in any one of the two fortnights. This verse, found only in a very few manusripts, seems to be an interpolation; for, the age of Madiki Singana at the time of the composition of the Padma Purnam would be seventy three, even if he is taken to have been born to Ayyalamantri in saka 1269, the date of Toyyeti Anavota's Daksharam record. If this date in the

1. మడికిసింగనకాలము — భారతి సం. 44 సం. 7, జూలై 1967.

Padma Puranam is accepted, a still later date to his Vasistha Ramayanam has to be postulated. This does not seem to be the case, If he were such a late poet, he would have certainly mentioned Erra Pregada in his Kavistuti. The date given in the Padma Puranam does not seem to be correct.

(History of the Reddi Kingdoms. Page 514–Foot Note.)

చదువరులకు సుకరముగా నుండుటకై పై భాగమునకు సారాంశముల నిచ్చుచున్నాను.

1. తిథి వారములు కుదరకపోవుటచేత ఉదాహృతకాలము సరికాదు.

2. కొద్ది ప్రతులలో నుండుటచే తరువాతివారెవరో దీనిని చేర్చిరి.

3. సింగన పేర్కొనిన అనపోతనాయకుని శాసనము క్రీ. శ. 1347 లో నుండుటచే సింగనకాలము 1420 కాదు.

4. ఇతడు ఎఱ్ఱాప్రెగడను పేర్కొనలేదు.

పైని వివరించిన శర్మగారి యభిప్రాయములే 'నన్నెచోడుని కవిత్వము' అను గ్రంథమున ననువదింప బడినవి.[1] మడికి సింగన క్రీ. శ. 1347 ప్రాంతము వాడని అందు నిరూపితమైనది.

ఈ గ్రంథాన్ని అనుసరించే, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'లో మడికి సింగన కాలనిర్ణయము చేయబడినది.[2] అందు సింగనకాలము క్రీ. శ. 1347 అని నిర్ణీత మవడమేకాక, మఱికొంతమంది కవుల కాలాలు దాని ననుసరించి మార్చబడినవి.

పై గ్రంథముల కర్త లిర్వురును, శర్మగారి అభిప్రాయాలను పరిశీలించకుండా, యథాతథంగా గ్రహించి నందువల్ల, సింగనకాలాన్నిగూర్చి అవ్యవస్థ యేర్పడినది.

1. గ్రంథకర్త శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి. పుట — 82. ముద్రణము 1959.

2. గ్రంథకర్త శ్రీఆరుద్ర. నాలుగవ సంపుటం—రెడ్డిరాజులయుగం. పుటలు—76—78. (జూలై 65). దీనిపై విమర్శను అనుబంధములో చూడుడు.

వాస్తవంగా సింగన కాలనిర్ణయమునుగూర్చి భేదాభిప్రాయాలుండవలసిన అగత్యములేదు. ఈవ్యాసంలో పై యభిప్రాయాలను పరామర్శిస్తూ, సింగన కాల నిర్ణయానికి ఆధారమైన ఒక నూతనాంశమును ప్రకటిస్తున్నాను—

మొదట 'రెడ్డి రాజ్యముల చరిత్ర' గ్రంథములో వెలువరించిన యాక్షేపములకు సమాధానము

1. ఈ పద్యమున తిథి వారములు సరిగానే యున్నవి. అచ్చులోనున్న 'ప్రాకటిత మార్గశిర పంచమిని బొల్చు నుడుపాలసుతవాసరము నందున్' అను పాదమున పాఠము సరికాదు. అది ప్రాకటిత మాఘ సిత పంచమిని బొల్చు నుడుపాలసుతవాసరమునందున్' అని యుండవలెను. 'మాఘ సిత పంచమికి' అని వ్రాయుటకు బదులు లేఖకుడు 'మార్గశిర పంచమి' అని వ్రాసియుండవచ్చును. ప్రాతవ్రాతలలో నిట్టి లేఖనప్రమాదములు సహజములు— పరిశోధకుల కివి సుపరిచితములే!

పై పద్యమున 'మాఘ సిత పంచమి ' అనుపాఠముతో గ్రంథరచనా కాలముసరియగుచున్నది. దీని ననుసరించి—శార్వరి సంవత్సర మాఘ శుక్ల పంచమీబుధవారము — పద్మపురాణ రచనాకాల మగుచున్నది. దీనికి సరియైన ఇంగ్లీషు తేదీ 8—1—1421.

2. ఈ పద్యము పద్మపురాణ తాళపత్ర ప్రతు లెన్నింటి యందున్నదో తెలియ రాలేదు కాని, బ్రౌనుదొరవారి కాలమున, ఐదుప్రతులతో సంప్రతింపబడిన — పరిష్కృత ప్రతియం దున్నది.[1] ఈ కారణముచేత నిది యితరు లెంతమాత్రము చేర్చినదికాదు. ఇట్లని చెప్పుటకు వేఱొక యాధార మున్నది.

గ్రంథాంతమున కొంతమంది లేఖకులు పద్యములువ్రాయు నాచారము లేకపోలేదు. అయినను నా చూచినంతలో 'మంగళమహాశ్రీ'వృత్తము నెవ్వరును వ్రాయలేదు. మంగళమహాశ్రీవృత్తము గ్రంథాంతమున

1. మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారము. వివరణాత్మక సంపుటి 1. సంఖ్య 18. పుట 36. (1915.)

నున్నచో నది కవి వ్రాసినదే యని మనము గ్రహింపవలెను — ఏలననగా, కావ్యము 'శ్రీ'తో ప్రారంభించి మంగళమహాశ్రీ వృత్తముతో సమాప్తి చేయుట నన్నెచోడుని కుమార సంభవముతో ప్రారంభమైనది. తరువాతి కవులు క్వాచిత్కముగా దానిని పాటించినారు. అట్టివారిలో మడికి సింగన యొకడు[1]. కాబట్టి సింగనయే యీ పద్యరచయిత.

3. సింగన పేర్కొన్న తొయ్యేటి అనపోతనాయకుడు క్రీ. శ. 1347 లో నున్న అనపోతానాయకు డనుట కేయాధారములేదు. సింగన తనతండ్రి యైన అయ్యలు మంత్రి — తొయ్యేటి అనపోత భూపాలునకు మంత్రి యని చెప్పియున్నాడు. ఈ అనపోతనాయకుని శాసనములు రెండింటి లోను, అయ్యలుమంత్రి ప్రస్తావనయేలేదు. కాబట్టి శాసనోదాహృతుడగు అనపోతనాయకుడు సింగన పేర్కొన్న అనపోతనాయకుడు కాడని నిర్ణయింపవచ్చును.

4. మడికి సింగన ఎఱ్ఱాప్రెగడను పేర్కొనక పోవుటకు కారణ మతని స్వాతిశయభావమేయని ఇప్పటికేబదేండ్లకు పూర్వమే వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్ర కవుల చరిత్ర ప్రథమభాగములో సింగన జీవితమున వ్రాసియున్నారు.

ఇక మడికి సింగన క్రీ. శ. 1420 ప్రాంతము వాడే యగుట నిరూపింతును —

## I

సింగన తన జ్ఞానవాసిష్ఠ రామాయణమున,[2] తన తాత అల్లాడమంత్రిని గూర్చి యిట్లు వ్రాసి యున్నాడు —

సీ. అతడు తిక్కనసోమయాజుల[3] పౌత్రుఁడై
కొమరారు గుంటూరు కొమ్మ విభుని

1. నన్నెచోడని కవితాప్రభావము మడికి సింగనపై చాలగలదు. దానిని మఱియొకప్పుడు తెలుపుదును.

2. జ్ఞానవాసిష్ఠ రామాయణము—వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్ వారిచే ముద్రిత మైనది. రెండవ కూర్పు 1935.

3. ఇందే 'పుత్రుడై' అను పాఠము 6వ పుట యడుగున చూపబడి నది. కాని యిది సరికాదు.

పుత్రి చిట్టాంబిక బుధలోక కల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసారమగు కోటభూమి కృష్ణానదీ
దక్షిణ తటమున ధన్యలీల
నలరు రావెల యను నగ్రహారము తన
కేకభోగ్యంబుగా నేలుచుండి

గీ. యందుఁ గోవెల గట్టి గోవిందు నెన్న
గోపికానాథుని ప్రతిష్ఠఁ గోరి చేసి
యఖిల విభవంబులందున నతిశయిల్లె
మనుజమందారుఁడల్లాడమంత్రి విభుఁడు. (1-29)

పై పద్యము ననుసరించి, తిక్కననుండి అల్లాడ మంత్రికి మూడు తరములు గడిచినవి.

తిక్కన
|
1. వ తరము పుత్రుడు
|
2. వ తరము పౌత్రుడు—కొమ్మన
|
3. వ తరము—చిట్టాంబిక — భర్త అల్లాడమంత్రి.

అల్లాడమంత్రి కొమారుడు అయ్యలుమంత్రి కొడుకు మన సింగన—అప్పుడా వంశక్రమ మిట్లేర్పడును.

అల్లాడమంత్రి
|
4 వ తరము అయ్యలుమంత్రి
|
5 వ తరము సింగన

పై క్రమమునుబట్టి సింగన తిక్కనకు 5 వ తరము వాడ గుచున్నాడు. తిక్కన క్రీ. శ. 1260-70 ప్రాంతమువాడు గావున, తరమున కిరువదియైదేండ్లు లెక్కించినచో 1260 + 125 = 1385-1395 ప్రాంతము సింగనకాలమగును.

ఉపలబ్ధములైన జ్ఞానవాసిష్ఠరామాయణ ప్రతులలో పౌత్రుడని యున్నను —అచ్చట సరియగు పాఠము ప్రపౌత్రుడని యుండనగును. అచటి పాఠము—

"అతడు తిక్కన సోమయాజి ప్రపౌత్రుడౌ కొమరారు గుంటూరి కొమ్మ విభుని" అనునది. ఈ పాఠమిట్లే యుండదగుననుటకు ప్రమాణ మున్నది. తిక్కన సోమయాజి వంశవృక్షమిప్పటికి దెబ్బదియేండ్ల క్రిందట ప్రకటితమైనది.[1] అందిట్లుగలదు—




ఈ కొమ్మన తిక్కన ప్రపౌత్రుడైనప్పుడు మడికి సింగన సరిగా క్రీ. శ. 1420 ప్రాంతము వాడగును—

## II

ఆంధ్ర సాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున తాళపత్రప్రతులలో జ్ఞానవాసిష్ఠ రామాయణ ప్రతి గలదు. దాని సంఖ్య 1157/16. ఆ ప్రతిలో 190 తాటాకు చివర నీ క్రింది పద్యము గలదు.

'శ్రీకర శకాంకములు
సింధు రవ రామయుత
శీతకరమైన పరిధావిన్
ప్రాకట వసంతయుత

1. అముద్రిత గ్రంథచింతామణి— సం. 9. సంచిక 11; నవంబరు, 1896. ఇందావంశవృక్షమును గూర్చిన సంపూర్ణవివరములు గలవు. నా 'తెలుగు కవుల చరిత్ర' తిక్కనయుగమున—తిక్కనకు పూర్వముగల ఏడుతరములతో నీ వంశవృక్షము జతపఱచి విపులముగా వ్రాసితిని. అది అముద్రితము. తెలుగు కవులలో నాటినుండి నేటివఱకు నవిచ్ఛిన్నముగానున్న కవికుటుంబములలో తిక్కనదొక్కటియే యని చెప్పవచ్చును.

ఫాల్గునమునందు
సితపంచదశి కావ్యతిథి కావ్య
శ్రీకి నిధియౌ
మడికి సింగన తెనుంగున
వసిష్ఠ రామాకృతి
యొనర్చెన్ —
చేకొని యహోబలము
శ్రీనరమృగేంద్రునకు
క్షేమముగ మంగళమహాశ్రీ.'

ఇది మంగళమహాశ్రీవృత్తము. సింగనపేరు— కృతిపేరు కూడ నుండుటచేత నిది సింగనకృతమే యనుట నిర్వివాదము. ఇదియు, పద్మపురాణము నందలి మంగళమహాశ్రీ వృత్తము సింగనకృతమే యని నిర్ధారించుచున్నది.

ఇందు జ్ఞానవాసిష్ఠకృతి రచనాకాలము కలదు శకాబ్దములు సింధు —4, రవ—5 (పంచమహావాద్యధ్వనులు), రామ—3 (పరశురామ, శ్రీరామ, బలరాములు), శీతకర—1. ముందటి సూత్రము ననుసరించి— ఈ కాలము శకము—1354. దీనికి క్రైస్తవ శకాబ్దము 78 కలిపిన —1354 + 78 = 1432 అగును. కావున జ్ఞానవాసిష్ఠకృతి రచనాకాలము క్రీ శ. 1432. శకాబ్దములేకాక, తక్కిన వివరములను పద్యమున గంపు. పరీధావి సంవత్సర ఫాల్గున పౌర్ణమి శుక్రవారమున నీ కృతి ముగిసినది—అది క్రైస్తవ శకము. 1—3—1433 తో సరిపోవుచున్నది.

పై జ్ఞానవాసిష్ఠ రచనాకాలము క్రీ. శ. 1420 అగుట సమంజనమే యగుచున్నది. అయితే వీని రెంటి నడుమ పండ్రెండేండ్లువ్యవధి యున్నది. ఈ పండ్రెండేండ్లలోను, సింగన భాగవత దశమస్కంధ ద్విపదను రచించినట్లు సూత్రమే జ్ఞానవాసిష్ఠము నుండి తెలియుచున్నది. జ్ఞానవాసిష్ఠము వెనుక మడికి సింగన సకలనీతి సమ్మతమును రచించెను. ఇది సమగ్రముగా దొరకక పోవుట గ్రంథాంతమున నెట్లున్నది తెలియుటలేదు. ఎట్లున్నను, నీ పండ్రెండేండ్లను సింగన సకలనీతి సమ్మతము రచించుటకు గ్రంథసేకరణము చేసి రచన నారంభించి యుండునని తలంచుట సమంజసము.

సకలనీతి సమ్మతి పీఠికలో నా గ్రంథ రచన క్రీ. శ. 1430 ప్రాంతము కావచ్చునని కలదు. కాని పై జ్ఞానవాసిష్ఠ రచనా కాలమువలన, సకలనీతి సమ్మతము క్రీ. శ. 1440 లోపుగా రచితమైనదని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఈనూతనాధారమునుబట్టి, సింగన పేర్కొనిన తొయ్యేటి అనపోత భూపాలుడు క్రీ. శ. 1347 ప్రాంతమునన్న అనపోతనాయకుడు కాడనియు, నాతని కుమారుడో మనుమడో యనియు నిశ్చయింప వచ్చును.

సింగన క్రీ. శ. 1400—1440 ప్రాంతమున వెలసి, శ్రీనాథ మహాకవి సమకాలీనులలో నొకడై యుండెననుట స్పష్టమగుచున్నది.

ఇక గ్రంథమును గూర్చి తెలిసి కొందము.

## 6. గ్రంథస్వరూపము - మూలప్రతి

ఈగ్రంథ ప్రథమ ప్రకటన కర్తలైన కవిగారు తమ ఉపోద్ఘాతములో "శ్రీమంతు రాజామున్కూర సీతారామభూపాల బహద్దరువారు.........సకలనీతిసమ్మతమును లిఖింపబడియుండు కాగితపు సంపుటమును ముద్రణార్థమొసంగిరి" అని దీని మూలప్రతిని గూర్చి వ్రాసియున్నారు. మరియు వారే-

"సకల నీతిసమ్మతము లేఖకదోష సహస్రపూరిత మగుటచే నా దర్శాంతరము కొఱకుఁ జిరకాలము ప్రతీక్షించియు లభింపమింజేసి తుదకున్న దానిని సవరించి ప్రచురించుటయే మేలని తలంచి" కైలాసవాసి విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావుగారి "సహాయ సంపత్తితో" లోకమున కందించినట్లు తెలిపియున్నారు. ఇందువలన దీనికి మూలము కాగితపు ప్రతియేగాని తాళపత్రప్రతికాదనుట తెల్లము. ఈ తరువాత తాళపత్ర గ్రంథగవేషణ ఎంతో జరిగినను దీనికి ప్రతిలభ్యము కాలేదు.[1] అయినను తమకు లభించిన ప్రతితో దీనిని ముద్రించి ప్రకాశమాన మొనర్చిన మానవల్లి కవి మహోదయులకు వారు ప్రకటించిన తక్కిన కృతులకు వలె, తెలుగుదేశము శాశ్వతముగా ఋణపడియున్నది.

1. తెలుగులో కొన్ని ప్రాచీనకావ్యములకు తాళపత్రములు లభింపలేదు. ఎఱ్ఱన నృసింహపురాణమునకు నేటికిని తాళపత్రప్రతి లభింపలేదు. కొన్నింటికి-నన్నెచోడుని కుమారసంభవము, కేతన దశకుమారచరిత్రము మొదలగు వాని కొక్కటే ప్రతి. తాళపత్రగవేషణ తీరాంధ్రప్రాంతము, రాయలసీమ, దక్షిణదేశములలో జరిగినట్లు పూర్వ హైదరాబాదు రాజ్యమున నెంతమాత్రము జరుగలేదు. విశాలాంధ్ర మేర్పడినను, ఆ పని ప్రారంభము కాలేదు. గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, అమరచింత, పాల్వంచ, చిక్కనవోలు, దోమకొండ- ఈ సంస్థానములలోను వితరత్ర వందలకొలది తాళపత్ర గ్రంథము లున్నవి. వానిపరిశోధనసాధికారముగా జరిగిన, తెలుగున నీనాటి కెఱుగరాని ప్రాచీనకృతులు తప్పక లభింపగలవు. ఇదిచేయుట ప్రకృతమెంత

లుప్తములు—పూరణములు

పైనుదాహరించిన కాగితపు ప్రతియైనను అది కవి గారికి లభించు నాటికి చాలాకాలమునకు ముందు వ్రాయబడినదగుటచేత కాబోలు అందందు లోపములగుపడుచున్నవి. అవి తాళపత్రమూలమునం దున్నవేమో తెలియ రాదు. వాని వివరణ-

ప్రథమాశ్వాసమున లుప్తములులేవు.

ద్వితీయాశ్వాసమున 401. సీ. సత్కులుండు......ఇందు నాల్గవపాదము ఎత్తుగీతి మొదటిరెండు పాదములు లేవు.

తృతీయాశ్వాసమున లుప్తములు హెచ్చుగా నున్నవి.

646. సీ. "తన సమానుండగు"— ఇందు మూడవపాదము లేదు.

651. సీ. "వైద్యులు వంటలవారు"- ఇందు మూడు నాల్గు పాదములు ఎత్తుగీతిలో పాదము లేవు.

652. వ. ఇందు మూడుపంక్తులు లేవు; ఉన్నవానిలో కొన్నియక్షరములు లుప్తములు,

653-657. ఇందు ఒక సీసము, అయిదు కందపద్యములు గలవు. అన్నింటి యందు పాదములు పాదభాగములు లోపించినవి.

యావశ్యకమో, ఒక్క ఉదాహరణము చూపుచున్నాను-

విష్ణువర్ధన మంత్రి బృహజ్జాతక తెలుగు టీక- చాలా ప్రాచీనమైనది; దీనినిగూర్చి కవిగారు తెలిపినారు (భారతి-అగస్టు-1927). దీని ప్రతి తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయమున మాత్రమే గలదు. నేను 1949 లో దానిని పరిశీలించి నా తెలుగుకవుల చరిత్రలో దానిని గూర్చి వ్రాసితిని. తంజావూరి ప్రతి అసమగ్రమగుటచేత నేను వ్రాసినది నాకే తృప్తికరముగాలేదు.

రెండుమూడేండ్ల క్రింద- తాళపత్రగ్రంథపరీక్షకై మహబూబు నగరము వెళ్లగా అచ్చట శ్రీ నారాయణస్వామిగారి తాళపత్రగ్రంథసంచయములో విష్ణువర్ధనమంత్రి బృహజ్జాతక టీక-సంపూర్ణప్రతిచూచి చాలా ఆశ్చర్య పడినాను- ఈ బృహజ్జాతక టీక క్రీ. శ. 11 వ శతాబ్దిదో లేదా క్రీ.శ. 12 వ శతాబ్దిదో కావచ్చును.

ఇట్టియపూర్వగ్రంథము లింకమా ఎన్ని యీ ప్రాంతమున నజ్ఞాత వాసముచేయుచున్నవో తెలియరాదు.

6/9 మ. "మృగముల్" ఇందు మూడవపాదములో చివరకొన్ని యక్షరములు లేవు; నాల్గవ పాదములో చాలాభాగములేదు.

858 సీ. "కందరోన్నత"...ఎత్తుగీతిలో చివర పాదములో కొంతభాగము లేదు.

859 గీ. మొదటి రెండు పాదములు లేవు.

894 క. "పగయడప" మూడు నాలుగు పాదములులేవు.

911 మ. "తనకున్ గెల్వఁగ" నాల్గవ పాదమున రెండక్షరములు లేవు.

అచ్చులో పైస్థలముల యందన్ని చోట్లను చుక్కలుపెట్టి లుప్తభాగములు స్పష్టముగా ప్రదర్శితము లైనవి.

పూరణములు-కుండలీకరణము

కాగితపు ప్రతిలో పైని చూపినపట్టులుగాక, మరికొన్ని పద్యములలో-కుండలీకరణము చేయబడి, పూరణములు కనబడుచున్నవి. కుండలీకరణమనగా లభ్యమైన మూలగ్రంథ ప్రతిలో-అచ్చటచ్చట-పద్యములు పద్యభాగములు లోపించిన, గ్రంథ సంపాదకులైన పరిష్కర్తలుగాని, ఇతరులుగాని-కవిహృదయానుసారముగా, కథాసందర్భము ననుసరించి- ఆ లుప్తభాగములను పూరించుట. సాధారణముగా నిట్టి ప్రాచీనకావ్యములకు సంపాదకులు పరిష్కర్తలు-కవులు పండితులే గావున-వారే ఈ పూరణములను చేయుచుండిరి. ఈ గ్రంథమున పరిష్కర్తలైన కవిగారే ఈ క్రింది పూరణములను గావించిరి.

మొదటి పద్యము-స్వామిత్రి [లోకనాథుడు].

183 సీ. ఆ. వె. నతఁడ [మంత్రివర్యుఁ] డవనిపునకు.

196 సీ.. కన్నగాంద్రును జూదగాండ్రు తెక్కలి కాండ్రు

వాటవికులు [పౌలయరులు] తగవు.

650 సీ. 4వ పాదము—(ధైురు) భేదముగఁజేయనొయ్యె
ఎత్తుగీతి. 4వ పాదము—(నాఁగ జగతిఁబరఁగు).

658 క. వనితాసక్తియు బానం
బును జూదము వేఁట యర్థము [నదూషణ మొ
ప్పనిదండమ్మను వాక్కన
ఘనపరుషత వ్యసనసప్తకం] బనఁబరఁగున్.

668 మ మృగయా యానగుణంబుఁ న్ బడయు సంప్రీతిన్ బ్రజాధీశుఁడీ
మృగయాక్రీడన సద్విధిన్ (గుశలియై మేకొన్నఁగా కన్యథా
మృగయుంబోలె యథేచ్ఛ దుర్గవన భూమింజొచ్చి వేఁటాడినన్
వగలంబొందఁడె శత్రుసత్త్వవిపదధ్వక్లేశ విభ్రాంతుఁడై).

ఇందు పద్యమున-రెండుపాదములు, ఒక పాదమర్థము-పూరణమే.

855 సీ. ఆజిలోపల రిపురాజుఁజంపిన వాని
కొగి నియుతార్థ మీనోపచుఁడు
(దానిలో నర్థంబు తత్పుత్రుఁజంపిన
సేనాపతి వధింపఁజెల్లు నంతె
పదివేలు వీరాధిపతిఁజంప నగమందు
నేనుఁగైన రథంబు నైనఁగూల్ప
నాశ్వికాధీశ్వరు నడగింప నొకవేయు
నందర్థమాశ్విక హతికినీగి

ఆవె. నగుఁబదాతిముఖ్యు నాజిలోమార్కొని
బారిసమర నూఱు పణములీయ)
నితర జనులఁదలకు నిరువదియును వారి
భోగమిను మడింప నీగి యొప్పు.

ఈ సీసపద్యమున మూడుపాదములు, ఆ.వె. మొదటి రెండు పాదములు కవిగారి పూరణములే: ఈ పద్యమే కాక, పైపద్యములు కామందకాది గ్రంథములలోనివి. వానికి సంస్కృత మూలమున్నది. మూలమును బట్టియే కవిగారు వానినిపూరించిరి-లేనియెడల సందర్భము ననుసరించియవి యతుకవుగదా.

పూరణముల ప్రాముఖ్యము

ప్రాచీన కావ్యపరిష్కరణమున నీపూరణముల కత్యంతప్రాధాన్యము గలదు. ఇట్టి పూరణములు స్పష్టముగా, కుండలీకరణముచేసి, పూరించినవారిపేరు తెల్పిచూపక పోయినచో, వాఙ్మయపరిశోధనకు విమర్శనకు-ఎంతో అనర్థము గలిగించును. దీనికొక యుదాహరణ చూపుచున్నాను—

ప్రాచీనకావ్యములలోని పూరణకుండలీకరణవిధానమునకు మార్గదర్శకులైన వీరేశలింగము పంతులుగారు, నాచనసోముని యుత్తరహరివంశము ప్రథమముగా క్రీ. శ. 1900 లో తంజావూరి పుస్తకభాండాగారమునుండి ప్రతి వ్రాయించి తెప్పించి ముద్రించిరి. అందు, ప్రథమాశ్వాసములో చివరభాగము లేనేలేదు.

వీరేశలింగముగారు దానిని పూరించి, కుండలీకరణము చేసి దానిని ప్రకటించిరి. వారు కుండలీకరణము చేసిన భాగమును, వావిళ్లవారు- ఆ గ్రంథమును తాము ముద్రించునపుడు చూపకుండగనే-గ్రంథమూలముతో అచ్చువేసిరి. దీనివలన నేమైనది ? వీరేశలింగముగారు పూరించిన భాగము ఉత్తరహరివంశములో నాచన సోమనాథుని కవితగానే-పరిగణితమైనది.

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు "ఆంధ్రవాఙ్మయమున నాచన సోమనాథున కీయఁదగిన స్థానము" అను వ్యాసమున-ఆ భాగముకూడ నాచన సోమనాథకృతమే యని, పూర్వాపరపదసందర్భములు విచారింపకయే నిశ్చయము చేసి విమర్శసాగించిరి. కీర్తిశేషులు విమర్శాదర్శక నడకుదిటి వీరరాజుగారు-తమ సోముని హరివంశము అనువ్యాసమున తాళపత్రపరిశోధనచేసి, ఈ భాగము నాచనసోమనాథుని రచన కాదని, వావిళ్లవారు కుండలీకరణము చేయకుండ, చేసినవారిపేరు చెప్పకుండ నుండుటచే నిట్టి అవ్యవస్థవచ్చినదని నిరూపించిరి.[1]

ఇంత ఎందుకు, ఈ గ్రంథప్రచురణకర్తలైన రామకృష్ణకవిగారే-క్రి. శ. 1908, 1914 లో నన్నెచోడుని కుమారసంభవ ప్రథమ, ద్వితీయ భాగ

1. ఉత్తరహరివంశము తరువాతి ముద్రణలో(1952)నేను దీనిని సరిచేసి ఆ ప్రథమాశ్వాసములో భాగము లుప్తముగానే ముద్రింపజేసితిని.

ముద్రణములో, నీ పూరణ కుండలీకరణ విధానమునే అవలంబించి యుండిన యెడల, కుమారసంభవము పాఠభేదముల విషయమై - అరవై యేండ్లనుండి నేటివఱకు నవిచ్ఛిన్నముగా సాగుతున్న వాదోపవాదములకాస్కారమే లేకుండ నుండెడిది. అంతేకాదు పూర్వగ్రంథపాఠములను మార్చివేయుదు రన్న వాదమునకు కవిగారు గురియై యుండెడి వారు కారు.[1]

పద్యపరిశీలన

287. సీ. భద్రసేనుఁడు నిజపత్నియింటికిఁ జన
నతని తోఁబుట్టువ యతని ఁదునిమెఁ
దల్లి మంచము క్రింద నల్లన యడఁగి తాఁ
బుత్రుండ కారూషు బొడ వడంచె
లాజలు విషమున నోజించి తేనియ
యని కాశిరాజుఁ దద్వనిత యడఁచె
గరళాక్త మేఖలా ఘనమణి సౌవీర
భూపు వైరంత్యు నూపురము చేత
జాతుషీశ స్త్రింబు జడ యందు నిడుకొని
రమణి యొక్కత విదూరథునిఁ జంపు

గీ. కెటిఁగి నమ్మక సతి యింటికేగఁ జనదు
కెరలి శత్రుల పయిఁ బ్రయోగింప వలయు. —కామందకము

ఈ సీసపద్యమున 5 పాదములు గలవు. ఎత్తుగీతిలో రెండే పాదములు లున్నవి. తక్కిన రెండు పాదములులేవు. లేనట్లుగా నిందు చూపబడినవి.

యతిచ్యుతులు

196. సీ, గీ. 3 వపాదము
"లంచములు గొన్న ధరయెల్లఁ బాడు గాదె"

1. కుమారసంభవ ముద్రణ విమర్శన యిచ్చట ప్రసక్తము కాదుకావున నావిషయ ప్రస్తావన విరమించితిని.

518. సీ. "ప్రాకార రక్షార్థమై యఖిలంబైన"
ఇచట యతిగాని ప్రాసగాని లేదు.

ప్రాకారశబ్దమున 'ప్రా'లో యతివిరుగదు; (ప్ర + అ) కాదు.
''ప్రకర్షేణ క్రియత ఇతిప్రాకారః డుకృఞ్ కరణే'' అని అమరము.

637. ''గానెఱింగి యుచిత కాలము తోడ ను
పేక్ష యోజమీఁదఁజేయ వలయు.

కవిగారిముద్రణమున నివియిట్లే నిలిచియున్నవి. దీనికి ప్రత్యంతరము నేటికి లభింపకపోవుటచే నీముద్రణమున నట్లే నిలుపబడినవి.

ప్రశ్నార్థకచిహ్నము

ఇందు పూర్వముద్రణమున కొన్ని పద్యములకు ? చిహ్నములున్నవి. ఈ ముద్రణమున నలఁతి మార్పులతో పద్యములు సరిచేయబడి, యవితీసివేయబడి నవి.

111. ఉ. కాపునఁ గాపులొక్కటికి ఁగాఁగలహించినవక్రశీలులై
చేవిరులం గృషిక్రియలు సేయక తక్కిన నెన్ను పన్నుకున్
గావడిఁ బోరిన న్మనవి కాలమెఱుంగక చెప్పిరేనియున్
భూవరు నెగ్గుగాఁగొనక బుద్ధివిధిం జనువిత్తురాత్మలై.(?)

పై పద్యమున, 'శీలులై' అనుచోట 'శీలురై' అనియుండవలెను.

భూవరునెగ్గుగాఁ గొనక అనుచో'భూవరులెగ్గుగా' అనియుండవలెను. అర్థమిది. కాపులు (రైతులు) ఒక్కటై కలహించినను, శీలముతప్పి సేద్యము చేయక పోయినను, కాలముకాని కాలమున రాజుగారి వద్దకు వచ్చి మన వులు చేసికొన్నను రాజులు వారిని అనగా కాపులను తమకు హానిచేయు వారినిగా భావింపక, వారిని ఆత్మీయతతో చనువుగా చూచెదరు. ఇచట ఆత్మీయులై అనుటకు 'ఆత్మలై' అనివాడబడినది.

180 అడపఁ గలంతియ (?) బానసి
యొడలంటుట వైద్యమొద్దనుండుట తనకుం

గుడువఁగఁ బెట్టుట యను పను
లడరఁగ నాప్తులనె పంచునధిపతి సుమతీ.'

ఇందుప్రశ్నార్థక చిహ్న మావశ్యకములేదు.

**అడప-అడపపని- అనగా తాంబూల పేటిక ధరించు పని.**

**అడప- తాంబూలకరండవాహి.** బాలవ్యాకరణము.

గలంతియ- గలంతియపని- పాత్రలు పెట్టుపని

బానసి- వంటపని
ఒడలంటుట- స్పష్టము
వైద్యమొద్దనుండుట- ,,
కుడువఁగఁబెట్టుట- ఆహారముపెట్టుపని

ఈపనులకురాజు- ఆప్తులనే నియమింపవలెను గానిఇతరులను నియమింపరాదు అని అర్థము.

గ్రంథపద్యసంఖ్య

ఈ గ్రంథమున మూడాశ్వాసములున్నవి. అయినను ప్రత్యేకముగా ఒక్కొక్క ఆశ్వాసమునకు వేఱుగా పద్యసంఖ్య యీయబడలేదు— ఆశ్వాస విభజనమున్నను గ్రంథమంతటికి నొకేసంఖ్యయున్నది. ముద్రితమున గ్రంథ పద్య సంఖ్య-992.

కాని యీసంఖ్యసరికాదు. మొదట ఇందు 191 వ పద్యము

క. బలిమియుఁ గలిమియుఁ గలిగిన
నలఘుమతీ! తెగువవల్లయు నవనీశునకున్
దలపోసి చూడవలదా
బలవాచా పృథివి భూమిపాలుర కెల్లన్.

అనునది- 959 వ పద్యముగా తిరిగి ముద్రితమైనది- అందుచే గ్రంథసంఖ్య 991. ఇంకను పరిశీలింపగా- రెండుపట్టులసంఖ్య లీయబడలేదు-

854 సంఖ్యతరువాత సీ. ఆజిలోపల......

గీ. భోగమినుమడింపనీగియొప్పు. అను పద్యమునకు సంఖ్యలేదు.

ఇట్లే 857 సంఖ్యతరువాత-

సీ. కందరోన్నతశైల గహననదీతట....

గీ॥ జనవిభుఁడు అను పద్యమునకు సంఖ్యలేదు. ఈ రెండింటికి సంఖ్యలనిచ్చిన 991 + 2 = 993 మొత్తముగ్రంథసంఖ్యయగును.

**ఈ 993 లోను- ఆశ్వాసాద్యంత పద్యములు- 11-**

**(ప్రథమ-3 ద్వితీయ-4, తృతీయ 4)- పోగా** మిగిలినవి **982.**

ఇవి గ్రంథవిషయమునకు సంబంధించినవి.

వీని వివరములు-అనగా, ఉదాహృతగ్రంథములలో నే యేగ్రంథములలో నే పద్యసంఖ్యలుగలవో అవి యనుబంధమున చూపబడినవి.

## 7. ఉదాహృత గ్రంథములు

ఈ సంకలనగ్రంథమున నీ క్రింది శీర్షికలపై పద్యము లుదాహరింపబడి యున్నవి.

అజ్ఞాతము
కామందకము
కుమారసంభవము
కేయూరబాహుచరిత్ర
చాటువులు
చారుచర్య
ధృతరాష్ట్రనీతి
ధౌమ్యనీతి
నీతితారావళి
నీతిభూషణము
పురుషార్థసారము
బద్దెనీతి
భీష్మపర్వము
మదీయము
మార్కండేయ పురాణము
మిత్రనీతులు
ముద్రామాత్యము
విదురనీతి
శాంతిపర్వము
శాలిహోత్రము

నీతిసారము
పంచతంత్రి
పద్మపురాణము

శ్రీగిరీశశతకము
శ్రీరామాయణము
సభాపర్వము
సౌప్తికపర్వము

పై శీర్షికలలో అజ్ఞాతము, చాటువు, మదీయము అనునవి మూడును గ్రంథములుకావు. ధృతరాష్ట్ర ధౌమ్య విదుర నీతులు భారతమున- ఆశ్రమవాస విరాటోద్యోగ పర్వములలోనివి. భీష్మ, శాంతి, సభా, సౌప్తిక పర్వములు భారతభాగములోనివి. కాబట్టి ఈ యేడును నాకే గ్రంథము. ఇందు వలన నిందుదాహరింపబడిన గ్రంథసంఖ్య పదిహేడు అని చెప్పవలెను.

ప్రస్తుత గ్రంథోదాహృతపద్యములను, లభ్యములైన వానితో సంప్రతించినప్పుడు, కొన్ని కానవచ్చుటలేదు. కొన్ని ఒక గ్రంథమునకు బదులు. మరియొక గ్రంథమునుండి యుదాహరింపబడినవి. గ్రంథకర్తయే స్వయముగా వ్రాయించిన ప్రతిగాన లేఖనప్రమాదమనుటకు వీలులేదు. వానివివరము——

24 క. అమరఁగ వేల్పులచేఁ గ
ల్పము చెప్పియ కాదె వరము వడసిరి మును బా
ణ మయూరాదులు సత్కా-
వ్యముఁ జెప్పినఁ బడయరాని వస్తువుగలదే.

ఇది కృతి ప్రారంభములోనిది, ఆకరములేదు, ఇది సింగనదికాదు. సింగనకు మూడువందలయేండ్లముందు వెలసిన కవిజానాశ్రయము[1] లోనిది- చూ. సంజ్ఞాధికారము-9 వ పద్యము.

130 వ్యవసాయము కొలఁదియు దే
శవిధముఁ గాలంబుఁ బూర్వసంచితమగు సొ
మ్ము విచారింపక యుబ్బునఁ
దివిరి వ్యయము సేయునరుఁడు దీనతఁ బొందున్

—బద్దెనీతి.

1. కవిజనాశ్రయము- వావిళ్ళముద్రణము-1952.

ఈపద్యము- బద్దెనీతులలోలేదు. కేయూరబాహుచరిత్ర-3 -163లోనున్నది.

149 స్వామియు మంత్రియు దుర్గ
స్తోమము రాష్ట్రంబు ధనము సుహృదులు బలమున్
గా మహి సప్తాంగంబులు
నేమఱక యొనర్పవలయు నిందుల రక్షల్

—నీతిభూషణము.

ఇది కేయూరబాహుచరిత్ర—4-204లోనున్నది.

160 కలిమియె చూపుచు నొరులకు
ఫలియింపని రాజసంబు పని యేమిటి కి
యిల కేల బూచిరాజస
మలవడఁ గొఱమాలినట్లు యౌబళకందా —మదీయము

ఇందు- కందనమంత్రి సంబోధనయుండుటచే-నిది నీతితారావళినుండి గ్రహింప బడినది.

180. అడఁప గలంతియ (?) బానసి
యొడలంటుట వైద్యమొద్ద నుండుట తనకుం
గుడువఁగ బెట్టుట యనుపను
లడరఁగ నాప్తులనె పంచు నధిపతి సుమతీ.[1]

—పురుషార్థసారము.

ఈపద్యమునకు- "సుమతీ" అను మకుటమున్నది. ఇదిపురుషార్థ సారమునందలి పద్యముగా నుదాహరింపబడి యున్నది. కానియిందు పురుషార్థసారమునుండి గ్రహింపబడిన, ఏ యితరపద్యము లందును "సుమతీ" అనుసంబోధనము కాన రాదు. కాబట్టి యిది బద్దెన సుమతిశతకమునుండి సింగన యుదాహరించి యుండును.[2]

1. దీనినిగూర్చి పశ్నార్థకచిహ్నములు అనుశీర్షిక చూడుడు.
2. ప్రస్తుతము వ్యాప్తిలోనున్న సుమతిశతకము తాళపత్రములతో సరిచూచి ప్రకటింప బడినదికాదు. క్రీ. శ. 1868 నుండి, యిదిముద్రిత మైన ప్రథమ ముద్రణ ప్రతినుండియే పునరుమ్ద్రిత మగుచున్నది. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు, తమవద్దనున్న తాళప్రతిలో నిపుడచ్చులో నున్న సుమతిశతకములో లేని, ఏబది పద్యములను క్ర. శ. 1938.లో సంపుటి. 27 సంచిక 121-128 పుటలలో ముద్రించిరి. పైపద్య మిందును లేదు. కాని సింగన కాలమునాటి కుండి యుండవలెను. పద్యరచనము బద్దెననే తల పించు చున్నది. సుమతిశతకమున కుపలభ్యమైన తాళపత్రప్రతులతో సంప్రతించి దానిని ప్రకటింపవలసియున్నది. ఇదిచాలా ప్రాచీన కృతి.

243. సీ. పగలేచి పెట్టు నాపదల నుపేక్షించు
మేలు చేసినలేఁత గాలిఁ బుచ్చు
మిన్నక కోపించు మెచ్చెనేనియు నీ యఁ
డడుగుచో విన్నపమాలి సేయు
బని నాసగొల్పుఁ దత్ఫలసిద్ధిఁ దప్పించు
నిష్ఠురంబులు పల్కనేర్పుఁ దెగడు
మర్మంబు లాడుఁ బ్రమాదంబుఁ దొడరినఁ
బోనీడు నిక్కంబు బొంకుసేయు

ఆ. మాట లాడ నాద మాన్పించు నడుమన
సెజ్జఁబట్టుఁ గొలువుఁ జేరినపుడు
వెడఁద నిద్రవోవు విరసచిత్తుండైన
మానవేశ్వరుండు మంత్రి సోమ ! — చాటువు.

ఈ చాటువున పేర్కొనబడిన మంత్రి సోముడు కొలని సోమ మంత్రి; కొలనిరుద్రుడనియు నీతనికి నామాంతరము. ఈ మంత్రివంశీయుడైన కొలని గణపతిదేవకవి యీతని గూర్చి యిట్లు చెప్పియున్నాడు-

" లీలఁగొలని మండలీకుల నోడించి
కొలని సోముఁడనఁగఁ బరగె జగతి ''

శివయోగసారము- అవతారిక

295 సీ. ఆయవ్యయంబుల
296 గీ. వ్రాయఁడేని
297 సీ. సరులు గ్రుచ్చిన యట్లు
298 సీ. పదియంక నంబును
299 సీ. దొరలు ప్రజలు బంట్లు

ఈ యైదు పద్యములు - 'మదీయము' క్రింద నుదాహృతములు. అయితే యీ అయిదింటి యందు కందమంత్రి సంబోధనలున్నవి గాన నివినీతి తారావళిలోనివి.

344. ఉ. మేధయు వాక్పటుత్వమును
..........సుగుణోన్నత యబ్బయకంద ధీమణీ.
— మదీయము.

కాని కందమంత్రి సంబోధన యుండుటచే నిది నీతితారావళిలోనిది.

401 సీ. సత్కులుఁ డౌదార్య సంపన్నుఁ......

.................

— చాటువు.

కాని, ఘనకళాభోజ ! యబ్బయ కందరాజ! యను సంబోధనయుండుటచే నిది నీతితారావళిలోనిదే.

487 క. చనువాఁడు సేయుకార్యంబున......

488 గీ. రాజు పెద్ద పలువురకు............

489 గీ. ఉత్తమాసనములు నుత్కృష్టవాహనంబులు...

—ధృతరాష్ట్ర నీతి.

అని ముద్రణమునగలదు. కాని ఇవి విరాటపర్వమున ధౌమ్యనీతిలో 1-125, 1-126, 1-132 పద్యములుగానున్నవి.

704 గీ. నీతిపథముఁ దప్పినెఱి వేగపడిచేయు....

ఇది కామందకములోనిదని ముద్రణమునగలదు కాని యిది సింగన పద్మపురాణము 3-50 లో నున్నది.

717 గీ. అంధకారంబునప్పుడు నడఁగిపోదు....

ఇది ముద్రామాత్యములోనిదని కలదు. కాని యిది సింగన జ్ఞానవాసిష్ఠ రామాయణములోనిది (1-170).

785 చ. మునుకొని దేశకాలబలమున్...

ఇది ముద్రామాత్యములోనిదని కలదు. కాని యిది నన్నెచోడుని కుమారసంభవము (10-189) లో నున్నది.

973 గీ. దేవగురుని బోలు ధీమంతుఁడైనను
వేగమొరుల వలదు విశ్వసింప
విమలయశము సుఖము విత్తంబు వృద్ధియు
వర్ణనీయజయము వడయువాఁడు.

980 గీ. దేవగురుని బోలుధీమంతుఁడైనను
నమ్మవలవ దహితు నమ్మవలవ
దతుల యశము మిగుల నాయువు వృద్ధియు
భూరి సౌఖ్యములను గోరువాడు.

—పంచతంత్రి.

పై రెండు పద్యములు ఎత్తుగడలోనేకాక భావములలోను పదముల లోను సమానమే. అప్పుడు ఇవి రెండు "పంచతంత్రము"ల లోని వగునా ? పరిశీలింపవలయును.

పై పద్యము లొకరినుండి మరియొకరు గ్రహించి యుండగూడదా యన్న మనకు, కామందకము, పంచతంత్రి మున్నగువాని కాలములు తెలియవు. ముద్రామాత్యకర్త కాలము సునిశ్చితముగా తెలియనందున – ఎవరినుండి, ఎవరు గ్రహించిరో నిరూపించుట కష్టము.

## 8. ఉదాహృతగ్రంథములు; కవులవివరణ. అలభ్యగ్రంథములు

### కామందము

ఇందుదాహరింపబడిన గ్రంథములలో కామందకము ప్రధానమైనది. అందుండి 310 పద్యములు గైకొనబడినవి. అనగా గ్రంథములో మూడవభాగ మీ కామందకమే. కాని యీ కృతి రచయితపేరు తెలియదు. ఈ కృతిరచన క్రీ. శ. 1430కి పూర్వముదనుట స్పష్టమే.[1]

### పంచతంత్రము

కామందకము తరువాత హెచ్చుపద్యములు గైకొనబడినది పంచ తంత్రము. ఇందుండి 189 పద్యములుగలవు. ఈగ్రంథకర్తయు తెలియరాలేదు.

1. కామందకమును నెనిమిదాశ్వాసముల పద్యకావ్యముగా క్రీ.శ.1584లో జక్క రాజు వెంకటరాజు తెలిగించెను. అది మదరాసు రాష్ట్రప్రభుత్వమువారిచే క్రీ.శ. 1950లో కొ త్తిశేషములు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పీఠికతో ప్రకటితమైనది. దీనిని సంపూర్ణముగ క్రీ. శ. 1860లో తడకమళ్ళ వేంకటకృష్ణారావుగారు వచనముగ రచియించిరి. ఇందిరువది యధ్యాయములు గలవు. (అముద్రి తము). చూ. ఆంధ్రవచన వాఙ్మయము .—పుట 116.

ఇంక అలభ్యములు; కవులు తెలిసినవి.

నీతిభూషణము

ఇందుండి 25 పద్యములు గలవు. దీనిని ఆంధ్రభోజుడను కవి రచించిన ట్లొక లక్షణగ్రంథమున గలదు. బాలబోధలక్షణమున దీనిలోనుండి పెక్కుపద్యము లుదాహృతములైనవని, ఈ గ్రంథమునలేని రెండుపద్యము లను కవిగారుదాహరించియున్నారు.[1]

నీతిసారము

ఇందుండి 114 పద్యములు గలవు. దీనికర్త విద్యాభూషణ బిరుదాంకితుడు, ప్రసిద్ధకాకతీయచక్రవర్తియగు ప్రథమప్రతాపరుద్రదేవుడు. కాలము క్రీ. శ. 1140-1195.

పురుషార్థసారము

ఇందుండి 89 పద్యములు గలవు. కాకతి గణపతిదేవ చక్రవర్తి దీక్షాగురువు, మహాయోగియు, రాజనీతిజ్ఞుడునునగు విశ్వేశ్వర శివదేవ దేశికులను శివదేవయ్య దీనిని రచించెను. ఈతడే శివదేవధీమణి శతకమునుగూడ రచించెను. అందుండి రెండుపద్యములు మాత్రము లభ్యమగుచున్నవి. తెలుగుకవులీతని స్తుతించిరి.[2] కాలము క్రీ. శ. 1250-1300

ముద్రామాత్యము

ఇందుండి 39 పద్యములు గలవు. దీనిని క్షేమేంద్రుడని యుపనామముగల లక్కాభట్టు రచించెను. ఈతడు ముద్రామాత్యమునేగాక శతపక్షి సంవాదము, శూద్రకరాజచరిత్రము అను రెండు పద్యకావ్యములు రచించెను. వానినుండి లక్షణగ్రంథకర్తలుదాహరించిన, ఒక్కొక్కపద్యముతప్ప, గ్రంథ

1. చూ. ప్రథమ ముద్రణ పీఠిక.

2. తెలుగుకవుల చరిత్ర-తిక్కన ఎఱ్ఱనలయుగము. (అముద్రితము).

ములు కానరాలేదు. ముద్రామాత్యములో రాజరాజు పేరుండుటవలన, ఈతడు క్రీ. శ. 1060కి తరువాత వాడు. ఈ కవినిగూర్చి వివరములకు చూడుడు.[1]

## శ్రీగిరీశశతకము

ఇందుండి రెండుపద్యములున్నవి. "చిరతరప్రకాశ శ్రీగిరీశ" అను మకుటముండుటచే నిది శతకమనుట స్పష్టము. దీని రచయిత శ్రీగిరికవి. ఈత డీ శతకమునేగాక, నవనాథచరిత్ర (పద్యకృతి - అలభ్యము). శ్రీరంగ మాహాత్మ్యమునుకూడ రచించియున్నాడు. అందుండి రెండుపద్యములు మాత్రమే లభ్యములు.[2] కాలము క్రీ. శ. 1315

## శ్రీరామాయణము

ఇందుదాహరింపబడిన పద్యము క్రీ. శ. 1400కు ముందు మనకు లభ్యమైన భాస్కరరామాయణములో గానరాదు. ఇక కవిత్రయములోని వాడగు ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము రచించినట్లు ప్రఖ్యాతము. అది లభ్యము కాలేదు. కాని, మడికి సింగన తనకాలమునకుముందు చాల ప్రసిద్ధిజెందిన ఎఱ్ఱనను కవిస్తుతిలో పేర్కొనలేదు. కాబట్టి, ఆతని రామాయణమునుండి సింగన పద్యముదాహరించడని చెప్పవచ్చును. ఇక కొఱవి గోపరాజు పెత్తండ్రి సత్తెనారన యొక రామాయణము రచించినట్లు గోపరాజు చెప్పియున్నాడు.[3] అది లభ్యముకాలేదు. మఱి యిది యే రామాయణములోనిదో ?

## మిత్రనీతులు

ఇందుండి యొకపద్యముదాహరింపబడినది. ఇదియొక ప్రత్యేక గ్రంథముగా నేను భావింపను. ఏదోకావ్యమునుండి యైయుండును.

## నీతితారావళి

సింగనకృతి పూర్తిగా లభ్యముకాలేదు. ఇందుదాహరింపబడిన పద్యములనుగూర్చి ముందుచూడుడు.

1. తెలుగుకవులచరిత్ర. (క్రీ. శ. 850-1250) (అముద్రితము).
2. తెలుగుకవులచరిత్ర- తిక్కన, ఎఱ్ఱనలయుగము. ,,
3. రామాయణ కృతకృతియై...... సత్యానారన వెలసెన్.

## లభ్యగ్రంథములు

### నన్నెచోడకవి — కుమారసంభవము

కుమారసంభవము శీర్షికతో రెండుపద్యములున్నవి.

184— 10—182 ప్రస్తుతముద్రణము
644— 10—183 ,,

కా. 785 సంఖ్యగల పద్యము 'ముద్రామాత్యము' అని యున్నది; ఇది కుమారసంభవములోనిదే ("మునుకొని దేశకాలములకు"—10—189). కాబట్టి కుమారసంభవమున పద్యములు మూడు.

### కేయూరబాహుచరిత్ర — మంచెన

ఈ గ్రంథమునుండి రెండుపద్యములే పైశీర్షికలో గలవు.

504. నైజగుణంబులుదనమది— 2—86. ప్రస్తుతముద్రణము.[1]
736. పొదమదు చేయనికార్యము— 3—232. ,,

ఈ రెండుగాక మరిరెండుపద్యములు గలవు.

130. వ్యవసాయము కొలందియు 3—163.
149. స్వామియు మంత్రియు. 4—204.

కాబట్టి యిందలిపద్యములు నాలుగు.

1. నేటి ముద్రితప్రతులయందు స్పష్టముగా పైరెండు పద్యములు కనబడుచున్నను సమగ్రాంధ్రసాహిత్యం — 2 సం — 199 పుటలో నెట్లువ్రాయబడియున్నదో చూడుడు— "'కేయూరబాహుచరిత్రములోనివంటూ ఈరెండుపద్యాలను మడికి సింగనయిచ్చాడు.'నైజగుణంబులుతనమది''పొడమదుచేయనికార్యము'. అయితే ఈరెండూ కేయూరబాహుచరిత్రలో కనపడవు." ఈ రెండేకాదు కేయూరబాహుచరిత్రనుండి యింకను రెండు పద్యములుదాహరింపబడినవి. ఈపద్యములనేకాక, సకలనీతిసమ్మతమున మరికొన్ని పద్యములయాకరము. లను చాలాకాలము క్రిందటనే శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావు గుర్తించి యున్నాడు. ఈ సందర్భమున— సాహిత్య అకాడమి కేయూర బాహుచరిత్ర — శ్రీ గడియారము రామకృష్ణశర్మగారి పీఠిక— 28 పుటచూడ దగినది.

మార్కండేయపురాణము–మారన

ఇందుండి 3 పద్యము లుదాహరింపబడినవి.

189 వ్యయము నార్జవంబు దయయు. 3–132 ప్రస్తుతముద్రణము.
931 సమర మొనరించినంతనె చాపురాదు. 1–100. „
932 చచ్చెనేని యోగిచాడ్పున ముక్తికి–

పై మూడవ పద్యము ప్రస్తుతమార్కండేయపురాణమున కానరాదు.

పద్మపురాణము

ఇది సింగనకృతమే. ఈ శీర్షికక్రింద నొక్కపద్య ముదాహరింప బడినది.

204 సీ. ఎవ్వఁడేపనివెంట......3–57.
704 కామందకము క్రిందనుదాహృతమైన యీక్రింది పద్యము–

ఆ. నీతిపథము దప్పినెట్టి వేగపడిచేయు...

పద్మపురాణము– 3–50 లో నున్నది. కావున పద్మపురాణమున పద్యములు రెండు.

జ్ఞానవాసిష్ఠము

ఇదియు మడికి సింగన కృతియే.

717 అంధకారమునప్పుడు నడఁగిపోదు....
అనునది

ముద్రామాత్యము అనుశీర్షికక్రింద నున్నది.
కానియిది జ్ఞానవాసిష్ఠము 1–170 లో నున్నది.

చారు చర్య

మంత్రి అప్పనకృతము. ఇందుండి యొకపద్యము గలదు.
258 కొనగొని కొండ్రముచ్చులఁ జకోరములన్

ఇది పద్యముగానున్నది.[1]

## శాలిహోత్రము—మనుమంచిభట్టు

ఇందుండి ఒక్కపద్య ముదాహరింపబడినది.

828 క. నాలుగు కాళ్లను గొనయును.

ఈ పద్యము ముద్రితమున నాల్గవ యాశ్వాసమున నున్నది. అది అశ్వశాస్త్రము అనుపేర గుజిలీప్రతిగా నున్నది.[2]

## నీతితారావళి

సింగన రచించిన లఘుకృతులలో "నీతితారావళి" యొకటి. ఇది పద్మపురాణకృతిపతియైన కందనమంత్రి కంకితము. అతనిపేర చెప్పబడినది. కావున సింగనయే గ్రంథప్రారంభమున "భారత రామాయణాది మహా కావ్యంబులు పురాణేతిహాసంబులు 'కందనామాత్యుని నీతితారావళి' అని స్పష్టముగా పేర్కొనినాడు. 'తారావళి' అనగా నిరువదియేడు పద్యముల చాటుకృతి. దీనినే నక్షత్రమాలిక యందురు. ముక్తకములని మఱియొకపేరు వీనికిగలదు.

ప్రస్తుతగ్రంథములో పై నీతితారావళి యందలి పదునేడు పద్యము లుదాహరింపబడి యున్నవి. ఉదాహృతపద్యములలో కొన్నింటికి, సంబోధన

1. దీనివ్రాతప్రతి - ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) లో గలదు. శ్రీ ముక్త్యాలరాజావారు తొలుతప్రకటించిరి. ఆ వెనుక నాపీఠికతో వావిళ్లవారు చక్కగా దీనిని ముద్రించిరి. అందు తెలుగులోశాస్త్రీయగ్రంథముల సూచిక గలదు.

2. ఇది ప్రశస్తమైన రచనగలది. అయినను నింతవఱకు దీనికి సాధికారమైన ముద్రణ దు. దీనికి తాళపత్రప్రతులు లభించుచున్నవి. వెంటనే ముద్రింప దగినది.

లేవు. అయినను సంబోధనలేని పద్యములుకూడ 'నీతితారావళి' అనుపేరితో నింపున్నవి. కాబట్టి అవి నీతితారావళిలోనివేయని నిశ్చయింపవచ్చును.

| | | | |
|---|---|---|---|
| 23 | అమలమగు | సంబోధన | |
| 28 | పలుకులుగొన్ని | | 'నీతితారావళి' |
| 30 | పలుకులతీపును | సంబోధన | |
| 41 | ధనసొప్పు | ,, | |
| 85 | బలవంతుఁడు | ,, | |
| 160 | కలిమిమై | ,, | మదీయము |
| 295 | ఆయవ్యయంబుల | ,, | ,, |
| 296 | వ్రాయఁడేని | ,, | ,, |
| 297 | నరులఁగ్రుచ్చి | ,, | ,, |
| 298 | పదియంకనంబును | ,, | ,, |
| 299 | వారలు ప్రజలు | ,, | ,, |
| 344 | మేధయు | ,, | ,, |
| 401 | సత్తులఁవౌదార్య | ,, | చాటువు |
| 411 | తన్నునినమ్మిన | ,, | |
| 791 | వివిధకళా | ,, | |
| 819 | కరికరథఘట | ,, | చాటువు |
| 988 | ఖలు సంపద | ,, | |

మదీయము, చాటువు- అని పేర్కొనబడినను. అవి కందనమంత్రి సంబోధనతో నున్నవి. అందువలన నవి నీతితారావళి లోనివేయని నిశ్చయింపవచ్చును. సాధారణముగా నిట్టి ముక్తకరచనములో అన్నియు నొకేవిధమగు వృత్తములుండవలెను. లాక్షణికులును, లక్ష్యములును నట్లే యున్నవి. కాని సింగనరచన యిందుకు విరుద్ధముగా నున్నది- ఇందు కందము, సీసము. ఉత్పలము నున్నవి.[1]

బద్దెనీతి

బద్దెనీతి యనగ భద్రభూపాలుని నీతిసారముక్తావళి. ఇందుండి30

1. సమగ్ర ఆంధ్ర సాహిత్యం నాలుగవ సంపుటమున ఈ నీతితారావళి కందనామాత్యకృతమని కలదు. దాని విమర్శ యనుబంధములో చూడుడు.

పద్యములు సింగన యుదాహరించియున్నాడు. నేటి ముద్రిత ప్రతికిని,[1] సింగన యుదాహృతపద్యములకు పాఠభేదములున్నవి. పాఠభేదములేకాక, పద్యములు బద్దెనీతి యన్న శీర్షికక్రింద పేర్కొనబడినవి నేడు ముద్రితప్రతిలో కానవచ్చుటలేదు. భావిపరిశోధకుల కనుకూలముగా వానిని తెలుపుచున్నాను. పద్యముల మొదళ్లు, పాఠభేదములు మాత్రమే చూపబడినవి—

| | సకలనీతిసమ్మతము | పా. భే | బద్దెనీతి | |
|---|---|---|---|---|
| 78 | అనుజులు తనుజులు | ... | ... | 13 |
| 90 | మండలనాథునాజ్ఞకు | జంపుచునుండిరేని మేలయుండు | జంపుచునుండెనేని మేలవిల్చు | 49 |
| 99 | గను లకృషిప్రపంచము | నర్థముగూర్పక | నర్థమురోయక | 45 |
| 104 | ప్రజఁదల్లి పెంచు | ... | ... | 4 |
| 105 | క్రూరుఁప్రజవిడుచు | ... | ... | 40 |
| 108 | మండలముపెడిన | ... | ... | 50 |
| 113 | సాధింపఁగడిది | ... | ... | 35 |
| 114 | జనపతితనప్రజ | ... | ... | 27 |
| 128 | ఇది దేశంబిదికాలంబిది | ... | ... | 30 |
| 129 | ఆయంబువ్యయము | ... | ... | 11 |
| 172 | క్షితిజనులకుఁ బరిజనులకు | ... | ... | 26 |
| 176 | తలవర్గము సామంతుల | ... | ... | 31 |
| 228 | పరికింప నీతిమార్గము | ... | ... | 46 |
| 231 | పరిదోషకథ వినోదము | ... | ... | 15 |

1. బద్దెన నీతిసారముక్తావళిని ప్రథమముగా, 'విస్మృతకవులు' అను ప్రాచీన గ్రంథమాలలో— రెండవదానిగా — మానవల్లి రామకృష్ణకవిగారే తొలుత ముద్రించిరి— *1912*. బ్రహ్మ విద్యావిలాస ముద్రాక్షరశాల, వనపర్తి.

రెండవది— ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు పరిషత్పత్రిక. సం. 40 సం. 2,3 లో ప్రకటించిరి. ఇది రెండు మూడు తాళపత్ర ప్రతులలో సరిచూడబడినది. కాని ప్రత్యేక పుస్తకముగా ప్రకటితము కాలేదు. ఇందు సకలనీతి సమ్మతము నుండి పద్యములు సంప్రతింప బడినవి.

మూడవది— సాహితీవల్లభ ముళ్లపూడి తిమ్మరాజుగారు అచ్చువేయించినది. దీనికి సంస్కృత ముద్రణము, విపుల పీఠికాదులతో వెలువడ వలసి యున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| 403 | అతిమహిమోన్నతియు | ... | ... | ఆ. 1 |
| 413 | నవసినవారిఁ బ్రస్తవమున | ... | ... | 47 |
| 420 | తనకెన్నఁడుండియును | ... | .... | 24 |
| 421 | మనువఁగొజయేని | .... | .... | 29 |
| 446 | బొరపడయు | .... | .... | 68 |
| 447 | కోపప్రసాదములలో | .... | .... | 62 |
| 448 | జీవితమీఁదు | .... | .... | 63 |
| 496 | కెలనముచేసియు | .... | .... | 70 |
| 499 | నేరమిఁబొదరిన | నేరముచేసియు | .... | 71 |
| 501 | జీతములాఁదికొంద్రు | .... | .... | 58 |
| 691 | ఆప్తులెఱింగిన | .... | .... | 23 |
| 695 | ఆప్తునవివేకి | .... | .... | 17 |
| 958 | పనసు దొరకొనుడు | .... | .... | 18 |

ముద్రితప్రతిలో లేనివి, సింగన బద్దెనీతినుండి యుదాహరించినవి-

109 ఆ.వె. తడవుఁ బెంపనేర్చి తమకాలముల
110 క. జనపతికిఁ బ్రజాపాలన
130 క. వ్యవసాయము కొలఁదియు
131 ఆ.వె. తనకు నాయమైన ధనములో
173 క. ధనధాన్యవాహనము లెడ
174 క. నృపరాజ్యాంగములందొక
230 క. కొండియములు విన్నపములు
414 క. నుడివిన జీతంబెప్పుడు
415 క. భూపతి విరక్తుఁడైనను
772 సీ. దప్పులవెయుండి
773 ఆ.వె. శత్రుశోణితమున

పైపద్యములలో 130. "క. వ్యవసాయము కొలఁదియు" అన్న పద్యము మంచెన కేయూరబాహుచరిత్ర (3-163) లోనిదని నిరూపింపబడినది. ఇక బద్దెనీతియందు, కందములు వృత్తములేగాని తేటగీతులు, ఆటవెలదులు

లేనే లేవు. కొబట్టి 109, 131, 772, 773. పద్యములు బద్దెనీతిలోని వెంత మాత్రమును కావు- తక్కిన ఏడును కంద పద్యములు-ఇవి బద్దెనీతి వ్రాతప్రతుల లోను లేవు. బద్దెన నీతిసారముక్తావళిలో ప్రతాపరుద్రుని నీతిసారము సూచించి యున్నాడు కొబట్టి యీపద్యములు నీతిసారములోనివి కావచ్చును.

భారతము

సకలనీతిసమ్మతము సభాపర్వము.

56. చ. బహు ధన ధాన్యసంగ్రహము బాణ శరాసన యోధవీరసం
గ్రహము నిరంతరాంతరుదకంబును[1] జాలఁగ నింధనంబు సం
గ్రహము ననేకయంత్రములు గల్గి యసాధ్యములై ద్విషద్భయా
[2]వహములనంగ నొప్పునె భవత్పరిరక్ష్యములైన దుర్గముల్.
(1-53)

67. క. ధరణీనాథ భవద్భుజ
పరిపాలిత [3]మైన వసుధఁ బరిపూర్ణములై
కర మొప్పుచున్నె చెఱువులు
ధరణి కవగ్రహభయంబు దగు[4]లక యుండన్. (1-43)

168. క. వలయు నమాత్యులుఁ జుట్టం
బులు మూలబలంబు రాజపుత్రులు విద్వాం
సులు బలిసి యుండ నిచ్చలు
కొలువుండుదె లోకమెల్లఁ [5]గొలువఁగ నిన్నున్. (1-48)

205. క. ధనలుబ్ధుల ముచ్చులఁ గూ
ర్పనివారిని[6] బగఱ వలని వారిని[7] ధృతి సా
లని వారిని దుర్జనులను
బనుపపు గా రాజ[8] కార్యభారము దాల్పన్. (1-41)

206. క. ఉపధాశుద్ధుల............................ (1-26) పాఠభేదములేదు.

1. లు ఘాసరసేంధ నౌఘ సం; 2. వహులగు చుండ; 3. మైన; 4 దనుకల్ యుండన్; 5. కొనియాడంగన్; 6. వారల; 7. వారల; 8. రాచకార్య.

207. క. చోరభయ వర్జితంబుగ
ధారుణి [1]రక్షింతె యధికధనలోభమునన్
జోరుల రక్షింపరుగా
వారలచే ధనముగొని భవద్భృత్యవరుల్. (1-42)

224. క. హాలికులఁ బరివారము నె
గ్గులు పఱపక తగిన వడ్డి గొని నడిపి కొనఁ
గల వణిజుఁడు తనభూమిం
గలుగుట యది పసిఁడి చేర్పు కలిమి నృపతికిన్.

—ముద్రితపత్రులలో లేదు.

225. క. హీనులకుం[2] గర్షకులకు
భూనుత ధాన్యంబు బీజమును వణిజులకున్
మానుగ శతైకవృద్ధి న
నూనముగా ఋణములిత్తె యుత్తమబుద్ధిన్. (1-44)

226. గీ. నలిగి పరపంక్తిఁ బొందిన నరుల నోలి
భీతచిత్తుల నవమానపీడితులను
అభయ మిచ్చియు నీఁదగు నర్థమిడియుఁ
బ్రియముఁబల్కియుఁదగ నాదరింపవలయు.

—ముద్రితప్రతులలో లేదు.

318. క. అనిశము సేవింతురె............(1-34) పాఠభేదములు లేవు.

324. క. ధీరుఁడు ధర్మాధర్మ వి
శారదుఁడు బహుశ్రుతుండు సమచిత్తుఁడు వా
ణీ రమణీ [3]కృతవదన
సరోరుహుఁడనఁ [4]దగునె నీ పురోహితుఁడధిపా (1-29)

325. క. తనయింటి చేటు పరులకు
వినిపింపఁగఁ దగదు కార్యవేళనె తక్కన్

1. వాలింతె; 2. హీనులగు; 3. శ్రిత; 4. జనునె.

వినఁగఁ బురోహితుఁ డర్థుఁడు
విని చక్కం జేయుఁ దనదు విద్యామహిమన్.        ము.ప్ర. లేదు

327. క. జననుత ...................... (1-30) పాఠభేదములు లేవు

328. క. క్షితినాథ......................... (1-33) ,,

371. క. పరి [1]కింపుచు బాహ్యాభ్యం
తరముల లోపలననారతము నిజరక్షా
పరులైన[2] పరమహీశుల
చరితము వీక్షింతె విపుణచరనేత్రములన్. (1-49)

400. క. నానావిత[3]రణవిజయము
హానిపుణు లవార్యవీర్యులనఁ దగు వారిన్
సేనాధ్యక్షులఁజేసితె
నీ నమ్మినవారి మాననీయుల హితులన్. (1-31)

412. క. తమతమ కనియెడు తటీ.......................... (1-38)
పాఠభేదములు లేవు.

426 .క. కుల[4]భృత్యులైన సద్భృ
త్యులకును సత్కారమర్థితోఁజేయుదె వా
రలు నీ ప్రస్తవమున ని
మ్మలఁ గృత్యము[5] దలఁచి ప్రాణములు విడుతు రనిన్. (1-39)

427. క. అనఘా నీప్రస్తవమున
వనినీల్గిన వీరభటుల యనుఁ[6]గుజనుల నె
ల్లను బ్రోతె భోజనాచ్ఛా
దనముల వారలకు నెమ్మిఁదఱుఁగక యుండన్. (1-40)

428. క. జనపతి ప్రాణము లిచ్చినఁ
జనువారలఁబ్రోవకున్న సత్యము పాపం
బునఁ బొరయు వారిఁ బ్రోచిన
తన వారినిఁబ్రోచు మీఁద దైవము గరుణన్. ము. ప్ర. లేదు

1. కించుచు; 2. పరుఁడవయి; 3. విధ; 4. పుత్త్రులైన; 5. కృతము; 6. అనుపోష్యుల.

429. గీ. ప్రాణమిచ్చియు రణమునఁ బ్రతికె నేని
నతని రక్షించుఁదన కొఱకైన రాజు
శూరవృత్తిని మోక్షంబు సూఱఁగొన్న
వారి వారలఁ బ్రోవంగవలయుగాని.

ముద్రితప్రతులలో లేదు.

689 క. రాజులకు విజయమూలము....(1–28) పాఠభేదములు లేవు.

690 ఆ.వె. కార్యమెట్టిదియును గాసియౌ మంత్రంబు
దలఁప నొరులచెవులు సిలికెనేని
కావనాల్గు చెవుల నూనంగ రక్షింప
వలయు నెఱుకగలుగువారు ధరణి. ము.ప్ర. లేదు

సకలనీతిసమ్మతమున 'సభాపర్వము' అను పేరితో నిచ్చిన యిరువది మూడు పద్యములలో 224. హలికుల, 226. నలిగి, 325. తనయింటి, 428. జనపతి, 429. ప్రాణమిచ్చియు అన్న అయిదుపద్యములు ప్రస్తుతముద్రణము. లందే కాక తాళపత్రప్రతులలోనూ లేవు.[1]

ఈ సందర్భమున–పండితులు–సభాపర్వమును సంస్కృతమూలముతో చక్కగా పరిశీలించి, ప్రస్తుతతాళపత్రముద్రణములలో లేక సకలనీతి సమ్మతమున నుదాహృతములైన హెచ్చు పద్యము లుండవలసిన యావశ్యకత యున్నదో లేదో తెలియజేయుట కర్తవ్యము.

స. స. విరాటపర్వము.

79 క. పుత్రులు పౌత్రులు భ్రాతలు
మిత్రు లనరు రాజులాజ్ఞ[2] మీఱినచోటన్
శత్రులుగాఁ[3] దమయలుకకుఁ
బాత్రము సేయుదురు నిజశుభస్థితి పొంచెన్.

1. ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు ప్రకటించిన మహాభారతము సభాపర్వమున పైపద్యములలో మూడిటి నుదాహరించిరి. తక్కిన రెండు నుదాహరింపలేదు. ఈ యైదును తాళపత్రములలో లేవని నిశ్చితముగా చెప్పవచ్చును.

2. మిగిలినచోటన్; 3. శత్రులకా.

480 ధరణిపు చక్కఁగట్టెదుర (1-129) పాఠ భేదములులేవు.
481 వగఖలలోపలిమాటలు (1-130) ,,
482 తానెంత యాప్తుఁడైన (1-136) ,,
483 ఆవులింత తుమ్ము (1-137) ,,
486 కలిమికి భోగములకు (1-140) ,,
487 చనువాడు (1-125)
488 రాజు పెద్ద పలుపురకు (1-126)
489 ఉత్తమాసనములు (1-132)

విదురనీతి- ఇందుండి 8 పద్యములుదాహరింపబడినవి.

స. స. ఉద్యోగపర్వము

199 గీ. మాలకరిపుష్పములు గోయుమాడ్కి (2-57) పాఠభేదములు లేవు

369 క. ఎదిరికి హితమును (2-59) ,,

449 చ. ఒకరుని చేతఁద్రోపును (2-77) ,,

712 ఉ. నీతిపథంబునం బ్రతుక (2-71) ,,

733 ఆ.వె. కమియఁబండుమున్న కాయఁగోసినఁజవి
చేెగాదు విత్తుచేటు గలుగు
పక్వమైనఁగొనిన ఫలమిచ్చుఁ జెడదుబీ
జంబు కార్యసిద్ధి చంద మిట్లు.

భారత ముద్రణమున పైపద్యమిట్లున్నది-

ఆ. వె. తనియఁబండకుండ మునుగోసికొనఁజవి
చేెకాదు విత్తు చేటుగలుగు
పక్వమైనఁగొనిన ఫలమించుఁ జెడదు బీ
జంబు కార్యసిద్ధి చందమిట్లు.

ఇందీ శీర్షిక క్రింద నుదాహరింపబడి ప్రస్తుతముద్రణములలో లేని పద్యములు మూడు[1]—

370 క. మత్తుఁడు సుప్తుఁడు హృదయా
యత్తము విదితంబుగాఁగ నాడుదురగుటన్
యెత్తఱి నేకాంతమున న
మత్తత నిద్రింపవలయు మానోన్నతుఁడై.

451 ఉ. ధీరతఁదక్కి భీతిఁబడి దీఱమినిల్వక పాఱిపాఱి వీ
రారులచేతఁజచ్చిన భటాధములేలినవాని దుష్కృతం
బారఁగ నంతయుం గుడుచునాతఁడు చేసిన పుణ్యమంతయున్
జేరుఁదదీయభర్తకనిచెప్పుదు రుత్తమధర్మకోవిదుల్.

734 ఉ. ఆతతనీతి మేలునకునై యొనరింపఁగ దైవమొక్క కీ
డా తరువాతఁ జేయుటయు నక్కొఱగామియు శాంతిపెందఁగా
నీతియె చేయఁగావలయు నెక్కడు నేర్పరులైనవారు వి
ఖ్యాతిఁగనంగ నొక్కయెడఁగాఱిన నగ్గిన కాఁపమానదే.

స. స. భీష్మ పర్వము.

97 క, వినికిగలిగి... (1-26) పాఠభేదములేదు.

ఇది ఆశ్రమవాస పర్వము 1-76 లోకూడ కలదు.

స. స. సౌప్తిక పర్వము

917 గీ. ఎత్తినప్పుడు విడియుచో నిఱుకటంపుఁ
దెఱువునందును నడచెడి తిరుగఁబట్టి
నట్టియెడ నిద్రపోయెడు నవసరమున
శాత్రవుల బిట్టుపైఁబడి చంపవలయు. (1-25)

1. వీనిని మూలముతో పరిశీలింపవలసి యున్నది.

843 సీ. వానయు సీతును వర్జించి మందువే
సవిగాకమున్న సస్యములపంట
లొదవెడు తఱి నెత్తునది శత్రుపైఁబూరి
గడ్డియు [1]నీళ్లను గలుగుతెరువు
గాఁజూచి నడచుట కర్జంబు సిడెములు
గంకటములు [2]బడిగలును విండ్లు
మొదలగు నాయుధములు రథగజహయం
బులు నవరణలు నపూర్వభంగి

గీ. నొప్పి యతిభీకరంబులై యుండవలయు
శంఖకాహళ పటహనిస్సాణముఖము
లైన తూర్యముల్ మంచివియగుట లెస్స
యధిప విడిదల సమతలమగుట మేలు. (1-3)

921 సీ. [3]గట్టునుజెట్టును మిట్టయుఁ బల్లంబుఁ
గలిగినచోటు కాల్బలము నేల
వినుము నీళ్లను రొంపియును లేక సమవిశా
లమునైనచోటు గుఱ్ఱముల నేల
క్రమ్మి గ్రుంగక [4]గదగదగు వంపులు గలు
గమి నొప్పుచోటరదముల నేల
యెడనెడ మ్రాఁకులు మడుపులుగలచోటు
కురునాథ ! యేఱుఁగుము కరులనేల

ఆ. వె. యేబలంబు దనకునెక్కుడు గలుగు న
బ్బలము నేల పోరుగలనుగాఁగ
నినుఁడు [5]శశియు గాలి వెనుకగా మొన నడ
పించి[6] పొదువ సంభవించు జయము. (1-6)

---

1. నీళ్లలు. 2. పల్కలును.
3. చెట్టును తాయియు. 4. గదగదువ. 5. సీతు. 6. పొదువ.

169 క. కొలు విమ్ము మాపకడ......(1-61) పాఠభేదములు లేవు

198 క. న్యాయంబు [1]దొడరి వివిధో
పాయంబుల నర్థముల నుపార్జింపుము భూ
నాయక రాజ్యవిఘాతము
సేయునరుల నెఱిఁగి చంపఁ [2]జెఱుపఁగవలయున్. (1-63)

404 క. [3]నీ విలసద్భక్తి స్నే
హావేశముగలిగి శూరుఁడై యలజడిఁ [4]బడియున్
దా విసువని సత్కులజుల్
గావింపుము సైన్యవిభునిఁగాఁ గురుముఖ్యా. (1-64)

777 క. ప్రెగడలమనసులు విరసము
లగుగతి నడచు రిపురాజ్యమడఁచి విశీర్ణం
బుగఁ దాఁ గలంచి పైకొని
జగతీవర కొనఁగవలయు సౌకర్యమునన్. (1-70)

పాఠభేదములులేవు.

778 ఆ.వె. కుడువ నిచ్చుతఱియు గురువర కేడించు
నవసరంబెఱింగి యానృపాలు
నిలుపు ధీరవృత్తి నిడు ద్రాటఁబోనిమ్ము
గ్రమ్మకటుల సగ్మగ్రమ్మి చెఱుపు.

ఈ పద్యమునకు ప్రస్తుతముద్రిత పాఠమునకు చాలా భేదమున్నది.

ఆ. వె. కుడువ నిచ్చుతఱియుఁగురు వర ! క్రక్కించు
నవసరంబునెఱిఁగి యరినృపాలు
నీవు ధీర వృత్తి నిడు ద్రాటఁబోనిమ్ము
క్రమ్మ కపిల యనఁగఁ గ్రమ్మి చెఱుపు. (1-72)

1. తోడ  2. చెఱుపన  3. నీ వలనను.  4. ఇడికిం.

మహాభారతముశీర్షికనుండి మొత్తము 49 పద్యములు కానబడుచున్నవి. ప్రస్తుతముద్రణములను బట్టి 41 పద్యములు కాన్పించుచున్నవి. ప్రస్తుతము భారత ఆది, సభా, అరణ్య పర్వముల సంస్కృతముద్రణము (తాళపత్ర ప్రతులతో పరిశీలించినది) వచ్చినది. అందును సింగన యుదాహరించిన పద్యములు, తాళపత్రప్రతులలో లేవని తెలుప బడినవి. ఇంకా, తక్కిన విరాటోద్యోగాదిపర్వములు రాలేదు. వచ్చినగాని తాళపత్రప్రతులలో నివి యున్నవి లేనివి తెలియజెప్పుట యసాధ్యము. మడికి సింగనకాలము నాటివి (క్రీ. శ. 1430), అనగా నిప్పటి కైదువందలయేండ్ల క్రిందటి తాళపత్రప్రతులు లభింపవు; నాలుగువందలయేండ్ల క్రిందటి ప్రతులుమాత్రమే మనకు లభించుచున్నవి.

ఇప్పుడు మనకు భారతమున లభింపని పద్యములకు మూలమున్నదో, లేదో పరిశీలించిన ఈసమస్య విడిపోగలదు. దీనిని బట్టి తెలుగు మహాభారతమునకు మూలసంస్కృతభారతముతో తలస్పర్శిగా పరిశీలింప వలసిన యావశ్యకతయున్నదని స్పష్టమగుచున్నది.

## 9. విషయ విభాగము

ఇందు శాస్త్రవిషయములు ప్రతిపాదింపబడినవి కావున సింగన విషయవర్గీకరణము చేసియున్నాడు. గ్రంథములోనున్నక్రమము—

### ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము



## తృతీయాశ్వాసము

గ్రంథముపేరు సకలనీతిసమ్మతమేయైనను, ఈమూడాశ్వాసములలో రాజనీతి ప్రధానము కొబట్టి దానిని గూర్చి 88పద్యములు గలవు. తరువాత ముఖ్యమైనది మంత్రరక్షణార్థములు. కావున అందు 73 పద్యములు. రాజసభలో విద్వాంసులుందురు. అందుచే వాచకలక్షణము తెలుపబడినది.

వాచకలక్షణము

ఈ నాడు మనకు మానవస్వాభావికమునకు కంఠముగాక, వాక్ప్రచారమునకు, యంత్రసాధనములుండుటచే పద్యములనెట్లు చదువవలెనో, ఆ వాచకలక్షణములు పూర్తిగా విస్మృతప్రాయములైనవని చెప్పవచ్చును.

రాజసభలలో పద్యములు గమకముతో, అనగా రసోచిత స్థాయిలతో, స్వరపరిమితితో చదువు వారికి 'గమకి' అనిపేరు _ "కవిగమకి వాది వాగ్మి" _ అనువీరు శాసనములందే గాక కావ్యములందును గానవత్తురు. నన్నెచోడకవి దీనిని తెలిపినాడు _ "కవి గమకి వాగ్మి గాయక నటచింతామణి" (3_112). శాసనములయందీసమాసపదము ప్రచురముగా గన్పట్టును. వాక్ప్రచారసాధనములున్నను, వాచక మెట్లుండవలయునో పురుషార్థసారమునందలి యీక్రింది పద్యము తెలుపుచున్నది_

306. చ. "వెనుకకుఁ బోక పోయనక వేసటనొందక బంతి బంతిలో
బెనఁపక కానమిం బ్రమసి బెగ్గిల కెంతయు మున్ను చూచుచున్
గనుకని యక్షరాక్షరము కందువుదప్పక యేకచిత్తుఁడై
యనుపమ భక్తితోఁ జదువునాతని వాచకుఁడండ్రు సజ్జనుల్."

ఈ నియమము లీనాటికి ననుసరణీయములేగదా !

295 - 299- ఈ పద్యములలో ఆకాలమున బేరీజులువేయుట - పద్దు లెక్కలు వేయు విధులు తెలుపబడినవి. ఇందా కాలము నాటి అంకగణిత పారిభాషిక పదములు గలవు.

302 లో - ఋణ పత్రములు - రాజకీయలేఖలు వ్రాయుపద్ధతి తెలుపబడినది.

వచనము

ఈ సంకలనమున- ముందుచూపినట్లు 993 సంఖ్య గలిగినను, అందు 30 వచనములు మాత్రమేయున్నవి. వానిలో "అదియెట్లంటేని- అది మఱియు" అను చిన్నవచనములు పోగా యిరువై నాలుగు పెద్దవి-వానిలో మూడు మాత్రమే ఒక పుటకు మించినవి. తక్కినవి మూడు నాలుగు పంక్తులు గలవే. కాబట్టి ప్రాయికముగా దీనిని పద్య కృతియేయని చెప్పనగును.

## 10. ఆంధ్రవచన రచనా పరిణామము

సింగన యుదాహరించిన వచన రచననుబట్టి- ఆంధ్రవచన రచనా పరిణామమును గ్రహింపవచ్చును. తెలుగున వచనరచనకు ప్రథమాచార్యుడు కృష్ణమాచార్యుడు.[1] ఆతని సింహగిరివచనములు సలక్షణ గ్రాంథికవచన రచనకు శ్రీకారము చుట్టినను- అవి- ఆధ్యాత్మికములు, భక్తి ప్రతిపాదకములు; లౌకికములుకావు. ఈగ్రంథమున నుదాహరింపబడిన వచనభాగములనుబట్టి చూచినచో, క్రీ. శ. 1450 ప్రాంతము నాటికి ముందే, అనగా, 13 వ శతాబ్ది నాటికే భావప్రకటన కనుకూలమగు శాస్త్రీయగంధవచనరచన తెలుగున వ్యాప్తమైనదని చెప్పవచ్చును.

1. చూడుడు- ఆంధ్రవచనవాఙ్మయము- పుట30.

అనాటి గ్రాంథిక వచన రచన ఎంతచక్కగా, చిక్కగానున్నదో చూడుడు—

"రాజునకు సర్వకార్యంబులు మంత్రపూర్వకంబు గావున బుద్ధి సహాయులం గూడుకొని యుండవలయు. బుద్ధిసహాయులు ధనార్జకులు రణ శూరులు నాదియగు కార్యపురుషులు కార్యకాలంబ కూర్తుమనుట గృహ దాహంబగువేళ నూతికుపక్రమించుట, వారికి పలయుధనంబులిచ్చుట సుక్షేత్రం బున విత్తనంబిడినయట్లు, విభవంబెంతగలిగినను భోజనసహాయులు గల్గుదురు గాక కార్యసహాయులుగల్గనేర్తురే? మఱియు మూర్ఖుండు కార్యసహాయుండగుట యంధుండంధునకు దెరువుచూపినయట్లు, వారివలన నొకకార్యంబు గల్గిన నది కాకతాళంబును, ఘుణాక్షరన్యాయంబుననగుఁగాని యథార్థంబుగాదు. రాజు చేపట్టిన మూర్ఖుడైనఁ గార్యవేది యగుననందగదు. శివుఁడు గరళంబున ధరించిన కాలకూటం బమృతంబగునె?"

(సంఖ్య. 735)

"మఱి యుద్ధంబు నిరూపింతునదియును సంకుల ద్వంద్వైకాకిభేదంబు లన మూఁడుదెఱంగు; అందు ద్వంద్వైకాకియుద్ధంబులు మత్సరగ్రస్తులగు వీర భటుల పనిగాని రాజకృత్యంబులుగావు. సంకులంబునకుఁ గరికోటచాతురంగ యుద్ధంబు లన మూఁడుభేదంబు లందును జొచ్చిపోయి పోరుట కరియుద్ధంబు, దుర్గంబుఁమీద విడిసి పోరుట కోటయుద్ధంబు, బయలం జతురంగ బలంబులం బన్ని యుద్ధంబుసేయుట చాతురంగంబనంబడు, నివిక్రమంబున నధికు నందును హీనునందును సమునందును బ్రయోగించునది. యధికుండైతినఁ గార్యోపాయంబున వేలంబునొచ్చి పొడుచుటయు ననువైన దుర్గంబు కల్ల కోటగోడగొనుటయు సంధికి నుపాయంబులు; హీనుండగువాని దుర్గంబు మీఁద విడిసి మహాయత్నంబున బహుయంత్రతంత్ర కార్యంబులగొనుట యుచి తంబు; సముతోడ బయలఁబోరునప్పుడు బలువెఱుంగని నరుగొంత మిగులంజూచి కానియుపక్రమింప వలదు. దైవమానుషంబు కలిమి యధికశక్తి యనంబడు"

(సంఖ్య. 933)

పై వచనరచన చిన్నయసూరి నీతిచంద్రికను స్మృతికి దెచ్చు చున్నది. ఇట్టిరచనలు ముందున్నవని ఆతనికి దెలియదు గదా! అందువలననే ఆతని ప్రత్యేకవిశిష్టత మనకు విశదమగు చున్నది.[1]

## 11. సింగనకవిత

ఇది సంకలనగ్రంథము గావున సింగనకవితావైశద్యము చర్చించుటకు తావుగాదు. ఈగ్రంథమున సింగన సొంతపద్యములు 38 మాత్రమే గలవు. ఈతడు "ఆ పరమేశ్వరమకుటవ్యాపిత గంగాప్రవాహవరకవితాసల్లాపుడు". పద్మపురాణోత్తరఖండము, భాగవతదశమస్కంధద్విపద, జ్ఞానవాసిష్ఠరామాయణము, అను నీతనికృతులు ప్రసిద్ధములు. ఇందున్న పద్యములును, ఆతని కవితాపటిమను ప్రకటించుచునే యున్నవి. వాని కీవలకే ఉదాహరణలు చూపియున్నాను. ఇందొక్కచో పూర్వకవియనుసరణ, సింగనను వేఱొకవి యనుసరించిన రచన చూపుచున్నాను.

## 12. పూర్వకవి యనుసరణలు

ఈగ్రంథమున పూర్వకవి యనుసరణ ఒక్కచోమాత్రము కానవగు చున్నది.

కుకవినింద

పాల్కురికి సోమనాథుడు ద్వి.

"జల్లి పూరక మపశబ్ద మక్రమము
పొల్లువ్యక్రియ జడ్డపొడవసంఘటన
కాకు వ్యర్థం బసంగతి విరసంబు
వైకల్య మత్యుక్తి వైరిపదంబు
తలవిఱు పసమగ్రత శిథిలబంధ
మొఱప బద్ధంబు గ్రామ్యోక్తికంటకము
ద్రాప చందోవిరుద్ధం బాది యగు న
లాపప్రలాపోక్తి లాఘవంబనక

1. ప్రాచీనవచన రచన లిట్టి వానిని సంగ్రహించి, వర్గీకరించి, వచనసంకలన గ్రంథము నొకదానిని వెలువరించుట ఈ నాడత్యంతావశ్యకము.

వసగూర్పఁగ్రుతులు నా వడ్లనుబెరుగు
బిసుకు చందపు బిలిబిలి కృతక కృతులె"

—పండితారాధ్యచరిత్ర : కృత్యవతరణిక.

సింగన— సీ. గ్రామ్యంబు దుస్సంధి కాకు విరోధోక్తి
పొల్ల సంక్లిష్టంబు జల్లి పొదవు
వ్యర్థబంధంబు నిరర్థంబు పునరుక్తి
దోషంబలంకార దూషణంబు
రసవిరుద్ధము క్రియారాహిత్య మస్పష్ట
భావంబు గణయతిభంగ శబ్ద
భంగంబు లెఱుఁగక సంగతంబుగ వట్టి
మాటలు పురికొల్పి మచ్చరమునఁ

గీ. బెనచి వడ్లను బెరవును బిసికినట్లు
కెలను నవ్వంగ బిలిబిలి కృతులు సెప్పి
వాదు లడువంగఁ బఱతెంచువారు కవులె
గోపికాజాలసుఖలోల గోప బాల. 26.

సింగన కవిత నొక్క చోట నాతని తరవాతి కవియగు కొఱవిగోపరాజు తన సింహాసనద్వాత్రింశిక యందనుసరించి యున్నాడు.

సింగన- చ. తెలుఁగని చెప్పి సంస్కృతము తీపును నాఱడిఁబుచ్చి శబ్దముల్
తెలుఁగుసు గాక యేసభలఁ దెల్పఁగరాని యపప్రయోగముల్
పలుమరు గ్రుచ్చి వా దడువఁ బాడుచుఁగబ్బపుదబ్బముండ్లచేఁ
బెలుచన కర్ణముల్ పొడుచు బేలుఁ గవింగవిగాఁ దలంతురే. 27.

గోపరాజు— చ. తెనుఁగునఁ దేటగా కథలు చెప్పిన కావ్యము పొందులేదు మె
త్తన పసచాలదంద్రుడు విశదంబుగ సంస్కృత శబ్దమూఁదఁజె
ప్పిన నవి దర్భముండ్లనుచుఁ బెట్టరు వీనుల గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు,దేశియును,దద్భవముంగలయంగఁజెప్పెదన్.

సింహా, 1-32

## 13. వాడుకలు-జాతీయములు

ఇందినాటికీ వ్యవహారములో నున్నవి కొన్నిగలవు.

1. గోడమీది బొమ్మ-ఏపని చేయకయుండువాడు.

"రాజునకు, గోడవ్రాసిన రాజునకున్ భేదమేమి" 77.

2. కుక్కతోకబట్టి గోదావరీదుట-సింగన కాలమున నిది సామెతగానున్నది.

"కుక్కతోకఁ బట్టుకొని మహాంబుధి దాఁట" 403.

వేమన-కుక్కతోకబట్టి గోదావరీదుట-అనియే వాడినాడు.

3. "తల్లి సచ్చినను జూదరి లేచిపోఁడు" 660.

వ్యసనము నందత్యాసక్తి.

పూర్వము జూదవ్యసనమున నిది ప్రయుక్తము-అనగా జూదమాడు చున్నవాడు, తల్లి చనిపోయినదని తెలిసినప్పటికీ లేవడు. ఈ నాడిది పేకాటకు వర్తించుచున్నది.

ఒకతూరి పేకాటయందు నిమగ్నుడైనవాడు-"తల్లి చనిపోయినదని చెప్పగా-లేవకుండగనే-అలా తీసికొనివెళ్ళండి" అన్నాడట.

## 14. కొన్నిపదములు-అర్థములు-వివరణ

| | | | |
|---|---|---|---|
| అంతర్జ్ఞాని | (607) | = | మనస్తత్త్వము నెఱిగినవాడు |
| అనుగలము | (844) | = | అనుకూలము |
| ఆనూపజాంగలములు | (63) | = | జవుక మెట్టనేలలు |
| అపచయము | (784) | = | తగ్గుదల |
| అపనమ్మిక | (560) | = | అపనమ్మకము-విశ్వాసము లేకుండుట. ఈ మిశ్రసమాసమునకు తొలిప్రయోగ మిదియే |
| అభ్యంతరస్థుఁడు | (181) | = | సమీపమున నున్నవాడు |

| | | | |
|---|---|---|---|
| అభ్యస్తుఁడు | (166) | = | ఆరితేరిన వాడు |
| అరహము | (19) | = | అర్హము-అరహము-సంస్కృత సమాస పద్యముననున్నది. "సమ్మత్యరహము గావలయు"- |
| అసముఁడు | (56) | = | అప్పుడు. ఈ శబ్దమునకు - 'అసదు' అని విశేషణప్రయోగమేకలదు. సింగన దీనిని విశేష్యముగా వాడియున్నాడు |
| ఆయకట్టు | (122) | = | రాబడియొక్క నిర్ణయము |
| ఆయగాఁడు | (220) | = | గ్రామోద్యోగస్థుఁడు |
| ఉద్ధారము | (935) | = | అప్పు-ఉద్ధ్రియతే గృహ్యత ఇతిఉద్ధారః హృఞ్-హరణే-పుచ్చుకొనబడునది (అమరము). "ఉద్ధారముగొన కాతని" |
| ఉపచయము | (784) | = | వృద్ధి, పెరుగుదల |
| ఒడితరుడు | (196) | = | ఒడిచి కొనువాఁడు, ఆకర్షించి ధనము లాగువాడు |
| కందించు | (407) | = | బాధపెట్టు |
| కల్లరి | (194) | = | అబద్ధములాడు వాడు |
| కాదంబరిప్రాలు | (302) | = | అసంబద్ధపువ్రాత |
| కాని | (135) | = | మూడుదమ్మిడీల నాణెము |
| కేనము | (353) | = | మోసము- మాయ. ఇది అచ్చముగా కన్నడపదము<br>కేనము లేకనురక్తయైన-కు.సం.1-48 |
| కొలుచు | (592) | = | పొట్టు |
| గుహ్యము చెప్పు | (743) | = | రహస్యము చెప్పు |
| గొరగ | (746) | = | శైవభిక్షకుడు |
| గ్రేకిబట్టు | (216) | = | పరిహాసముచేయు ; |
| చరులు | (148) | = | చారులు<br>"చరులుకన్నులు." రాజుచారచక్షువు. |
| జీవంజీవకము | (257) | = | వెన్నెలపులుగు-చకోరము |
| జీవితము | (448) (589) | = | జీతము-"జీవితమీఁడు" |
| దంష్ట్రము | (50) | = | కోఱ-ఇది దంష్ట్రాశబ్దము. ఆకారాంత స్త్రీలింగము. ఇచట నపుంసకలింగము. |

ధారణసేయు (218) = ఖరీదుకట్టు : వెల నిర్ణయించు

నిష్కృపణార్థుడు (348) = కుత్సితుఁడు : లోభి- మూలమున కీయర్థము సరిపడదు. ఇది కామందకము లోనిది: "పతులమాటకు పొందుపడ మాట గల్పించునతఁడు నిష్కృపణార్థుడనఁగఁజెల్లు" అని తెలుగున నున్నను సంస్కృత మూలములో (13 సర్గ-4వ శ్లోకము) నిసృష్టార్థః" అని కలదు. కౌటిలీయార్థ శాస్త్రమున (1అ-16 ఖా. 2 శ్లో) "నిసృష్టార్థః" అనియే కలదు. రాజుల మాటలకు పొందు పడునట్లు మాటాడువాడు అని దీనియర్థము. తెలుగున నర్థము సరిచేయవలెనన్న-"పతుల మాటకు పొందుపడ మాటఁ గల్పించు నతఁడు నిసృష్టార్థుఁ డనఁగఁజెల్లు" అని మార్చవలెను.

పథిస్థము (99) = మార్గమున నుండునది. సంస్కృతమున పథిన్ శబ్దము; ఇకారాంతము- "పంథంతి యాంత్యేన పంథా. న-పు. పథిగతౌ-దీనిచేత బోవుదురు"

(అమరము)

తెలుగున కవులు 'పథము'నే వాడిరి.
పథశ్రమ. కు. సం. 1-126. (యతి)
దశ. 11-75.

పరిఘము (883) = అగడ్త- ఇది 'పరిఖ' అని యుండవలెను. "ఖేయంతు పరిఖా" (అమరము)-ఆకారాంత స్త్రీ లింగము. ఇచ్చట పరిఘము నపుంసకలింగము

పుడమిపతి (428)
పుడమిఱేఁడు (432) = శైవకవులు వాడిన యీ మిశ్రసమాసమును సింగ వాడియున్నాడు

పొలఁపరి (648) = జాడ తెలిసినవాడు

పుష్పలావి (38[illegible]) = పుష్పలమ్మస్త్రీ. కవిప్రయోగములలో "పుష్ప
= లావిక" యని యున్నది. ఇచ్చట "పుష్ప
= లావి" అనురూపము నిర్ధారకము.

జేలుకవి (27) = అంగమర్దనకవి.

బయుడు (726) = భయముగలవాడు : బయ్యాడు = పందుడు.
ఇది బయ్యుడుగా నుండదగును.

వజ్రలోభి (765) = లోభులలో అతికఠినుడు.

వర్షధరుడు (282) = అంతఃపురమున కావలివాడు; హెగ్గడి. అమరమున "షండోవర్షవరస్తుల్యౌ" అని వర్షవర శబ్దముగానేయున్నది.
"యేత్వల్పసత్వాః ప్రకృతాః క్లీబాశ్చస్త్రీస్వభావినః
జాత్యానదుష్టాః కార్యేషు తేవై వర్షధరాస్మృతాః"

విషదాయి (267) = విషముపెట్టువాడు.

సంపిహితుడు (632) = వ్యక్తిత్వము గోల్పోయినవాడు.

సావాసి (651) = అంతఃపురము కావలివాడు.

సనగగింజ (963) = సెనగగింజ- 'స' యతిస్థానము.

సన్నపువాడు (653) = అల్లుడు.

సుహృత్తు (747) = స్నేహితుడు: సుహృత్ శబ్దమునకు సుహృత్తు తత్సమరూపము నిర్ధారకము.

సురతాణి (19) = మహమ్మదీయప్రభువు. అన్యదేశ్యము "సుల్తాన్, సుల్తాను" అనురూపములు గలవు. ఈ సుల్తాన్ పదము అన్యదేశముకాబట్టి శ్రీనాథుడు దీనిని "సురత్రాణుడు"గా సంస్కృతీకరించినాడు.

"ధరాసురత్రాణ............గర్వపాథోరాశికలశజులకు"
భీమ-1-29

"సుల్తాను" అయి తెలుగున సురథాణి, సురతాణిఅయినది.

ముసరము (596, 648) = చక్కనైనది:

హాలికుఁడు (224) = సేద్యగాడు. హలశబ్దమునకు 'ఇకన్' ప్రత్యయము చేర్చుటచే 'హాలికుఁడు' అనియే హ్రస్వరూపము. అమరమున 'హాలిక' శబ్దము పఠింపబడినది.

హాలహలము (298) = హాలాహలము రూపాంతరము.

హుతాగ్ని (311) = నిత్యాగ్నిహోత్రి.

ఇందింకను కొన్ని పదములు గలవు. స్థలసంకోచముచే విరమించితిని.

ఈ క్రింది పదముల కర్థము స్పష్టమగుటలేదు. పాఠభేదములున్నవేమో తెలిసికొనుట కాధారములేదు. పండితుల పరిశీలనకై యిట నిచ్చుచున్నాను—

ఛట్మరులు (196), జనటాయగాండ్రు (196), దులాయించు (218), మిషి(388), శకడి(497), సాపుతేలు(387), సుత్తెకడఁగు(122), సౌనారని(566).

పై వానిలో కొన్ని ఈ నాటి నిఘంటువులకెక్కలేదు. ఈ పద ప్రయోగములన్నియు క్రీ. శ. 15వ శతాబ్దికి పూర్వములే.

## 15. లోకనీతులు

ఈ గ్రంథమున రాజనీతి విషయములతోపాటు లోకనీతులున్నవి. అవి యానాటి పాఠ్యగ్రంథములలో నెక్కదగినవి. వాని నీ క్రింద తెలుపుచున్నాను—

20 క. జనులిది యల్పగ్రంథం
బనవలవదు దీనఁ దోచు నన్నియుఁ జెక్కల్
గనుపట్టఁజేయు వాత్తా
యనవివరము పిన్నగాదె యారసి చూడన్.

21 క. ఘవి నధికుఁడు దెలుపని యు
క్తివిశేషము చిఱుతవాఁడు దెలుపెడు నొకచో
రవికి మఱుఁగైన గొందిని
దివియ ప్రకాశింపఁజేయదే యొక్కొకచోన్.

31. క. సరసకవిత రుచియెఱుఁగని
పురుషులఁ బశువులని నిక్కముగ నెఱుఁగుము వా
రురువడిఁ దృణంబు మేయమి
పరికింపఁగ ధరణిఁ బసుల భాగ్యంబెందున్.

35. ఆ.వె. నీతియెఱుఁగువాఁడు నిఖిలంబులందును
ఖ్యాతిలాభ పూజలందు నొప్పుఁ
గాక యొరుఁడు పొందఁగలఁడె నేర్పునకు వి
వేకమునకు నూఁత వెరవకాదె.

40. క. మతిమంతుల యంత్రంబులు
ప్రతియంత్రక్రియనెగాని పాయవు, దృఢకీ
లిత ఘనఘటితకవాటము
ధృతిఁదాలము చేతఁగాక తెఱవఁగ నగునే.

85. క. బలవంతుఁడు మన్నించిన
బలహీనుఁడు బలియుఁడనఁగఁబడు ధారుణిలో
వలరాయఁడు చేపట్టిన
యలరులు బాణములుగావె యౌభళకందా.

210. ఆ.వె. అధికుఁడైన వాని నతినీచతరమైన
యట్టిపదవిఁదెచ్చి పెట్టు టెల్ల
వర్ణనీయమైన వరశిరోరత్నంబు
కాలఁగట్టినట్లుగాదె తలఁప.

715. ఆ.వె. పెద్దదయిన యినుపముద దానొక లేఁత
తీవనైన నెట్లు త్రెంపనేర్చు?
నల్పమైన నదియు నతిశరధారచేఁ
ద్రెంపనోపు నెంత దృఢమునైన.

717. గీ. అంధకారంబు నప్పుడు నడఁగి పోదు
దినపతేజంబు నప్పుడు తిరిగి రాదు
యెట్టి మఱుఁగైనఁగాన్పించు నెచటనున్న
చారుతరమైన యట్టి విజ్ఞాన దృష్టి.

744. ఆ.వె. ఒక్కతల్లి కొవ్వు నుదయంబుఁ బొందిన
బాంధవంబుకంటె బహుగుణముల
వసుధనెన్నిచూడ వాగ్జాత బాంధవం
బధికమండ్రు చూపె యార్యులెల్ల.

745. ఆ.వె. ఆపదమునకైన యాతఁడె చుట్టంబు
నరసిప్రోపఁ జాలునతఁడు తండ్రి
అరయ నమ్మమెలఁగునతఁడె మిత్రుఁడు తన
మదికిఁబ్రియము సేయునదియె తల్లి.

745. క. పరిపూర్ణుఁడయ్యుఁ బురుషుఁడు
పరమసుహృతులన యాపదవలయు మదిన్
బరిపూర్ణుఁడయ్యు నంబుధి
పరఁగఁగ శశిపొడుపు నాసపడఁడే యెపుడున్.

## 16. వాఙ్మయ పరిశోధన

### మడికి సింగన : ప్రథమపరిశోధకుడు

ఈ నాడు విశ్వవిద్యాలయములలో వాఙ్మయపరిశోధన ప్రధాన స్థాన మాక్రమించినది. కాని యీపరిశోధన తెలుగున క్రీ. శ. 15వ శతాబ్దిలోనే ప్రారంభమైనది. పరిశోధన యనగా, నింతకుముందు వెలుగులోనికి రాక, అజ్ఞాతములైన విషయముల కొఱకు గవేషణచేసి, వానిని సేకరించి, ఒక గ్రంథరూపమున వానిని వెలువరించుట.[1] ఈ దృష్ట్యా, సంకలనగ్రంథములు మన భాషలో మొదటి పరిశోధనగ్రంథములు. సంకలనకర్త విషయముల కొఱకనేక గ్రంథములు చదివి, వానిని క్రోడీకరించి, ఒక్కచో మన కందుబాటులో నుండునట్లు సమకూర్చును. మడికి సింగన తనకు పూర్వమున్న కృతులను సేకరించి, విషయవర్గీకరణముచేసి, ఉదాహృతగ్రంథముల పేళ్లుతెలిపి, మనకు సకలనీతిసమ్మతమును అందించినాడు. కాబట్టి, ఆంధ్ర సాహిత్య పరిశోధనారంగమున సింగన ప్రథముడు; అతనికృతి తెలుగున ప్రథమ పరిశోధనా

1. ఇట్టి గ్రంథములనే, ఇంగ్లీషుభాషలో Thesis అని, తెలుగున సిద్ధాంతవ్యాసమని, పరిశోధనాగ్రంథమని వ్యవహరింతురు.

గ్రంథము. అయితే, ప్రస్తుతకాలమువలె, ఆకాలమున పరిశోధనకు పట్టప్రదానములేదు. అంతే భేదము.

పదునైదవ శతాబ్దినాటి ప్రథమపరిశోధకుని గ్రంథము అద్యతనాంధ్ర వాఙ్మయమున ప్రథమపరిశోధకులై నేటి పరిశోధకుల కందఱకు మకుటాయమానులైన మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించుట అత్యంతము సమంజసము, సహేతుకము నైయున్నది.

ఇంతవఱకును నీ సంకలనగ్రంథములను గూర్చి పరిశోధనయే జరుగలేదు. ఈ పరిశోధనకు సాధనములు ఆకరగ్రంథములు, ఇవియే వాఙ్మయపరిశోధనకు మౌలికములైన గ్రంథములు. భావిపరిశోధకుల కుపయుక్తమగునట్లు వానినిగూర్చి తెలుపుచున్నాను.

## 17. తెలుగులో ఆకరగ్రంథములు

ఏ భాషలోనైనా ఆకర గ్రంథాలు, భాషా వాఙ్మయాలు బాగుగ అభివృద్ధి చెందిన వెనుకనే తప్ప, ప్రాథమికావస్థలో నెన్నడు బయలువెడల నేరవు. అతిప్రాచీనమైన సంస్కృతభాషలో కూడ క్రీ. శ. పదునొకండవ శతాబ్ది నుండి మాత్రమే ఆకరగ్రంథము లవతరించినవి. వానిలో "కవీంద్ర వచన సముచ్చయము" అనునది మొదటిది. ఇది పండ్రెండవ శతాబ్ద ప్రారంభమునవెలసినది. ఆవెనుక జల్హణుని సూక్తిముక్తావళి, శార్ఙ్గధరపద్ధతి, వల్లభదేవుని సుభాషితావళి మున్నగు నవి రచితములై ప్రచారములోనికి వచ్చినవి.

ఈ ఆకరగ్రంథరచన యనగా సామాన్యమైన పనిగాదు. అందును ముద్రణాదివ్యవస్థ లేనినాడు అట్టి కార్యనిర్వహణము దుర్ఘటమనియే చెప్పవచ్చును. మొదటిది–ఆకరగ్రంథకర్తకు తన కాలమునకు ముందున్న గ్రంథముల విషయము చక్కగా తెలిసియుండవలెను. రెండవది—ఆయా గ్రంథములను సేకరించవలెను. మూడవది—వాని నన్నింటిని చదివి తాను సూచింపదలచిన పద్యములుగాని, శ్లోకములు గాని గుర్తుపెట్టుకొనవలెను. నాల్గవది—అట్టి వానిని శీర్షికల క్రింద విభాగించవలెను. అయిదవది–వానిని గ్రంథముగా

వ్రాయించవలెను. ఇట్టి "పంచకరపాట్లు"[1] పడినగాని ఆకరగ్రంథము లోకములో నవతరించదు. సృజనాత్మకమైన యుత్తమరచన చేసిన కవి కావ్యమును చదివి యెంతగా యానందింతుమో, ఆకరగ్రంథ రచనవలన గూడ అంత యానందమును పొందుదుము—ఏలననగా, ఈగ్రంథములో మనకు తెలిసి యుండియు లభ్యముగాని గ్రంథములనుండి కొన్ని పద్యములైన గ్రహింపబడును. వానివలన ఆ గ్రంథవిశిష్టత తెలిసికొనవచ్చును. ఒక్కొక్కప్పుడా గ్రంథమే పూర్తిగ లభ్యమైనచో, అప్పుడు మన కెంత యానందము కలుగును? పోయిన దర్వ్యము తిరిగి లభించినట్లు!

తెలుగు భాషలో తక్కిన ద్రవిడ, కన్నడ, మలయాళ, మహారాష్ట్ర భాషలకన్న యీ ఆకరగ్రంథాలు చాలా హెచ్చని చెప్పవచ్చును. ఈ ఆకర గ్రంథాలు మూడు విధాలు—

(1) సంకలన గ్రంథములు (Anthologies).

(2) లక్షణ గ్రంథములు(Works relating to Prosody etc.)

(3) గ్రంథసూచికలు. (Catalogues).

వీనిని పరిశీలించిన, అవి మన తెలుగు భాషా సాహిత్య చరిత్ర కెంత ప్రధానాధారములో తెలియగలదు.

## సంకలన గ్రంథములు

సకలనీతిసమ్మతము— దీనినిగూర్చి పూర్తిగ తెలుపబడినది.

ప్రబంధ రత్నావళి— ఇది రెండు సంకలనగ్రంథముల సంపుటి.

1. పెదపాటి జగన్నాథకవి (జగ్గన) ప్రబంధ రత్నాకరము.

2. ఉదాహరణ పద్యములు (అకర్తృకములు).

---

1. ఇది శ్రీనాథ ప్రయోగము— పంచకరపాట్లు బడి తన్ను బెంచి విసిగి ఆపదల బాపి రక్షించినట్టి తల్లి —కాశీఖండము 4-26

ఈ రెండింటియందు క్రీ.శ. 1550 వఱకుగల కవుల రచనల నుండి పద్యములు గ్రహింపబడినవి. ప్రబంధరత్నాకర మైదాశ్వాసముల గ్రంథము; తంజావూరి పుస్తకశాలలో మాత్రమే దీని ప్రతియున్నది. ఉదాహరణ పద్యములు— ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున అనుపూర్వికముగా వ్రాయబడిన యొక తాళపత్ర గ్రంథము. పై రెండింటిని పరిశీలించి క్రొత్తగా తెలియదగిన వానిని సంధానించి పండిత ప్రభాకరులు కీర్తిశేషులు వేటూరివారు దీనిని 'ప్రబంధ రత్నావళి' యను పేర క్రీ.శ. 1918లో ప్రకటించిరి. నాటికి నేటి కదియే ముద్రణము.

ఈ సంకలనమునుండి మనకు వాఙ్మయచరిత్రకు తోడ్పడునవి అలభ్యములైనవి ఎన్ని గ్రంథములు గలవో చూడుడు—

1. తెలుగున జైనమత సంబంధములగు.—
   (1) జినేంద్ర పురాణము.
   (2) ఆదిపురాణము.
2. నన్నెచోడకవికళావిలాసము.
3. రంగనాథునిపద్యరచనలు.
4. తిక్కన విజయసేనము.
5. అధర్వణాచార్య భారతపద్యములు.
6. చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము.
7. దగ్గుపల్లి దుగ్గన శివకాంచీమాహాత్మ్యము.
8. పిల్లలమర్రి పినవీరన పురుషార్థ సుధానిధి.
9. బైచరాజు ముమ్మయ విష్ణుకథానిదానము.
10. భావన పెమ్మన అనిరుద్ధచరిత్ర.
11. తెనాలి రామలింగకవి—
    (1) కందర్పకేతువిలాసము.
    (2) హరిలీలావిలాసము.

12. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము నుండి యుదాహరింపబడిన యొక పద్య మాధారముగా, ఆగ్రంథమును పూర్తిగా సంపాదించి, ఉదాహరణవాఙ్మయచరిత్రమున నేను వ్రాసితిని.

13. శ్రీ తిరుపతి దేవస్థానము వారికి లభింపని తాళ్ళపాక అన్నమాచార్యుల వారి "వేంకటేశ్వర శతకము"నుండి యొక పద్య మిం దుదాహరింపబడినది. దానినాధారముగా ఆ శతకము నంతను సంపాదించి ప్రకటించితిని.

14. ఇందున్న ఒక సీసపద్య మాధారముగా, ఆంధ్రసాహిత్య పరిషత్తు వారు హరిభట్టు రచించిన ఉత్తరనారసింహపురాణమును గుర్తించి ప్రకటించి యున్నారు.

ఇట్టి విలువగల గ్రంథము తిరిగి సంస్కరణతో ముద్రణ నంద వలసి యున్నది.

ప్రబంధమణి భూషణము

ఈ సంకలనగ్రంథమున క్రీ. శ. 1750 వరకు నున్న కవుల గ్రంథముల నుండి పద్యములు పేర్కొనబడి యున్నవి. దీనికర్తపే రెరుగరాదు. ఇందు ప్రసిద్ధముగా నున్న మనుచరిత్ర, విజయ విలాసము, వాల్మీకి చరిత్రమున్నగు ప్రబంధముల నుండియే గాక, అముద్రితములగు నీక్రిందివాని నుండి పద్యము లుదాహరింపబడియున్నవి—

1. నారన సూరన—(1) ఉదయనోదయము.
   (2) వనమాలీ విలాసము.
2. అంగర నృసింహకవి—రాజరాజ్యాభిషేకము.
3. కస్తూరి భట్టురాజు—గౌరీకల్యాణము.

ఈగ్రంథము శ్రీమానవల్లి రామకృష్ణకవిగారి పీఠికతో క్రీ.శ. 1910లో ప్రకటితమైనది. ఈపీఠికయందలి విషయము లింకను తెలియవలసినవి చాలా గలవు.[1]

శ్రీకృష్ణలీలావిలాసము

ఇది పూసపాటి కుమారాచ్యుత రామరాజుచేత సంధానితము. ఇందు కూచిమంచి తిమ్మనకవి రచనలనుండి యుదాహరణములు గైకొనబడుటచేత

1. ఇదినేడుతిరిగి పునర్ముద్రణము కానున్నది.

విది క్రీ. శ. 1800 ప్రాంతమున రచితము. ఇది అముద్రితము. కొన్ని క్రొత్త ప్రబంధము లిందుండి తెలియనగును.

శృంగారపద్యావళి (1903)

ఇది శ్రీ వేంకటగిరిపాలకులైన శ్రీ కృష్ణ యాచేంద్రుల యానతి ననుసరించి మోదీ జగన్నాథమల్ అనునాతనిచే సంకలనము గావించబడినది. ఇందు ప్రబంధముల నుండి కేవలము శృంగారపద్యములు మాత్రమే చేకొన బడినవి; ముద్రితము.

ఋతుచక్రము (1915)

దీనిని మహాప్రసిద్ధులగు సమర్థిరంగయ్యసెట్టి గారు సమకూర్చిరి. ఋతువర్ణన ప్రబంధములనుండి కలదు. ఆయన కుమారులు రామానుజముసెట్టిగా రచ్చువేయించిరి.

భారతసారముక్తావళి

ఇందు కవిత్రయ భారతము నుండి రాజకీయ సాంఘి కాధ్యాత్మికాది సకల వ్యవస్థలకు సంబంధించిన పద్యము లాయా శీర్షికలలో వర్గీకరింపబడినవి. ప్రతిపద్యమునకు ఆకరము లీయబడినవి. ఈనాడు భారతమును గూర్చి వెలువడి, వెలువడుచున్న వందలకొలది పుటల గ్రంథములకన్న నీ భారతసారముక్తావళి యన్ని తెఅగుల సారభూతమైనది. ఇది కవిత్రయ భారతమునం దభిరుచి కలిగించుటకు ప్రథమ సోపానము. దీనిని సమకూర్చిన వారు సుప్రసిద్ధులగు కట్టమంచి రామలింగారెడ్డిగారి జనకులు సుబ్రహ్మణ్య రెడ్డిగారు. ఈ గ్రంథము రెండు ముద్రణము లందినను ప్రతులు దొరకుట దుర్లభము—ఆవశ్యకముగా తిరిగి ముద్రింప దగినది.

భాగవతసార రత్నావళి

ఇదియును పై భారతసారముక్తావళి పథకమున భాగవతమునుండి ఆయా పద్యములు వర్గీకరింపబడి, సంకలనము చేయబడినది. భాగవతము కేవల మాధ్యాత్మిక విషయికమే కావున నిందు వర్గీకరణముతోపాటు గ్రంథము—

1. జగదుత్పత్తి ప్రకరణము. 2. సగుణ ప్రకరణము. 3. నిర్గుణ ప్రకరణము. 4. స్తుతి ప్రకరణము అను నాలుగు ఖండములుగా విభాజ్యమైనది. దీని సంకలన కర్తలు - పై సుబ్రాహ్మణ్య రెడ్డిగారే - ఇదియు రెండు మారులు ముద్రిత మైనది. నేడు ప్రతులు దొరకవు.

## ఆంధ్ర కవితారత్నాకరము

భట్టిప్రోలు రామచంద్రయ్య అను నాతడు క్రీ. శ. 1900లో వెలువరించెను. ఇందు సూక్తులు, లోకోక్తులు, ప్రాచీనప్రబంధములనుండి ఆకరములతో నీయబడినవి.

## వర్ణన రత్నాకరము

అద్యతనకాలమున వెలువడిన సంకలనగ్రంథములకు శిరోభూషణము. ఇందు మూడు వందల ప్రబంధముల నుండి వర్ణన లన్నియు వర్గీకరింపబడి, నాలుగు భాగములలో నున్నది. ఈ సంధానమసాధారణమని విద్వాంసు లేకగ్రీవముగా కొనియాడిరి. ఆంధ్ర భోజుడు శ్రీపిఠికాపురాధీశ్వరుని కంకితము. విద్వత్కవీంద్రులైన శ్రీదాసరి లక్ష్మణ స్వామిగారిచే సంకలితము. ఈ గ్రంథము ప్రాచీనవాఙ్మయపరిశోధన జరుగుచున్న యీ కాలమున సత్వరము పునర్ముద్రింప దగినది.

## లక్షణగ్రంథములు

తెలుగు భాషలో ఆకరగ్రంథాలలో ఇవి చాల విలువ గలవి. వీని వలన కలిగెడి ప్రయోజనములు విశేషముగా నున్నవి.

1. లక్షణ గ్రంథకర్తలు, పూర్వ కవి ప్రయోగములను పరిశీలించి, ఛందోలక్షణములను యతి ప్రాసాదివిశేషప్రయోగములను దెలుపుటచే యతిప్రాస పరిణామము—కాలక్రమమున యతుల సంఖ్య ఎట్లు పెరిగినది— అని తెలుసు కొనుటకు వీలగును.

2. లక్షణగ్రంథములు కావ్యభాషనే ప్రమాణముగా తీసుకొని భాషాలక్షణములను నిరూపించుటచేత - భాషా తత్త్వశాస్త్ర పరిజ్ఞానమున కివి యత్యంతసహాయకారులు.

3. వాఙ్మయవిషయమున నీ లక్షణగ్రంథకర్తలు, నన్నయాది పూర్వకవికృతగ్రంథములనే కాక తమ సమీపకాలికులగు కవుల గ్రంథముల నుండి పద్యము లుదాహరించుటచేత—ఈనాడు మనకు లభ్యముగాని గ్రంథముల నెఱుంగుటకు తోడ్పడుచున్నవి.

4. కొందరు లక్షణగ్రంథకర్తలు బహుళముగా నొక కవికృత గ్రంథములనుండి పద్యముల నొసగిన, వానిమూలమున ముద్రితగ్రంథములలోని పాఠభేదములను సరిచూచుకొనుట కుపయుక్తములు.

కడచిన నెల భారతిలో కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున శృంగారనైషధమునందలి పాఠములకు నేడు ముద్రితమైన ప్రతి యందు గల పాఠములకు గల భేదమును వివరించితిని. ఆ గ్రంథమునకే తక్కిన యొకటి రెండు లక్షణగ్రంథములలోనుండి ముందు చూపుదును.

5. కవికాల నిర్ణయమునకు నీ లక్షణగ్రంథము లొక విధముగా నాధారములని చెప్పవచ్చును. ఉదాహరణమునకు:

వెల్లంకి తాతంభట్టు—క్రీ. శ. 1480 ప్రాంతముల కవులనే తప్ప తక్కినవారి నుదాహరింపక పోవుటచేత—అతని కాలము క్రీ. శ. 1500 ప్రాంతమనియు, నాత డుదాహరించిన కవులు శతాబ్దికి ముందువారనియు చెప్పుటకు మనకు సాధ్యమగుచున్నది. లక్షణగ్రంథకర్తలలో తాతంభట్టునకు పూర్వలాక్షణికులు, పూర్వకవుల గ్రంథముల నుండి యుదాహరణము లీయలేదు గాన నీ పద్ధతి క్రొత్తదే యాయెను.

లింగమకుంట తిమ్మన (1550) సులక్షణసారమున, అప్పకవి అప్పకవీయమున (1656), గణపవరపు వేంకటకవి (1670) ఆంధ్ర ప్రయోగ రత్నాకరమున, వార్తాకవి రాఘవయ్య (1650) లక్షణదీపికయందు, పొత్తపి వేంకటరమణ కవి (17 వ శ) లక్షణశిరోమణియందు, కస్తూరి రంగకవి (1740) ఆనంద రగరాట్ ఛందమున, కూచిమంచి తిమ్మకవి (1740) సర్వ లక్షణ సారసంగ్రహమున, అడిదము సూరకవి (1760) కవిసంశయ విచ్ఛేదమున—నుదాహరించిన గ్రంథము లాయా కవుల కాలములు నిశ్చితము లగుటచే నందుదాహరింపబడిన కవుల కాలములు కూడ నితర సాధనములచేత నిశ్చయించుటకు వీలు కలుగుచున్నది.

లక్షణగ్రంథోదాహృతుల వలననే మనకు తెలిసిన గ్రంథములు. నష్టమైన వానిని, చూడుడు-

1. అథర్వణాచార్యకృత భారతము.
2. ఎఱ్ఱాప్రెగడ రామాయణము.
3. కపుల షష్ఠము-అనగా భాగవత షష్ఠ స్కంధము.
4. అల్లసాని పెద్దన హరికథాసారము.
5. ,, సత్యావధూపరిణయము.
6. నందితిమ్మన వాణీవిలాసము.
7. ,, త్రిస్థలీదండకము.
8. పింగలి సూరన గిరిజా కల్యాణము.
9. చదలువాడ మల్లన ద్విపద రుక్మాంగదచరిత్ర.
10. చరిగొండ ధర్మన శశిబిందు చరిత్ర.[1]

ఇంకను కర్తృత్వము తెలియరాని-శారదాదర్పణము, దేవీవిజయము, చారుదేష్ణచరిత్రము, చమత్కారరామాయణము, మధుసేనము-మున్నగు పద్యకృతు లెన్నియో మనకు లక్షణగ్రంథముల నుండి తెలియనగు చున్నది.

6. సమగ్రవాఙ్మయచరిత్ర కేమి, సమగ్రవాఙ్మయ సూచికా సంకలనమున కేమి, లక్షణగ్రంథోదాహృతులు పరమప్రమాణములు — కాని యీ లక్షణగ్రంథములలో చాలవఱకు అముద్రితములు. ముద్రితములై యున్న వానిలో నే రెండో మూడో తప్ప తక్కినవి సుపరిష్కృతములు కావు. ఈనాడు ముందుగా నీ లక్షణగ్రంథముల ముద్రణము, పరిశోధన ముఖ్యముగా నావశ్యకమై యున్నవి.

7. ప్రస్తుతము ముద్రింపబడిన ప్రాచీనగ్రంథములు వ్రాత ప్రతులతో సరిచూచుకొనుటకు నీ లక్షణగ్రంథము లుపయుక్తములు. వీనికి ఒక ప్రసిద్ధగ్రంథము నుండి ప్రాచీనకృతి నవీనకాలమున వెలువడిన దాని నుండి రెండుదాహరణలు చూపుచున్నాను-

---

1. ఇందు వ్యాస విస్తర భీతిని కొన్నియే యిచ్చితిని. ఇంకను పెక్కులు గలవు.

1. నాచనసోముని యుత్తరహరివంశమునుండి "ఆపాద శిరో మస్తక" అను కందపద్యమును తాతంభట్టుదాహరించి యున్నాడు. అప్పకవి అప్పకవీయమున ఉదాహరించిన "నాతో మార్కొన లేరు నిర్జరపురీనాకేశ...." అను శార్దూలవృత్తపద్యమును నేటి ముద్రితోత్తరహరివంశమున కానరావు.

2. ప్రాచీనకృతియగు పండితారాధ్యుల శివతత్త్వసారము నలుబదేండ్ల క్రిందట ముద్రితమైనది. అంతకు ముందిది వ్యాప్తిలో లేదు. ముద్రితగ్రంథ మసమగ్రము. 489 కందపద్యము లున్నవి. కాని గనప వరపు వేంకటకవి ఆంధ్రప్రయోగ రత్నాకరమున, కస్తూరి రంగకవి ఆనంద రంగరాట్ ఛందస్సునను దూరాహ్వానప్లుతయతికి లక్ష్యముగా నుదాహరించిన యీ క్రింది పద్యము ముద్రితప్రతిలో గానరాదు.

క. ఆ యతి త్రిపురాంతక దే
వాయని పిలుచుటయుఁ గటకమంతయు వినఁగా
జాయక కిన్నెరబ్రహ్మయ
కోయని యెలుగీవె తొల్లి యురగాభరణా !

అముద్రితములైన బాలబోధఛందస్సు, భూపాలీయము, సుకవి కర్ణామృతము మొదలగువానిని సమ్యక్పరిశీలనము గావించిన నింకను నెన్నియో విశేషములు— ముద్రితగ్రంథములలో కానరానివి— బయలుపడును. తంజావూరి పుస్తకశాలలో ఎనిమిది తాళపత్రగ్రంథముల కట్ట లున్నవి—అవి యన్నియు లక్షణగ్రంథములే. కొన్ని సమగ్రములు, కొన్ని అసమగ్రములు, కొన్ని సంకీర్ణములు—అయినను నవి మిక్కిలి విలువ గలవి. అవి అచ్చుమాట యటుంచి కాగితముపై గూడ నెక్కలేదు. క్షేమేంద్రుని నిశితపక్షిసంవాదము నుదాహరించిన తిక్కన సోమయాజి కవివాగ్బంధము తాళపత్రదశను దాటి రాలేదనిన, వీని పరిస్థితి ఎట్లున్నదీ తెలియగలదు. ఈ విషయ మింతటితో విరమింతును.

## గ్రంథ సూచికలు

ఇవి రెండు వర్గములు—

1. అముద్రిత గ్రంథ సూచికలు.

2. ముద్రిత గ్రంథ సూచికలు.

మొదటి వానిలో తొలిగా పేర్కొనదగినవి మదరాసు ప్రభుత్వము వారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార సూచికలు—

ఇవి రెండు విధాలు—1. త్రైవార్షిక సూచికలు (Trenniel Catalogues). 2. వివరణాత్మ సూచికలు (Descrip:ive Catalogues).

(1) త్రైవార్షిక సూచికలు అనగా మూడేండ్ల కొకసారి ప్రభుత్వమువారు సేకరించిన వాని వివరము లిందుండును. గ్రంథమెచ్చట లభ్యమైనది, దాని స్వరూపము. గ్రంథము నుండి మనకు తెలియదగినవి, ఆద్యంతములు, కవికాలనిర్ణయమున కనుకూలించు విషయము లుండును.

| సంపుటము సంఖ్య | సంవత్సరము | సంగ్రహింపబడిన గ్రంథసంఖ్య. |
|---|---|---|
| 1 వ సంపుటము | 1911—1913 | 1—137 |
| 2 ,, | 1914—1916 | 138—292 |
| 3 ,, | 1917—1919 | 293—559 |
| 4 ,, | 1920—1922 | 560—715 |
| 5 ,, | 1923—1928 | 716—812 |
| 6 ,, | 1928—1935 | 813—1069 |

ఇవి ఆరు సంపుటములు— 5, 6 సంపుటములలో త్రైవార్షిక విధానము సడలినది. మొత్తము 1069 గ్రంథముల సూచిక లిందున్నవి.

(2) వివరణాత్మకములు (Descriptive Catalogues). ఇవి 15 సంపుటములు.

| | |
|---|---|
| 1 వ సంపుటము | ప్రబంధములు |
| 2 ,, | శృంగార ప్రబంధములు |
| 3 ,, | ,, |
| 4 ,, | ద్విపద |
| 5 ,, | ఛందో వ్యాకరణములు |

| | | |
|---|---|---|
| 6 వ | సంపుటము | వచనకావ్యములు |
| 7 | ,, | శతకములు |
| 8 | ,, | యక్షగానము—దండకము |
| 9 | ,, | వేదాంతము |
| 10 | ,, | గణితము—జ్యోతిషము |
| 11 | ,, | వైద్యము |
| 12 | ,, | సంగీతము |
| 13 | ,, | చరిత్ర |
| 14 | ,, | మెకంజీ కైఫీయతుల సూచిక 1—150. |
| 15 | ,, | ,, 150—250. |

మొత్తము 21 సంపుటములు.

త్రైవార్షిక సూచికల కంటె వివరణాత్మకములలో హెచ్చు వివరము లుండును. ఇవి సాహిత్యశాఖల ననుసరించి సాహిత్యప్రక్రియల ననుసరించి సంకలనము చేయబడినవి. వివరణాత్మకములలో తాళపత్రగ్రంథలేఖన కాలము కూడ, లభ్యమైన వానికి నీయబడుటచేత, కవి చరిత్రకారులకు పరిశోధకులకు నివి ఎంతయో సహాయకారులు—ఈ రెండింటియందును ఆంగ్లభాషలోగూడ సంగ్రహముగా వివరణము లుండుటవలన నాంధ్రేతరులకు నివియుపయోగించుట కనుకూలపడును. ఈ 21 సంపుటములలో 19 సంపుటములకు తెలుగు వివరణములు వ్రాసినవారు కీ. శే. ప్రభాకరశాస్త్రులవారే యైనను నివి ప్రభుత్వపక్షమున సాధికారముగ ప్రకటితము లగుటచేత వారి పేరిందు కన్పట్టదు. ఇవి యన్నియు ప్రామాణికములుగా గ్రహింపదగినవి. కాని, యీ 21 సంపుటములలోని విషయము లచ్చులో నున్నను ఈనాటికిని కొన్ని విషయము లాంధ్ర సాహిత్య చరిత్రల కెక్కలేదు.

ఇంక తంజావూరి సరస్వతీ మహలు లైబ్రరీవారి తెలుగు గ్రంథ సూచికలు-ఇవి రెండు సంపుటములు.

(1). 1—818 వఱకు గల గ్రంథముల వివరణమున్నది. ఇదియే నేడుమనకు సుదూరమున నున్న తంజావూరిలోని అపూర్వగ్రంథములను తెలుపు కేటలాగు. దీనిని ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు ప్రకటించిరి.

(2) 819—1043 వఱకును గల గ్రంథములు. ఇందు తెలుగు కావ్య
ములు లేవు గాని, సంగీత నాట్యశాస్త్రములకు సంబంధించిన పెక్కు గ్రంథ
ములు—భరతశాస్త్రము తెలుగు టీక—అభినయదర్పణము తెలుగు టీకమున్నగు
నవి యెన్నియో గలవు. శహాజీ కృతమగు రాగవిబోధ మున్నగు నపూర్వ
కృతులు, పదములు గలవు. సోమనార్యుడు మున్నగు సంగీతవిద్వాంసు లిందు
తెలియవత్తురు. సంపాదకులు శ్రీ విశలదేవుని సుందర శర్మగారు—ఇది
ప్రస్తుత వ్యాసకర్త విపులాంగ్లేయపీఠికతో వెలువడినది.

## పరిషత్పుస్తక భాండాగార సూచికలు

ఆంధ్రసాహిత్య పరిషత్తున గల అపూర్వతాళపత్రగ్రంథసూచి
కలు మూడు భాగము లిప్పటికి వెలువడినవి. ఇందులో ప్రథమ భాగము పరిష
త్పత్రిక 3 వ సంపుటము నుండి ప్రారంభమైనను అది వేరుగా గ్రంథరూపమున
వెలువడలేదు. ద్వితీయ తృతీయ భాగములు ప్రత్యేక గ్రంథములుగా వెలువడి
నవి. తృతీయ భాగమున వ్యాకరణ ఛందోలంకార గ్రంథ వివరణము లున్నవి.
మొదటి రెండు భాగములకును కీ. శే. కొత్తపల్లి సూర్యారావుగారును, మూడవ
భాగమునకు శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారును కర్తలు.

మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగార సూచికల రీతిని, ఆంధ్ర
సాహిత్య పరిషత్పుస్తక భాండాగారమునకు సూచికలు వెలువడినచో, మనవాఙ్మయ
చరిత్రకనేక నూతనాంశములు సమకూడుటయే గాక, కవికాల నిర్ణయాదులకు,
పాఠభేద పరిష్కరణమునకు నవి యత్యంతము సహాయకారులు కాగలవు.

## ముద్రితగ్రంథ సూచికలు

తెలుగులో ముద్రణ ప్రారంభము క్రీ. శ. 1747లో నైనను, క్రీ శ.
1868వ కు ననగా ముద్రణ శాసనము అమలులోకి వచ్చువఱకు ముద్రింపబడిన
గ్రంథముల పట్టికగాని, వివరణముగాని లేదు.[1] ప్రభుత్వమువారే తెలుగుముద్రణ
గ్రంథ వివరములను—1868 నుండి 1888వఱకు నొక సంపుటముగా చాలకాలము
క్రిందటనే ప్రచురించిరి. రెండేండ్ల క్రిందట, 1888—1900 వఱకు ముద్రించిన

1. నా వచనవాఙ్మయమున—భారతియందు ప్రకటితమైన కొక్కొండ
వారి జీవితమున నిట్టి పట్టికను తయారు చేయుటకు వలసిన సాధన సామగ్రి
సమకూర్చితిని.

గ్రంథముల సంపుటము ప్రకటించిరి. అవి ఆంగ్లభాషలో నున్నవి. కాని వీని యన్నింటికిని మకుటాయమానమైనది ఆంధ్రగ్రంథమాలాధిపతులు ప్రకటించిన—

ఆంధ్ర వాఙ్మయ సూచిక

ఇది క్రీ. శ. 1927 లో ప్రకటితమైనను ఈనాడు తెలుగువారందఱకు గ్రంథ ముద్రణ వివరములు తెలుసుకొనుటకు పరమాధారమై యున్నది. గ్రంథము పేరు, కవి పేరు, పద్యమా—గద్యమా, ముద్రిత సంవత్సరము—నిట్టి వివరములు శీర్షికగా నీయబడినవి. గ్రంథము పూర్తియైన వెనుక కవులు—వారు రచించిన గ్రంథములు వేఱుగా తెలుసుకొనుట కనుకూలముగ వివరము లీయబడినవి. ముద్రిత గ్రంథములతోపాటు, ఆనాటి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోను, ఆంధ్రసాహిత్య పరిషత్ పుస్తకభాండారములోను గల యముద్రితగ్రంథములపట్టి కను ప్రకటించిరన్నచో వారాంధ్ర సాహితీ చరిత్రకు భాషకు నొనర్చిన శాశ్వత మహోపకార మెట్టిదో విజ్ఞులు గ్రహింతురుగాక.

ఈ గ్రంథమును ప్రకటించిన వెనుక తరువాతి సంవత్సరములలో ప్రకటితములైన గ్రంథములను ప్రభుత్వ నివేదికల నుండి భారతి పత్రికయందు-పురాణములు, కావ్యములు, ప్రబంధములు, శతకములు, వచనములు, తిరిగి వాని యందు విభాగము— ఈరీతిగా నాలుగేండ్లు ప్రకటించిరి.

నేడు పూర్వమున్న గ్రంథప్రకటనము హెచ్చుగా విశ్వవిద్యాలయ ములందేమి, ఇతర సంస్థలయందేమి జరుగుచునే యున్నది. కాని, ఇప్పటికి 36 ఏండ్ల క్రిందట ప్రకటితమైన ఆంధ్ర వాఙ్మయ సూచిక—భారతి పత్రిక అనుబంధములే ఆధారములై యున్నవి.

తెనుగునకు సమగ్రగ్రంథసూచి (Comprehensive Bibliography) ఇంతవఱకు లేదు. సాహిత్య అకాడమీవారు 1900—1950 వఱకును నొక గ్రంథ సూచికను తయారు చేయించిరి. అది ఎంతవఱకు సమగ్రమో చెప్ప జాలము. కాని ముద్రితాముద్రిత గ్రంథ సమగ్ర సూచిక కింతవఱకు నెట్టి ఏర్పాటులు గాని, ప్రయత్నములు గాని జరిగినట్లు లేదు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారట్టి దానిని తయారుచేయుటకు సంకల్పించినట్లు తెలియుచున్నది; కాని అది కార్యరూపమును దాల్చినట్లు లేదు.

ఇట్టి పరిస్థితులలో నీయాంధ్ర గ్రంథసూచికా ప్రాముఖ్యమును నించు మించుగా నలువదేండ్ల క్రిందటనే గమనించి "ఆంధ్రవాఙ్మయ సూచికను" ప్రకటించిన ఆంధ్రగ్రంథమాలాధిపతులకు ఆంధ్రసాహిత్యప్రపంచమంతయు ఋణపడి యున్నదనుట స్తవము గాదు వాస్తవమే.

—(భారతి సం. 41. సం.7 జూలై 1963)

## 18. తెలుగుభాషలో శాస్త్రీయవాఙ్మయము

తెలగున నింత వఱకు సాహిత్యపరిశోధనలో కేవలము కావ్య వాఙ్మయమే ప్రముఖపాత్ర వహించు చున్నది గాని, వైజ్ఞానికములగు శాస్త్ర గ్రంథములను గూర్చిన పరిశ్రమ జరుగనే లేదు. జరుగక పోవుటయే గాదు ప్రారంభము కూడా కాలేదని చెప్ప వచ్చును.

తక్కిన దేశభాషలలోవలె గాక, మన సాహిత్యమున శాస్త్ర గ్రంథములు పద్యకృతులగుట చేత కావ్యగౌరవముస్థాయి సంపాదించినవి. లాక్షణికులు వానిని ప్రమాణముగా గ్రహించినారు, నిఘంటుకారులు వాని నుండి పదములు చేకొన్నారు; దేశమునందలి ప్రజా వ్యవహారములో అవి ప్రచురములై యున్నవి. అయితే నేమి వానిలో చాలా గ్రంథములు అముద్రితములుగానే యుండిపోయినవి.[1] కొన్ని గుజిలీప్రతులై, సరియైన ముద్రణలేక యట్లె యడుగున బడి యున్నవి. తెలుగు భాషలో నున్న కొన్ని శాస్త్ర గ్రంథములు, ఏ యితర దేశ భాషలలోను లేవన్నచో ఈ శాఖావాఙ్మయ విశిష్టతను గ్రహింప వచ్చును.

1. తెలుగున శాస్త్రకావ్యములను ప్రథమముగా ప్రకటించిన యశస్సు మద్రాసు ప్రభుత్వమువారిది; క్రీ. శ. 1950 లో వారు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండారగాము నుండి, తంజావూరు సరస్వతీ మహలు లైబ్రరీ నుండి శాస్త్ర కావ్యగ్రంథములే ప్రచురించి, ఈ వాఙ్మయ శాఖాపరిశోధనకు దోహదము నొసగిరి– ధనుశ్శాస్త్రము, కామందకము కీర్తిశేషులు ప్రభాకర శాస్త్రి గారును; ఖడ్గలక్షణశిరోమణి నేనును పరిష్కరించితిమి. ఇంకను వైద్య, సంగీత, గణితశాస్త్ర గ్రంథములను మదరాసు ప్రభుత్వము వారు ప్రకటించిరి. ఇప్పటి కిరువదేండ్లు కావచ్చినను, నేటి వాఙ్మయ చరిత్రలలో వీని ప్రస్తావనయే కానరాదు.

మడికి సింగన ఈ శాఖా పరిశోధనలోను మొదటి వాడే. అతడు సకలనీతి సమ్మతమున నీ క్రింది శాస్త్రగ్రంథములనుండి పద్యము లుదాహరించి యున్నాడన్న సంగతి యీవఱకు తెలుప బడినది. పాఠకహితార్థము కొఱకు వాని నిట నిచ్చుచున్నాను—

రాజనీతి—
కామందకము
నీతితారావళి
నీతిభూషణము
నీతిసారము
పంచతంత్రము (ఇది నేడు కథావాఙ్మయములో పరిగణితము. కాని పూర్వము రాజనీతి గ్రంథము).

పురుషార్థసారము
బద్దెనీతి
ముద్రామాత్యము.
వైద్యశాస్త్రము—
అశ్వవైద్యము—శాలిహోత్రము.
ఆరోగ్యశాస్త్రము—
చారుచర్య.

సింగన క్రీ.శ. 1440 ప్రాంతమువాడు కావున పై శాస్త్ర గ్రంథము లన్నియు నంతకు ముందువే. ఇక నీ శాఖావాఙ్మయమును గూర్చి పరిశోధన చేయువారి కుపయోగకరముగ నుండునట్లు— క్రీ. శ. 1500 వఱకుగల శాస్త్ర గ్రంథముల వివరములు తెలుపుచున్నాను; ఇవి కాలక్రమము ననుసరించినవి.

## గణితము (Mathematics)[1]

పావులూరి మల్లన సారసంగ్రహగణితము— ఇది మహావీరాచార్యుని సంస్కృత గ్రంథమునకు తెలుగు— అయినను, గ్రంథమందలి విషయమంతము తెలుగునకు సంబంధించినదే. ఇది ద్వితీయప్రతాపరుద్రుని కాలమునుండి

1. నేను వ్యాసములం దింగ్లీషుపదముల నుపయోగింపను; అయినను నేడు విజ్ఞాన శాస్త్రములు తెలుగు భాషలోనే బోధింపబడును గావున నాంగ్ల పదముల నిచ్చినాను.

వ్యాప్తిలోనున్నది; ప్రతిగ్రామకరణమునకు పఠనీయ గ్రంథము. దీనిలోని సూత్రగణితమును క్రీ. శ 1797 లో బెంజెమెన్ హైన్ అను కుంఫిణీ యుద్యోగి- ఇంగ్లీషు భాషలోనికి భాషాంతరీకరించి యున్నాడు.[1] తెలుగున శాస్త్రగ్రంథములలో మొదటిదగు దీనికి సంస్కృతముద్రణలేదు. ఇందలి ప్రథమగణితమును, గణితములును మాత్రము ముద్రణ భాగ్యమున్నదినవి.[2]

## ధర్మశాస్త్రము (Law)

### విజ్ఞానేశ్వరము

ఇది కేతన కృతము; యాజ్ఞవల్క్యస్మృతికి తెలుగు; విజ్ఞానేశ్వరుని వ్యాఖ్యానము ననుసరించినది. ఇందు ఆచార, ప్రాయశ్చిత్త, వ్యవహార కాండలు అను మూడు కాండలు గలవు. వీనిలో వ్యవహారకాండ న్యాయశాస్త్రమునకు సంబంధించినది. ఒక్క బంగాళాదేశమున తప్ప తక్కిన యావద్భారత వర్షమున న్యాయస్థానములలో సాధికార ప్రపత్తి గలది- ఇదియును కాకతీయుల కాలమున విశేషవ్యాప్తిలో నుండెను.

దీనిని క్రీ. శ. 1895 లో అనగా నిప్పటికి డెబ్బదైదేండ్ల క్రిందట వీరేశలింగముగారచ్చు వేయించిరి. నాటినుండి నేటివరకు తిరిగి ముద్రితము గాలేదు. చిన్నయసూరి తన నిఘంటువున, సీతారామాచార్యులవారు తమ శబ్దరత్నాకరమున దీనినుండి చాలాపదములు గ్రహించి యున్నారు.

## రాజనీతి (Political Science)

ప్రాచీనకాలమున రాజపరిపాలన మూలమున- రాజనీతి శాస్త్రగ్రంథములు విశేషముగా వెలువడినవి; అవి సింగన యుదాహరించినవే. వీనిలో

కామందకము
నీతితారావళి

1. తెలుగునుండి, ఇంగ్లీషు భాషలోనికి పరివర్తనమైన గ్రంథములలో నిదే మొదటిది.
2. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి గారి పరిష్కరణ—Sri Venkateswara Oriental Institute. T. T. Devastanam series- డాక్టరు తిమ్మావఝ్ఝల కోదండరామయ్య గారు.

నీతిభూషణము
నీతిసారము
పంచతంత్రము
పురుషార్థసారము
ముద్రామాత్యము - ఇవిఅలభ్యములు.

వీనిలో ప్రస్తుతము మనకు లభ్యములగుచున్న భాగములను ప్రత్యేకముగా ముద్రించిన, వీనియందలి విషయములు విశదములగును.

బద్దెన నీతిసారముక్తావళి ముద్రితమైనను సుసంస్కృతముగాదు.

## ఆరోగ్యశాస్త్రము (Health & Hygiene)

చారుచర్య అప్పనది. ఇందు పండ్లుతోముకొనుటనుండి, పడకటింటి పనులకు మనుజుడాచరింపవలసిన ఆరోగ్యవిధులన్నియు తెలుపబడినవి. ముద్రితము.

## వాతావరణశాస్త్రము, వ్యవసాయము (Meteorology & Agriculture)

దోనయామాత్యుని సస్యానందము. ఇందువాతావరణమునకు సంబంధించిన సమస్తవిషయములేకాక వర్షపాతము, వర్షముకొలచుట, సస్యముల పరీక్ష మొదలగునవికూడగలవు. ముద్రితముగాని పరిష్కృతముగాదు.

## జంతువైద్యము (Veterinary Science)

అశ్వ (Horses) శాస్త్రము మనుమంచిభట్టకృతము. సింగనయుదాహరించిన శాలిహోత్రము 'అశ్వశాస్త్రము'. ఇది గుజలీప్రతిగానున్నది సుపరిష్కృత ముద్రణమావశ్యకము.

## పశు (Cattle) వైద్యము

ఇది నారయమంత్రిరచన. గుజలీప్రతిగానున్నది.

## సాముద్రికశాస్త్రము (Palmistry)

అన్నయసాముద్రికము. ఇందుండి పద్యములు శ్రీనాథుడు కాశీఖండమున గ్రహించియున్నాడు. గుజలీప్రతి.

రత్నశాస్త్రము (Metallurgy)

పైడిపవకవి రచితము. ఇది అగస్త్యకృతమగు రత్నపరీక్షకు తెలుగు. ఇందలి రత్నశాస్త్ర పారిభాషికపదములు సంస్కృతనిఘంటువులకెక్కలేదు.

వైద్యశాస్త్రము (Medicine)

పేదయ ఆయుర్వేదార్థసంగ్రహము. తెలుగున వైద్యశాస్త్రగ్రంథము లలో రాలెవి. ఈ పేదయ ప్రసిద్ధుడగు అనంతామాత్యుని కుమారుడు.

స్వరశాస్త్రము (Psychology)

స్వరమంజరి గణపయామాత్యుని కృతము. ఇది అముద్రితము.

మనోబోధ[1]

పై వానిలో స్వరమంజరి మంజరీ ద్విపదలోనున్నది. తక్కిన వన్నియు ప్రశస్తమైన పద్యకృతులు. వీని సుపరిష్కృత ముద్రణములవలన శాస్త్రవాఙ్మయమునకేగాక, సాహిత్యవిమర్శకు ఎంతో వికాసము గలుగగలదు.

వేదాంతవాఙ్మయము (Philosophical Literature)

జ్ఞానవాసిష్ఠము

మడికి సింగన సంకలనగ్రంథశాఖకేగాక, వేదాంతవాఙ్మయమునకు నాద్యుడే. ఆతని జ్ఞానవాసిష్ఠము[2] అద్వైతవేదాంతవాఙ్మయమునకు ఆదికృతి. క్రీ. శ. 16వ శతాబ్దినుండి 19వ శతాబ్దివఱకు నీ వాఙ్మయశాఖయందు చాలా గ్రంథములు వెలువడినవి. ఈ గ్రంథములు చాలావఱకు దత్తాత్రేయాద్వైతసంప్ర

---

1. B lletin of the GovernmentOriental Manuscripts Library, Madras–*Edited by* N. Sundareswara Rao (1935)

2. ముద్రితము. వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్. మదరాసు 1935– ఇందు పీఠికాదులు మొదలైనవిలేవు. మూలముమాత్రము గలదు.

దాయమునకు జెందినవి.[1] ఈ వాఙ్మయశాఖ ప్రత్యేకముగా పరిశ్రమ చేయ దగినది. ఇందును చాలాగ్రంథములు అముద్రితములుగానేయున్నవి.

ఇంతవఱకును మడికి సింగన కవులచరిత్రలలో వాఙ్మయచరిత్ర లలో పూర్వకవిగానేగాని, వాఙ్మయచరిత్రలో నాతనికిగల విశిష్టస్థానము నిరూపితము కాకపోవుటచేత, ఈ సకలనీతిసమ్మతపీఠిక యింత దీర్ఘముగా వ్రాయ వలసివచ్చినది. ఈ నాడు విశ్వవిద్యాలయములలో, ప్రత్యేకముగా ఒక్కొక్క కవినిగూర్చి పరిశ్రమ జరుగుచున్నప్పుడు, మడికి సింగననుగూర్చి అట్టి పరిశోధన జరుగవలసినదే. అంతసామగ్రి అతని రచనలలోనున్నది. నేను సూచించినది దిఙ్మాత్రము.

మడికి సింగనతోగూడ, ఇందు సూచించిన శాస్త్రీయవాఙ్మయము, వేదాంతవాఙ్మయము, ఆకరగ్రంథవాఙ్మయమునుగూర్చి పరిశోధనలు విశ్వ విద్యాలయస్థాయిలోగాని, ప్రత్యేకముగాగాని ప్రారంభమైనచో, ఈ పీఠికాకారుని పరిశ్రమ ఫలవంతమగునని విన్నవించుచున్నాను.

ప్రాచీనాంధ్ర వాఙ్మయపరిశోధనకు ప్రధానాధారమైన ఇట్టిగ్రంథము నకు పీఠిక వ్రాయుటకు ప్రోత్సహించిన డాక్టరు పోఁణంగి శ్రీరామఅప్పారావు (పి. యస్. ఆర్. అప్పారావు) గారికి, గ్రంథమును ప్రకటించిన ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీవారికి ముఖ్యముగా శ్రీదేవులపల్లి రామానుజ రావుగారికి నా కృతజ్ఞత నిందుమూలముగా తెలుపుకొనుచున్నాను.

**2-2-1137/5,**
లక్ష్మీకాంతనిలయము,
న్యూ నల్లగుంట,
హైదరాబాదు.
8-7-1970

నిడుదవోలు వేంకటరావు.

1. దత్తాత్రేయవాఙ్మయము "Works relating to Dathatrya Cult in Telugu Literature" Essays in Philosophy- Dr. T. M. P. Mahadevan Commemoration Volume. (N.V.)-inEnglish. తెలుగు- ఆంధ్రపత్రిక 1965 సంవత్సరాదిసంచిక- ని. వెం.

"The Forgotten Poets' Series" No. X.

*Edited by* **M. Ramakrishna Kavi, M. A.**

# SAKALANITI SAMMATAMU

*Compiled by* MADIKI SINGANA

 [ **Price 1.50**

ప్రథమ ముద్రణము — ముఖపత్రము

శ్రీ

ముద్రామాత్యాది ప్రాచీన గ్రంథోద్ధృత పద్యములతో

మడికిసింగనార్యునిచే సంకలితమగు

# సకలనీతిసమ్మతము

ఇది

మా — రామకృష్ణకవిగారిచేఁ

బరిశోధింపఁబడి

ఆంధ్రపత్రికాముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె

1923

ప్రథమముద్రణము — ముఖపత్రము

ప్రథమముద్రణము

# ఉపోద్ఘాతము

—: o :—

రాజ్యాంగములలో సకలవర్గంబుల వారును బరస్పరము ప్రవర్తింప వలసిన నీతిమార్గమును సకలగ్రంథసమ్మతమగునట్టిదిగా నేర్చి దీని సకలనీతి సమ్మతమను పేర మడికిసింగన కూర్చె. ఇందుఁ జేర్పనుద్దేశించిన నీతివర్గముల గ్రంథారంభముననె (17వ సంఖ్య గద్యమున)కవి వివరించె నందు "అధికారము విరోధభేదంబును" అను నంతకుఁగల మూఁడాశ్వాసముల గ్రంథమె మనకు లభింపఁగా నిందు ముద్రింపఁగడంగితిమి. పైభాగము సహితము లభించునేని వాఙ్మయమునకు నిక్కముగాఁ బెంపుగలుగును. ప్రతిజ్ఞాతవిషయములో రాజనీతి భాగము మూఁడాశ్వాసములనె ముగియుచుండుటవలనను దక్కినభాగములో లోకోక్తి సంగీతనాట్య విషయమును బూజాప్రతిష్ఠాది ప్రశంసలును గలవగుటచే నీగ్రంథమును మొదట వ్రాసికొనిన వారు దాని నసంబద్ధమని వదలియుందురేమో.

మడికిసింగన గోదావరీప్రాంతమున నుండు పెద్దమడికి నివాసియయ్యును ఓరుగల్లున కుత్తరమున నుండు రామగిరి పట్టణమున కధీశ్వరుండగు కందన మంత్రి కాశ్రితుఁడై బహుగ్రంథముల రచించె. వానిలోఁ బద్మపురాణము, భాగవత దశమస్కంధము (ద్విపదకావ్యము), వాసిష్ఠ రామాయణము మనకు లభించుచున్నవి. దశమస్కంధభాగము తంజాపురి పుస్తకభండారమున నాద్యంతములు లేక యొక మాతృకగలదు. తక్కినవి ముద్రితములైనవి. కందనమంత్రి పేర నీతితారావళియని యొకగ్రంథము సింగన రచియించినది నేటికిఁ గానరాదు. సింగన సకలనీతిసమ్మతమున దానిలోనుండి పెక్కుపద్యము లుదాహరించుకొనెను. మడికిసింగన యుండినకాలము పద్మపురాణ రచనాకాలము తెలిసినందునఁ జిక్కులు లేక విస్పష్టమగుచున్నది.

"ఆకరయుగానలమృగాంకశకవత్సరములై పరఁగు శార్వరినిజ్యా
ప్రాకటితమార్గశిరపంచమిని బొల్చు నుడుపాలసుత వాసరమునందున్
శ్రీ కరముగామణికి (మడికి) సింగన దెనుంగున రచించెఁ దగఁబద్మపురాణం
బాకములమిత్రశశిరాంశుపుగఁ గంద సచివాగ్రణికి మంగళమహాశ్రీ."

అనఁగా శాలివాహన వర్షములు 1342 లకు సరియైన క్రీ. శ. 1420 సంవత్సరమునఁ బద్మపురాణము రచింపఁబడియె. కవి తన గ్రంథరచనాకాలము చెప్పకున్నను గందనమంత్రియు నతని కాశ్రయులగు ముప్పడియుఁ దెలుంగు రాయఁడును బ్రభుత్వముచేసిన కాలములు సులభముగా లభించుచున్నందున మడికిసింగన కాలము దుస్సాధ్యము గానేరదు. సకలనీతి సమ్మతమునఁ బద్మపురాణమునుండి పద్యములు (204 మొ) గ్రహింపఁబడినందున నిది 1430 క్రీ. శ. ప్రాంతముల రచింపఁబడియుండును. ఈ కాలముననే శ్రీనాథుఁడును, నిశ్శంక కొమ్మనయు (శివలీలావిలాసకర్త), గౌరన, అనంతుఁడు, జక్కన, మల్లన మొదలగు కవులు తమతమకృతులచేఁ బ్రఖ్యాతివడయుచుండిరి. సకలనీతి సమ్మతము దేవాంకితమైనను గందనామాత్యుని భ్రాతయగు కేసనమంత్రి సబహుమానముగా నిందుఁ బేర్కొనఁబడియె. కందనబ్రాహ్మణుఁడు, కాశ్యపగోత్రజుఁడు. కందుకూరి వీరేశలింగంపంతులవారు కందనమంత్రి పూర్వజులలో నొక్కఁడగు గన్నమంత్రిని మార్కండేయపురాణకృతిపతియగు గన్నమంత్రిగా గ్రహించి ప్రమాదపరంపరతో భావనాసోపానములు గట్టెను. కందమంత్రిని,

"ధరణీదేవకులాబ్ధి చంద్రవిలసద్దానాంబు ధారార్ద్రవి
స్తరహస్తాంబుజ మంత్రిరక్షణ కళాచాతుర్యసాహిత్యగీ
తరసా స్వాదనలోకమానసదాధర్మజ్ఞ శ్రీముప్పడీ
శ్వర కారుణ్యకటాక్షవర్ధిత మహాసౌభాగ్యభాగ్యోదయా."

అని పద్మపురాణమున నష్టమాశ్వాసాంతమునఁ గవి సంబోధించెను. మారన మార్కండేయపురాణమున గన్నమంత్రి వంశావతారక్రమము వర్ణించుచు,

"ఆచతుర్థకులసుధాంబుధినుదయించె నమితకాంతిచంద్రుఁ డవనిభరణ
దిగ్గజేంద్రమును వితీర్ణమందారంబు మల్లసైన్యవిభుఁడుమహితకీర్తి".

అని గన్నమంత్రిఁజతుర్థవంశజునిగాఁ బేర్కొనియె. కావున నీరెండు వంశములవారును భిన్నులగుట నిశ్చయము. కందనమంత్రి తాతలు కాకతీయ గణపతియొద్ద సామంతులైయుండి గణపేశ్వరాదిస్థలముల దేవాలయప్రతిష్ఠలు సేసి ప్రఖ్యాతగాంచిరి. మడికిసింగన తిక్కనసోమయాజి కుమారుఁడగు కొమ్మనమంత్రికి దౌహిత్రుని కుమారుఁడు. ఆదౌహిత్రుఁడగు నయ్యలమంత్రియు

ననపోతిరెడ్డికి మంత్రియై ప్రసిద్ధికెక్కె. కావుననే మడికిసింగనకు రాజనీతి శాస్త్రముల ధౌరంధర్యము గలిగెఁగాబోలు. మడికిసింగన కాలము ననుసరించి చూచినయెడలఁదిక్కన కాలము 1260 కంటెఁ బ్రాఁతపడదు.

సకలనీతిసమ్మతమున నుద్ధృతములగు పద్యముల కాకర గ్రంథనామములఁ గవియే పేర్కొనియె. అందు ముద్రామాత్యము, నీతిసారము, పంచతంత్రి, పురుషార్థసారము, నీతిభూషణము, కామందకము, నీతితారావళి, కుమారసంభవము, చారుచర్య, బద్దెనసీతి, పద్మపురాణము, శాలిహోత్రము, భారతము మొదలగునవి గలవు. వీనిలో మొదటియేడు గ్రంథములు నష్టములయ్యె. కుమారసంభవము నన్నెచోడకృతము, బద్దెననీతియు మేము ముద్రింపించి యుంటిమి. చారుచర్య శ్రీముక్త్యాల ప్రభువులచేఁ బ్రకటింపఁబడియె. శాలిహోత్రము పీఠికాపద్యములు గానరాక కొంతభాగము పెక్కుచోటుల ముద్రితమయ్యె. తక్కినవి సుప్రసిద్ధములు. ఈ గ్రంథములన్నియు సింగనకంటెఁ (1420 క్రీ.శ.) బూర్వరచితములని స్పష్టము.

శాలిహోత్ర మనునశ్వశాస్త్రమును మనుమంచిభట్టారకుఁ డనుకవి హయలక్షణ విలాస మనుపేరఁ దెనిఁగించెను. ఇయ్యది యెంత ప్రాచీనమో యెఱుఁగుట కానుకూల్యములేక పీఠికాపద్యము లెచ్చటను లభించినవి కావు. అది చాళుక్యకంపభూపతి కంకిత మీయఁబడియె. విద్యానగరపుఁ గంపభూపతి మడికిసింగన కాలమువాఁడు కావున మనుమంచిభట్టును నతనిప్రభువగు కంపరాజును తప్పక ప్రాచీనులే.

ముద్రామాత్యము క్షేమేంద్రుఁ డను బిరుదము వహించిన లక్కంభట్టను కవి రచించినట్లు తోచుచున్నది. క్షేమేంద్రకవి క్రీ. శ. 1050 ప్రాంతముల నుండెఁ గావునఁ దద్బిరుదవహనముచే నితఁడు తత్పూర్వుఁ డగుటకు సాధ్యుఁడు కాఁడు. ఇతఁడు శూద్రకరాజచరిత్రమును శతపక్షిసంవాదమును రచించినట్లు లక్షణగ్రంథోదాహృతపద్యములవలనఁ దెలియుచున్నది. బాలబోధ మనియుఁ గవిసంజీవని యనియు సందిగ్ధనామములు గలయొక్క ఛందోగ్రంథమున ముద్రామాత్య నీతిభూషణ పురుషార్థసారములనుండి పద్యము లుదాహృతము లయ్యె. అందు ముద్రామాత్యములోని దని క్రిందిపద్యము గానఁబడుచున్నది.

మ. మనుజాధీశ్వరుకంటె మంత్రిబలసామర్థ్యంబు నర్థంబు రా
జ్యనియోగంబును నగ్గలం బగుచు నాజ్ఞాలంఘనోద్యుక్తుఁడై
మను దుష్టవ్యవసాయుఁ డే మఱి మదోన్మత్తాత్ముఁడై కూలుఁ గ్రొ
క్కున మున్నాతనిచేఁ దదీశుఁడు నదీకూలావనీజాకృతిన్.

ముద్రామాత్యము కేవలము నీతిగ్రంథము కాక ముద్రారాక్షసమువలె నొక రాజు ప్రాభవమును సంపాదించు మంత్రిశిఖామణి నీతిధౌరంధర్యమును వర్ణించుకావ్యమో యనుసందియము గలిగించుచున్నది. ఇందు రాజరాజవంశజు లగుచోళభూపతుల జయించిన చాళుక్యరాజులయో లేక చాళుక్యుల జయించిన కాకతీయులయో పరాక్రమము ప్రశంసింపఁబడిన ట్టుదాహృతపద్యములవలన నూహింపఁదగియున్నది.

ఆ.వె. రాజరాజవంశభూజనపతు లీలి, రకట మంత్రి దొలఁగి యలికినాఁడు
ఏది వనుపు సేయ నిటు నిల్వఁబోలదు, రాజు లేనికయ్య మోజపడునె. 927

ఉ. కొన్నిదినంబు లిక్కడ నకుంఠితలీలఁ బథశ్రమార్తియై
యున్నబలంబు గెల్చుకొను టొప్పగు నంతియ కాదు శత్రుభూ
మిన్నిజమార్గ మారయక మిన్నక యేఁగుట యేది బుద్ధి యా
యున్నెడఁ జూచి వెళ్లజను లున్నర (?) చెప్పెఁడు గూఢచారతన్. 852

ఇవి కథాభాగములోనిపద్యములట్లు గాన్పించును గాని కేవలము నీతివిచారములు గావు.

నీతిసారమును మొదటికాకతీయరుద్రదేవుఁడు రచించినట్లు ప్రాచీనపద్యోదాహరణములు గలవు. ఉషాపరిణయ మనుసంస్కృతనాటకము రుద్రదేవకృతమని యొకటి గలదుకాని యక్కవి కాకతీయుఁడా యనుట విశదము కాదయ్యె. సంస్కృతభాషలోఁ గామందకనీతిసారము, శుక్రనీతిసారము. అని ప్రసిద్ధములుగా రెండునిబంధనములు గలవు. సింగన యుదాహరించిననీతిసారపద్యములకు మూల మారెంటను గానరాదు. బార్హస్పత్యనీతిసారమని మూఁడువేలశ్లోకములలో నొకటి యుండినట్లు వైశంపాయనకృతివ్యాఖ్యాతయు యామళాష్టకతంత్రకారుఁడును బేర్కొనుచున్నందునను వీరమిత్రోదయాదిగ్రంథములలోని బృహస్పతిమతనీతియే మననీతిసారపద్యములఁ గానవచ్చుచున్నందున రుద్రదేవుఁడు బార్హస్పత్యనీతిసారమునె తెనిఁగించె నని సందేహము గలుగుచున్నది.

సకలనీతిసమ్మతమునఁ బంచతంత్రిపేర నుడివినగ్రంథము లభింప దయ్యె. కర్తపేరు నెఱుంగ సాధ్యము గాదు. ఈకవి లభించుచున్నపంచ తంత్రముల కర్తలకంటెఁ బ్రౌఢుఁడని వెంకటనాథాదులపద్యములం బోల్చి చూచిన నెఱుంగవచ్చును.

నీతిభూషణమును నాంధ్రభోజుఁడనుకవి రచించినట్లొకలక్షణగ్రంథమునఁ గలదు కాని యతఁ డెవ్వఁ డని గుర్తింప వీలుకాదు. బాలబోధలక్షణమున దీనిలోనుండి పెక్కుపద్యము లుదాహృతము లయ్యె. అందు

మ. సకలస్థాణుశిరఃప్రవర్తి నురుపక్షద్వంద్వశుక్లాభిరం
జకుఁడన్ సర్వదిగంతగామి ననకృత్స్నంసేవ్యమానుండ నై
ష్ఠికుఁడం గావున మత్సమానుఁ డగునే శీతాంశుఁ డం చెప్పుచుం
బక మిందుం బ్రహసించునట్లు సుజనుం బల్కుం దురాత్ముం డిలన్.

చ. వలసినవంకలం గురియు వర్షసమాగమమేఘ మేఁగి త
న్మలినత దాతయం దవగుణంబును సహ్యమె వృష్టి లేక ని
ర్మల మగుచోఁ దలంపఁగ శరద్ఘన మేటికి నట్ల యాగిమై
నెలయనివానివెల్లఁదన మేమి ప్రయోజన మర్థికోటికిన్.

అని మొదలగు పద్యములు గలవు. నీతిభూషణమునకు సంస్కృతమున మూలమేదో యిప్పటికిఁ దెలియరాదు.

పురుషార్థసారము గణపతికి రుద్రదేవికిని మంత్రి యగు శివదేవయ్యచే రచిత మని "శివదేవయ్య పురుషార్థసారములో" నను నుదాహరణమువలన నూహింపఁదగి యున్నది. అతఁడు పురుషార్థసారము గాక "శివదేవధీమణీ" యని మకుటము గలయొకశతకమును గూడ రచించినట్లు తోచుచున్నది. బాల బోధమునను లక్షణశిరోమణిలోను బురుషార్థసార శివదేవశతకపద్యములు పెక్కు లుదాహృతము లయ్యె. శతకములోనుండి—

ఉ. ప్రాణు నపానుఁ గూర్చి యలపాముఁ గదల్చి తదూర్ధ్వకీలితో
ద్యానము నొత్తి మేను దృఢమై నిగుడం బిగియించి దృష్టులం
ఘోణము చేర్చి యాప్రణవఘోషణమున్ విని యందు మానస
క్షీణము సేసినం బవనసిద్ధుఁ డనా శివదేవధీమణీ.

చ. అరయఁగఁ బిన్ననాఁట సిరియాళుఁడనై యెలఁబ్రాయమందు సుం
దరుఁడును నంబినై పదనుదప్పిన గుండయగారిచందమై
ధరఁ జరియింపఁ గల్గినఁ దథాస్తు వృథా పరిపాకరూపదు
ష్కరజననం బిదేమిటికిఁ గాలుపనే శివదేవధీమణీ.

అనుపద్యములును, సకలనీతిసమ్మతమున నుదాహృతము లగు 144, 179, సంఖ్య గల పద్యములు పురుషార్థసారమునుండియు బాలబోధమునఁ దత్కర్త యుదాహరించె.

కామందకము సంస్కృతమునసుండి కొండ్రాజు వేంకటాద్రి నరేంద్రున కంకితముగా నెనిమిదాశ్వాసముల 1584 క్రీ. శ. వేంకటరామకృష్ణకవులు తెనిఁగించినది గలదు. మడికిసింగన తత్పూర్వుఁ డగుటచే నందు మనపద్యములు గానరా కుండుట యచ్చెరువుకాదు కామందకము కౌటిల్యునియర్థశాస్త్రములోని సారము గలది. దానికి సంస్కృతభాషలో మూఁడువ్యాఖ్యలు గలిగియు నందుఁ గొన్నిస్థలములు క్లిష్టముగా నుండును. అది శాస్త్రగ్రంథమువలెఁ గాక మనోహర కావ్యమువలెఁ బ్రసన్నగంభీరమై యున్నది. సింగన యుదాహరించినకామందక మెవ్వరియనువాదమో కాని యదిప్రౌఢమై సందిగ్ధస్థలములఁ జక్కఁగా వివరించు నదియై యున్నది. తరువాతి కామందకము పెక్కుచోట్ల నీరసమై శాస్త్రవిరుద్ధ మగుటయుఁగాక కవితయు శిథిలబంధమై వృత్తజాతిసమాహరణమున గవికిఁ బ్రజ్ఞాదారిద్ర్యము దోపించును. సకలనీతిసమ్మతములోని 286-వ పద్యమునకు రెండవకామందకమున—

మ. తొలుతం దా జలకంబు దీర్చి చలువల్ తోడ్తో విరుల్ సొమ్ములుం
గలపం బందుచు దేవియుం జలకముల్ గావించి రాఁ జవ్వలుం
గలపంబుల్ మణిభూషలున్ విరులు జోకం దానె యిప్పించి నే
ర్పులఁ గూడందగు రాజు పెంపెసఁగ నింపున్ సొంపు గల్పించుచున్.

ఈవర్ణనము రాజు లాత్మరక్షణార్థము తమదేవులయిండ్లకుఁ బోక వారినె తమ వాసగృహములకుఁ దెప్పించుటయె నీతి యను నుపదేశసందర్భమున నున్నది. ప్రధానాంశము మఱచి కవి రాజభోగము వర్ణించె. 257-వ పద్యమునకు రెండవ కామందకమున—

సీ. విషముఁ జూచినవేళ విషయుక్తమైన
పదార్థంబు చూచినయట్టివేళఁ
దలఁకఁబాఱుచును గ్రోతులును రాచిలుకలు
గొరవంకలును సారెఁ గూఁత లిడును
గన్ను లెఱ్ఱఁగఁబాఱుఁ గలహంసలకునెల్ల
మఱి మదంబునఁ జెంది మఱియుఁ గొంచ
మదకోకిలంబులు మరణంబు నెందును
వెన్నెలపులుఁగులు వేగ బడలు

గీ. నిందు నొక్కటిచేనైన నెందు లెస్స
తాఁ బరీక్షించి ధారుణీశవున కెపుడు
భోజనము సేయఁదగు నిట్లు భోజనంబు
చేయుచుండినఁ బతి హాని చెందకుండు.

ప్రాఁతకామందకమున "లలిఁ జకోరములకన్నులు విరాగము లగు" ననుచోట "చకోరస్య విరజ్యేతే నయనే" యనుటకు రెండవకవి పురాశస్త్య యని పఠించుకొనియె.

287_వ పద్యమునకు సరిగా రెండవకామందకమున__

సీ. భార్యయింటికిఁ జని భద్రసేనుఁడు తొల్లి యామెతోఁబుట్టుచే హతుఁడగుటయు
నాలిగృహంబున కరిగి కారూశుండు తనతనూభవునిచేతనె పొలియుటఁ
బ్రియురాలు విషముతోఁ బేలా లొసఁగిన వేగంబ కాశికావిభుఁడు వడుట
జడలోన దాఁచుకుండెడుకత్తి తెలియక రమణిచేతన విదూరథుఁడు చెడుట

గీ. యటు కరాళాంజనము పూసి యద్ద మందె
మేఖలయు నీయ జారూప్యమేదినీశు
లవని వైరూప్యసౌవీరు లడఁగు టెఱిఁగి
యధిపుఁ డతివలయిండ్లకు నరుగరాదు.

అని చెప్పుటలో భద్రసేనుఁడు తనబావమఱఁదిచేఁ జంపఁబడె ననియు, కరాళాం
జనము పూసినయద్దమును, అందెయు, మొలనూలును బ్రయోగించి క్రమముగా
జారూప్య వైరూప్యసౌవీరరాజులఁ దమతమభార్యలు చంపిరని రాజులకు దేవీ
గృహగమనమును కవి నిషేధించుచున్నాడు. ప్రాచీనకామందకమున భద్రసేనుఁడు

తనతోఁబుట్టువుచేఁ జచ్చినట్టును వైరూప్యునకు మాఱు వైరంత్యుఁ డనియు నున్నది, మూలమున—

దేవీగృహం గతో భ్రాతా భద్రసేన మమారయత్
మాతుః శయ్యాంతరాలీనః కారూశం చౌరసః సుతః
లాజాన్ విషేణ సంయోజ్య మధునేతి విలోభ్య తమ్
దేవీ తు కాశిరాజేంద్రం నిజఘాన రహోగతమ్
విషదిగ్ధేన సౌవీరం మేఖలామణినా నృపమ్
నూపురేణ చ వైరూప్యం జారూష్యం దర్పణేన చ.

అని వైరూప్యమునకు మాఱు వైరంత్యమనియు కొన్నిప్రతులఁ బాఠముగలదు. కౌటిలీయమున "దేవీగృహే లీనో హి భ్రాతా భద్రసేనం జఘాన। మాతు. శయ్యాంతర్గతశ్చ పుత్రః కారూశమ్। లాజా న్మధునేతి విషేణ పర్యస్య దేవీ కాశిరాజమ్। విషదిగ్ధేన నూపురేణ వైరంత్యం। మేఖలామణినా సౌవీరం, జాలూథ మాదర్శేన వేణ్యాగూఢం శస్త్రం కృత్వా దేవీ విదూరథం జఘాన॥" అని యున్నది. బాణుని హర్షచరితమున స్త్రీలయందు నమ్మిక దోషజనకం బని "స్త్రీ విశ్వాసినశ్చ మహాదేవీగృహగూఢభిత్తిభాగాశ్రితా భద్రసేనస్యాభవన్మృత్యవే కాళింగస్య వీరసేనః।మాతృశయనీయతూలికాతలనిషణ్ణశ్చ తనయో౽న్యం తనయమభిషేక్తుకామస్య దద్రస్య కరూశాధిపతే రభవన్మృత్యవే। మధుమోదితం మధురకసంలిప్తైర్లాజైః సుప్రభా పుత్రరాజ్యార్థం మహాసేనం కాశిరాజం జఘాన। వ్యాజజనితకందర్పదర్పా చ దర్పణేన క్షురధారాపర్యంతేనాయోధ్యాధిపతిం పరంతపం రత్నవతీ జారూథమ్। యోగపరాగవిషవర్షిణా చ మణినూపురేణ వల్లభా సపత్నీరుషా వైరంత్యం రంతిదేవమ్। వేణీనిగూఢేన శస్త్రేణ బిందుమతీ వృష్ణిం విదూరథమ్।రసదిగ్ధమధ్యేన చ మేఖలామణినా హంసవతీ సౌవీరం వీరసేనమ్॥" అని పలుకారణంబుల మగలఁ జంపినవీర స్త్రీలప్రశంస చేయఁబడియె. ఇంకను శోధింపఁ గళింగరాజగు భద్రసేనుఁడు మహాదేవీగృహమున లోగోడలో దాఁచుకొని యున్న తనయన్నచేతనె చచ్చెనఁట. కాశి రాజగు మహాసేనునిభార్య సుప్రభ తనకొడుకునకు రాజ్య మిప్పింపఁగోరి మగనిఁ జంపించెనఁట. సుప్రభ కంటెఁ గైకేయి ఋజుహృదయగదా! రత్నవతి మదవిభ్రమమిషంబున నయోధ్యాపతి యగు పరంతపు (నన్య స్త్రీ సక్తు)మదనలీలావిలాసముతో నద్దము విసరి వైచి చంపెనఁట! సవతిసౌభాగ్యము నోర్వఁజాలక సునందన వైరంత్యునగ

రాధీశుఁ డగురంతిదేవునిపై విషముఁ గక్కినందియ విసరిపై చి సవతిపైఁ బగదీర్చుకొనియెనఁట. విదూరథ రా జగు వృష్ణిభార్య బిందుమతి మగని వక్షారుష్యము సహింపఁజాలక జడలో శస్త్రికదాఁచి యుంచి సురతాంతపరవశుఁడై విస్రంభముతో తనయురంబున వాలియున్నతనిఁ జంపివై చెనఁట! ప్రాఁతకామందకమున "కెరలి శత్రులపయిఁ బ్రయోగింపవలయు" నని శత్రురాజులలో భేదము పుట్టింప దుష్టస్త్రీ విషకన్యాప్రయోగమును సమర్థించెను.

ఇట్లు సకలనీతిసమ్మతమునఁ గామందకపద్యముల నెల్ల మూలముతోఁ బరీక్షింపఁ దత్కవి వస్తువిచారము చక్కఁగాఁ జేసి వివరణప్రాయముగాఁ దెనిఁగించె నని తేలుచున్నది.

కవితారచనలో నీతిసార పురుషార్థసారములు చాలఁ బ్రౌఢములై నవి. తరువాతఁ బంచతంత్రీ ముద్రామాత్య కామందకములను గ్రమముగాఁ జెప్పవచ్చును. పురుషార్థసారములో భావములు వక్రోక్తిచతురములై హృదయంగమము లగుచున్నవి. తుల్యప్రదేశములఁ బోల్చిచూడ నీప్రాచీనపద్యములకుఁ దరువాతికవులపద్యరచన తీసిపోయి వస్తునిష్కృష్టియు, రసభావసమగ్రతయు, నిబిడికయు నను టలో న్యూనత్వము చెందుచున్నది.

## అర్థశాస్త్ర ప్రశంస

నాలుగుపవేదములలో నొక్కటి యగునర్థవేదము మానవునియర్థసంపాదనరక్షణక్రమముల నుపదేశించును. అది యర్థసంపాదనమున సకలరసవాదధాతువాదక్రియలను, వార్త యను పేరఁ బరఁగు కృషి, పాశుపాల్య, వాణిజ్యధర్మములును; అర్థరక్షణక్రమమున ధర్మన్యాయపరిపాలనంబును దండనీతియుఁ గలసి యర్థశాస్త్రం బనఁ బ్రఖ్యాతిగాంచె. ఇట్టి శాస్త్రము లోకవ్యవహారవిద్యాసర్వస్వమును గ్రహించుటచే నం దేకదేశముగా రాజనీతి యను పేర రాజ్యరక్షణక్రమముమాత్రము విశదీకరించునది యర్థశాస్త్ర మని బుధులు వ్యవహరింతురు. ఇందుఁ జాణక్యుని షట్సహస్రి యను కౌటిలీయార్థశాస్త్రము ప్రమాణగ్రంథముగాఁ బరిగణింపఁబడుచున్నది. దీనిలో ధర్మస్థీయ మను వ్యవహారకాండమును మను నారద పరాశర యాజ్ఞవల్క్యాదులు విస్తరించియున్నందున నదియు "రాజనీతి నుండి తొలఁగింపఁబడి కేవలము రాజరక్షణము, దుర్గాదిస్థానవిధానము, మంత్రి

పరివార లక్షణము, మంత్రాంగప్రకరణము, శత్రురాజులయెడ నుపాయ పరికల్పము, యుద్ధాంగసమాహరణము, యుద్ధక్రమము కలసి యర్థశాస్త్రంబు సంక్షేపరూపంబు నెందె. నేఁటికాలమున నిందును గొన్నిభాగములు—ఆత్మరక్షణక్రమము, యుద్ధాంగహరణము, యుద్ధక్రమము, మొదలగునవి పరిత్యజించి ప్రజాసంఘవిధానమును, ప్రజాధికారనిర్ణయమును వార్తాభివర్ధకసంధివిగ్రహస్వరూపంబును, విజితరాష్ట్రపరిపాలనక్రమమును, సర్వాధికారిబలనిర్ణయవిధానము నాదిగా విస్తరింపవలసియున్నది.

ఇప్పుడు లభించు నర్థశాస్త్ర గ్రంథములలోఁ గౌటిలీయము శ్రేష్ఠ మైనది. దానిపై బౌద్ధభిక్షువు ప్రభామతియు, మాధవమిశ్రయజ్వయు, శంకరాచార్యులును, భట్టస్వామియు రచించిన వ్యాఖ్యలు కొన్నికొన్ని భాగములకే లభించుచున్నవి. భటస్వామివ్యాఖ్యకుఁ గేరళభాషానువాదము చాలభాగమునకుఁ గలదు. వీని నన్నిటిఁ గ్రోడీకరించి వ్యాఖ్యాసారముతోఁ గౌటిలీయమును దెనిఁగించుచున్నారము. అందుఁ దచ్ఛాస్త్రసంబంధముగాఁ జాల లిఖింపఁ దలఁచియున్నందున నిం దర్థశాస్త్రవిషయము విస్తరింప నలవి కాదు.

## గ్రంథపరిశోధనము

మేము కొన్ని సంవత్సరములకుఁ బూర్వము నైజాముురాజ్యమున వనపర్తిసంస్థానమున నున్న కాలమున సమీపమున నుండు నమరచింత యను రాజాస్థానమునకుఁ గార్యాంతరమునఁ బోయియున్న కాలమునఁ దత్సంస్థానాధీశ్వరులగు శ్రీమంతు రాజాముక్కర సీతారామ భూపాల బహద్దరువారు మాయందు దయచేసి బద్దెన నీతిశాస్త్రముక్తావళియు సకలనీతిసమ్మతమును లిఖింపఁబడియుండు కాగితపు సంపుటమును ముద్రణార్థ మొసంగిరి. అప్పటికి నీతిశాస్త్రముక్తావళి మూలభాగము ముద్రింపఁబడియుండుటచేఁ బీఠికలో శ్రీమంతులవారి సహాయము నభినందించుచుఁ బాఠభేదములమాత్రము సూచించితిమి. సకలనీతిసమ్మతము లేఖకదోషసహస్రపరిపూరిత మగుటచే నాదర్శాంతరము కొఱకుఁ జిరకాలము ప్రతీక్షించియు లభింపమింజేసి తుద కున్న దాని సవరించి ప్రచురించుటయె మే లని తలంచియు మనోరథసహస్రమాత్రవిజృంభితుల మగు మాకుఁ గార్య సాఫల్యము గానరాక కొంతకాలము చెల్లిన నాంధ్రపత్రికాధీశ్వరులు బ్రహ్మశ్రీ శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావు

పంతులవారు దేశమాతృసేవయు భాషాసేవయునే జన్మజీవితఫలముగాఁ బని సేయువారు గావున నీగ్రంథప్రాచుర్యమునకు మమ్ముఁ బ్రేరేపించి తగినసహాయసంపత్తిని గలిగించినందున దీని నిప్పటికిఁ బ్రకటింపఁగలిగితిమి. ఇందు యథాశక్తి సవరించియు నింకను దోషసహస్రములు గలవు. ప్రాచీనగ్రంథపరిశోధనసంస్కారగ్రంథ మించుకవడసియు ననేకప్రఘట్టముల లేఖకదోషములఁ దృప్తిగా సవరింపఁజాలక యున్నదియున్నట్టుగా ముద్రించితిమి. ఎట్లో నూతన కవిత చెప్పుట సులభముకాని పరకవిహృదయము గుర్తించి శాస్త్రవిషయమున నతనిపలుకుల నూహించి తెచ్చుట దుర్ఘట మనుట విజ్ఞులెఱింగిన విషయమేకదా! ఆదర్శాంతరము లభించు నేని భాషకుఁ బరమోపకారమగు నని యెల్లరును యథాశక్తి గ్రంథాన్వేషణము సేయుదురని ప్రార్థనముతో విరమించుచున్నారము.

చెన్నపురి,
1923

మా - రామకృష్ణకవి

# విషయసూచిక

## పీఠిక

# సకలనీతిసమ్మతము

## ప్రథమాశ్వాసము (1–289 = 289 గద్య పద్యములు)



## ద్వితీయాశ్వాసము (290–641 = 352 గద్యపద్యములు)

తృతీయాశ్వాసము (642–993 ॥ 352 గద్యపద్యములు)

# అనుబంధము



జ్ఞాపిక : ఎంత ప్రయత్నించినను ముద్రాదోషములు తప్పలేదు. గ్రంథము చివర సూచించిన మార్పులు, చేర్పులు ముందుగా సరిచేసుకొని,

**పిమ్మట గ్రంథమును జదువ ప్రార్థన.**

శ్రీ ర స్తు

# సకలనీతిసమ్మతము

## ప్రథమాశ్వాసము

శ్రీమహిళాకటాక్షతులసీదళకౌస్తుభరత్న కాంతు లు
ద్దామగతి న్వెలుంగ విదితం బగు శక్రధనుస్సమేతమే
ఘామలభాతిఁ బొల్చు సుగుణాఢ్యుఁడు రామగిరీంద్రకేశవ
స్వామి త్రి [లోకనాథుఁడు] ప్రమదంబుగ మత్కృతినాథుఁ డయ్యెడున్. 1

వ. అని యాశీర్వచనపూర్వకంబుగా నప్పరమేశ్వరుచరణారవిందంబులు
డెందంబునఁ గుదురుపఱచి నమస్కరించి. 2

క. సరసకవితావిలాసుఁడ, గురుభారద్వాజరమ్యగోత్రాబ్ధిసుధా
కిరణాయ్యలార్యతనయుఁడ. హరిదాసుఁడ మడికి సింగయాఖ్యుఁడ ధాత్రిన్. 3

వ. సకలవిద్వజ్జనానుగ్రహంబున నొక్క ప్రబంధంబు విరచింపం గోరి మనంబున
నిట్లని వితర్కించితి. 4

చ. కరిహయశిక్షలందు నృపకార్యములందును సంధియానసం
గరములయందు వర్తకముఖంబునఁ గర్షకలీల మోక్షత
త్పరుఁ డగుచోట నీతి యనుదర్పణముం బరికించి చూడ కే
వెరవునఁ గార్యనిశ్చయవివేకము దోచునె బ్రహ్మకేనియున్. 5

క. నీతి యెఱింగినమర్త్యుఁ డ, రాతుల భంజింపనోపు రాజుచేతన్
ఖ్యాతియు లాభముఁ బొందు స. మాతతముగ ముక్తికాతఁ డధికారి యగున్. 6

వ. అట్లు గావున సకలశాస్త్రంబులందును నయశాస్త్రంబు ముఖ్యం బని తలంచి
చెప్పం బూనితి. నారద వసిష్ఠ పరాశర బాదరాయణ భృగ్వాంగిరస గురు శుక్ర

మతానుసారంబై దేవమానవరాక్షసంబు లైన సాత్త్వికరాజసతామసప్రకారంబు లగు నయశాస్త్రంబులు పరీక్షించి యంధ్రభాషాకోవిదు లగు సుకవీంద్రవిరచితం బైన ముద్రామాత్య పంచతంత్రీ బద్దెభూపాల చాణక్య ధౌమ్య విదుర ధృతరాష్ట్ర బలభద్ర కామందక గజాంకుశ నీతిసార నీతిభూషణ క్షేమేంద్ర భోజరాజవిభూషణ పురుషార్థసార భారత రామాయణాది మహాకావ్యంబులు పురాణేతిహాసంబులు కందనామాత్యునీతితారావళి లోకోక్తి చాటుప్రబంధంబులయందునుగల నీతివిశేషంబు లూహించి తత్తత్సారాంశంబు లయ్యైవిధంబుల వర్గసంగతంబుగా సకలనీతిసమ్మతం బనుపేర నొక్కప్రబంధంబు రచియింపుదు నని ప్రబంధసారంబునకు ననుగుణంబుగా నేపురుషునిం బ్రార్థింతునో యని వితర్కించితి. 7

సీ. ఘనకశాఘాతకర్కశకిణచేటికాస్తనముల నలఁదిన చందనంబు
నిశితకంటకశిలానికటమర్కటకటిఁ జెలువారఁ గట్టిన జేలుచేల
ప్రకటితాపమత్తభల్లూక మౌదలఁ బొలుపారఁ జెరివిన పుష్పమాల
సతతపల్వలపంకసంగిలులాయంబునఱుతఁ బెట్టిన తారహారపంక్తి

గీ. కరణి గాకున్నె సాహిత్యసరణి యెఱుఁగ
కజ్ఞసంగతిఁ బొదలు దురాత్మకులకుఁ
గవులు తర మెఱుఁగక యిచ్చు కావ్యకన్య
క్లేశసంసారభవనాశ కేశవేశ. 8

వ. అని విచారించి మత్కృతికాకన్యకకుఁ దగిన పురుషుండు పురాణపురుషుండె కా నిశ్చయించి సకలజగదుత్పత్తిస్థితిలయకరుండును నిఖిలవేదాంతవేద్యుండును బరమయోగిహృదయవాసుండును వాసవవంశాంబురాశిసుధాకరకాశ్యపసగోత్ర పవిత్రాబ్బనా (మాత్యపుత్ర) కందనామాత్యాగ్రజన్మ కేసనమంత్రిప్రతిష్ఠిత మహాప్రసాదనిజజగన్నివాసుండును సకలలోకస్వామియు నభీష్టఫలప్రదాయకుండును నగు రామగిరి శ్రీకేశవేశ్వరునకు సమర్పించుటయదియుఁ బరమపూజావిశేషంబు కావలె నని మనంబున నుపక్రమించి. 9

## షష్ఠ్యంతములు

క. అంభోరుహదళనయనున, కంభోనిధికన్యకాకుచాశ్రితకుంభ
జృంభితవక్షఃస్థలునకు, సంభోగధరపర్ణునకు దయాంభోనిధికిన్. 10

క. కైటభరిపునకు సురవర, కోటీరతటాగ్రరత్నకుట్టిమకురువిం
దాటోపకిరణరంజిత, పాటలితశ్రీవిరాజపదపద్మునకున్. 11

క. కేశవనాథున కఖిలది, గీశారాధ్యునకు జగదధీశున కాశా
పాశక్లేశారణ్యహు, తాశనునకు నిత్యానందచిదాకారునకున్. 12

వ. ఏను విన్నపంబు సేయంబూనిన సకలనీతిసమ్మతకథాప్రారంభం బెట్టిదనిన.

సీ. ఆలోలకల్లోల మగుదుగ్ధనిధిఁ ద్రచ్చి దేవామృతము తేట దేర్చుపగిది
గంధకారుఁడు మున్ను గలవస్తువులు జోకఁగూర్చి సుగంధంబు గూడినట్లు
అడవి పువ్వులతేనె లన్నియు మధుపాళి యిట్టలంబుగ జున్ను వెట్టుభంగిఁ
దననేర్పు మెఱసి వర్తకుఁడు ముత్తెము లేఱుగూర్చిహారంబుతాఁ గ్రుచ్చుకరణిఁ

గీ. కృతులు మును చెప్పినట్టి సత్కృతులు ద్రవ్వి
కాంచుకంబెను నొకచోటఁ గానఁబడఁగ
సకలనయశాస్త్రమతములు సంగ్రహించి,
గ్రంథ మొనరింతు లోకోపకారముగను. 14

గీ. అక్రమం బని తలఁపకుఁ డఖిలములును, వర్గములు చేసి చెప్పిన వరుసతోడఁ
జూచి సకలంబుఁ దెలియుఁడు సుకవులార, చేరకుఁడు బొమ్మకై వంక చేఁదుగలదె.

క. కడవెఁడు దుగ్ధములోపల, దోడిఁబడఁ గొణిదెండుసల్ల తోఁడంబడిన
ట్లెడనెడ నొక్కొకపద్యం బడరించి మదీయకావ్యమని వ్రాయింతున్. 16

వ. అదియెట్లనినఁ గవిత్వగుణవిశేషంబును, నీతిశాస్త్రప్రశంసయు, రాజ్యాంగ
ప్రధానంబైనదుర్గసంరక్షణంబును రాజునవశ్యకర్తవ్యంబగునాజ్ఞాపాలనంబును,
ప్రజాపాలనంబును, బ్రాహ్మణాచారనీతియు, దుష్టశిష్టమంత్రపరిశీలనంబును,
గణక పురోహిత విద్వద్యాచక జ్యౌతిషిక వైద్య దూత చార సేనాపతి భట
సేవకోత్తమాధమ లక్షణంబును, సామభేదదానదండమాయోపేక్షేంద్రజాలిక
క్రమంబులును, సంధి విగ్రహ యానాసన ద్వైధీభావంబులును, సప్తవ్యసన నిరూ
పణంబును, మిత్రానసూయావిధానంబులును, దండయాత్రాసామర్థ్యంబును,
జతురంగబలసన్నాహంబును, ప్రయాణప్రయత్నంబును, దత్తచ్ఛకుననిశ్చ
యంబును, యుద్ధవిధానంబును, నిజస్కంధావారనివేశ ప్రకారంబును,
ప్రత్యర్థిరాజ బలాబల చింతలును, సుభయబలవ్యూహరచిత చాతుర్యంబును,
గరి ఘోటక చతురంగ యోధనిశ్చయంబును, గార్యసత్వరంబును, అధికాధమ

విరోధభేదంబులును, రాజపుత్రజ్ఞాతిబంధుజనపరిపాలనంబును, బౌరాంగనా విట విటీజనలక్షణంబును, సజ్జన దుర్జన వర్తనంబులును, లుబ్ధత్యాగి యాచక గుణ విశేషంబులును, పంచగుప్త ప్రశంసయు,సకలలోకోక్తి విశేషంబులును, సింగితాకారచేష్టలును, సంగీతనాట్యప్రకారంబులును, నన్యాపదేశంబులును, ధనాధనవాణిజ్య కృషీవల పశుపాలన లక్షణంబులును, దేవాలయోద్యాన తులసీవన తటాకాది ప్రతిష్ఠాఫలంబులును, హరిహరభక్తివిశేషంబులును, సాలగ్రామ పూజాఫలంబులును, గాయత్రీమంత్ర గురు పితృభక్తివిధంబులును, నానాతీర్థవిశేషంబులును, మాఘస్నానఫలంబు, నను నివి యాదిగాఁగలిగి బహుకవీంద్రవాక్యామృతపూరంబై, ధర్మార్థకామమోక్ష ప్రదం బగు నీతిప్రపంచంబు వివరించెద. 17

చ. మును కవులెల్లఁ జెప్పినవి మున్నొకని చర్వితచర్వణంబుగాఁ
బనివడి వ్రాయనేల కవిప్రాజ్ఞులు చిత్తములందుఁ జూడుఁ డా
ఘనుఁడగు ప్రౌఢమూలకరి కమ్మని పువ్వులు గూర్చి దండ గ
ట్టినక్రియ నీతిదామము ఘటింపుదు మీరలు మెచ్చునట్లుగన్. 18

క. సురతాణిముద్రఁబోలెను, ధర నెల్లెడఁజెల్లిపెక్కుతావ్యాణలతో
సరివచ్చి సర్వసమ్మ, త్యరహము గావలయుఁ దజ్ఞుఁ డాడినమాటల్. 19

—మదీయము

క. జను లిది యల్పగ్రంథం, బనవలవదు దీనఁ దోఁచు నన్నియుఁ బెక్కుల్
గనుపట్టఁ జేయు వాతా, యనవివరము పిన్నగాదె యారసి చూడన్. 20

క. భువి నధికుఁడు దెలుపని యు, క్తివిశేషము చిఱుతవాఁడు దెలుపెడు నొకచో
రవికి మఱుఁగైనగొందిని, దివియ ప్రకాశింపఁ జేయదే యొక్కొకచోన్. 21

ఉ. ఆకులవృత్తి రాఘవుశరాగ్రము నందుఁ దృణాగ్రలగ్నసీ
తాకృతి వార్ధియింకుట దశాస్యునిఁ జంపుట మిథ్యగాదె వా
ల్మీకులు సెప్పకున్న కృతి లేని నరేశ్వరు వర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినంబడ దతఁడు మేరు వెత్తినన్. —నీతిభూషణము

క. అమల మగు సప్తసంతా, నములం దనిశంబు యశమునకుఁ గుదురై నా
శము లేక వెగడునత్కా, వ్యము ధరణిలోన నౌభశార్యుని కందా. 23

మరఁ గ వేల్పులచేఁ గ, బ్బము చెప్పియ కాదె వరము వడసిరి మును బా
మయూరాదులు సత్కా, వ్యముఁ జెప్పినఁ బడయరానివస్తువు గలదే. 24

హ్వార్థప్రతిపాదకంబు లయి శబ్దంబుల్ నిరాయాసభా
హ్వానం బొనరింపఁగా రసనవీనాపాదనంబుల్ చతు
ప్రహ్వాంఘ్రిప్రభవాపగామహిమ దోపం జూప లేకుండినన్
హ్వాకండువుపొంటె మేలె కవిరాట్ఛిల్పంబు లల్పంబులే. 25

గామ్యంబు దుస్సంధి కాకు విరోధోక్తి పొల్ల సంక్లిష్టంబు జల్లిపొదప
ర్థబంధంబు పునరుక్తిదోషం బలంకారదూషణంబు
సవిరుద్ధము క్రియారాహిత్య మస్పష్టభావంబు గణయతిభంగ శబ్ద
ంగంబు లెఱుఁగక సంగతంబుగ వట్టి మాటలు పురికొల్పి మచ్చరమునఁ

నచి వడ్లును బెరువును బిసికినట్లు, కెలను నవ్వంగ బిలిబిళి కృతులు చెప్పి
దు లడువంగఁ బఱతెంచువారు కవులె, గోపికాజాలసుఖలోల గోపబాల. 26

లఁగని చెప్పి సంస్కృతము తీపును నాఱడిఁబుచ్చి శబ్దముల్
లఁగును గాక యేసభలఁ దెల్పఁగరాని యపప్రయోగముల్
లుసులు గ్రుచ్చి వా దడువఁ బాడుచుఁ గబ్బపు దబ్బముండ్లచేఁ
లుచన కర్ణముల్ పొడుచు పేలుఁగపిం గవిగాఁ దలంతురే. 27

ుకులు గొన్ని పేర్చి వడిఁప్రాసము నందుల దోఁప నేర్చు భం
ెటువంటి పద్యములు గూర్చినఁ గూర్పంగ వచ్చుఁగాక తద్
లు వాగడం బ్రబంధములు చోద్యము పుట్ట రచింపవచ్చునే
లసులు దర్విన్నట్లగునె చెర్వులు గట్టుట భూతలంబునన్. 28

—సీతితారావళి

ండ రీసఖముఖసుఖదవీణాతంత్రి ముసలంబు గొని పెట్టు మోఁదినట్లు
ుతంతుబంధనాస్పదనప్రసూనంబు కఠినంపురజ్జునఁ గట్టినట్లు
ృక నఖదారణారహకదళికాఫలము గొడ్డటఁ గొని పాపినట్లు
ంద్రికారసబిందుసదృశముక్తామణి బలితంపుఁగరసానఁ బట్టునట్లు
తురక విసూత్తరసభావజనితమధుర, సకలకావ్యంబు కేవలశాస్త్రతర్క
ర్కశోపలసదృశవాక్పరుషతలను, గుతిలపడ కేలసైరించు గోపబాల. 29

—మదీయము

క. పలుకుంతిప్పను సరసము, చెలువము నడబడగు బంధచిత్రము సొబగున్
గలకలనఁ జూపవలదే, కలకంఠియుఁబోలెఁ గవిత కందనమంత్రీ. 30

—నీతితారావళి

క. సరసవివేకులు మెఱుఁగని పురుషులఁ బశువులని నిక్కముగ నెఱుఁగుఁడా వా
రిరువడిఁ బ్రాణంబు మేయమి, పరికింపఁగ ధరణిఁ బశులభాగ్యం బెందున్. 31

ఉ. సుందరసర్వలక్షణవిశుద్ధకవిత్వము గన్నచో రస
స్యంది నిజస్వభావుఁ డనఁ జాలినయట్లనిజస్వభావుఁ డా
నందముఁ బొందునట్లు కుజనప్రకరంబు తెలుంగ నేర్చునే
మందరుఁ జూచి మోదమున సాగరముబ్బిన మాతు నుబ్బునే. 30

—నీతిభూషణము

## నీతిశాస్త్రప్రశంస

మ. నయమార్గంబున లక్ష్మి లక్ష్మిగలచో నారాయణుం డుండు ని
శ్చయ మచ్చో వరధర్మవృత్తికి నిజస్థానంబు తన్మూలమై
జయ మెల్లప్పుడు నుల్లసిల్లుఁ ద్రిజగత్సంసేవ్యమై కావునన్
నయశాస్త్రంబె వివేకధన్యునకుఁ జింతారత్న మెల్లప్పుడున్. 33

గీ. వ్యసనములు మాని రాజు విద్వత్పరిషంగ, సంగియై పురాణేతిహాసములు వినుచు
నీతి వినునేని నృపతికి నేర్పు మిగులు, వసుమఁబాయున కెలకలు వచ్చినట్లు. 34

ఆ.వె. నీతి యెఱుఁగువాఁడు నిఖిలంబులందును, ఖ్యాతిలాభపూజలందు నొప్పు
గాక యొరుఁడు పొందఁగలఁడె నేర్పునకు, వివేకమునకు మాఁతవెరపకాదె. 35

—నీతిసారము

చ. అనుచుఁ దలంచి రాజసచివాధిపు లెంతయుఁ బ్రేమతోడఁ బ్రా
ర్థన మొనరింప సర్వజనతాహితబుద్ధి వహించి యంత్రసవా
గ్వనధివిలాసవీచికల వారక తెప్పలఁ దేల్చియింపు సొం
పినుమడిగా నయాస్మృతము నిచ్చెద మెచ్చులు పల్లవింపఁగన్. 36

సీ. నిత్యనైమిత్తికనియమవ్రతాదుల విపులధర్మంబు గావించునప్పుడు
కర్షణగోరక్షక్రయవిక్రయాదులచేత నర్థంబు లార్జించునెడల
స్మరకూచిమారపాంచాలాదిమతములఁ గామసౌఖ్యము లందుకాలములను
యమనియమాదివిఖ్యాతకారణములఁ గైవల్యమార్గంబు గాంచునెడల

ఆ.వె. మఱియు సూక్ష్మవాక్యమార్గంబులందును, నధిక మగుచు నున్న యట్టిపనుల
వెరవు లేనియట్టిపురుషుండు నేర్చునే, ఫలము నొంద నీతిపరుఁడు గాక. 37

—ముద్రామాత్యము

చ. అరయఁగ శబ్దశాస్త్రము లనంతము లాయువు కొంచె మందులోఁ
గరము ఘనంబు విఘ్నములు గావున సారము పట్టి యొప్పగున్
బరఁగ నసారము ల్విడిచి పాలును నీరును నేర్పరించి నే
ర్పరుదుగఁ బాలుపుచ్చుకొను నంచతెఱంగున భూవరాగ్రణీ. 38

—పంచతంత్రి

క. ధర్మార్థశాస్త్రతత్త్వవి, నిర్మలమతి గాక యెట్టి నీతికథాస
ద్ధర్మము దెలియసమర్థుఁడు, దుర్మతి యే మెఱుఁగు శాస్త్రదూషణదక్షున్. 39

క. మతిమంతులయంత్రంబులు, ప్రతియంత్రక్రియనెగాని మాయవు దృఢకీ
లితఘనఘటితకవాటము, ధృతిఁ దాలముచేతఁ గాక తెఱవగ నగునే. 40

—ముద్రామాత్యము

క. ధరనొప్పు నీతిమార్గము, పరికింపఁగఁ దిరుగు మంత్రిపని మంత్రము లే
కురువిషభుజగము పట్టిన, కరణి సుమీ యోభళార్యకందనమంత్రీ. 41

—నీతితారావళి

క. రాజు లమాత్యులు మొదలగు, భూజనులకు నీతిపథము పొత్తగు నం దే
యోజఁ బరికింప నెవ్వరు, తేజము గండ్రావిధమ్ముఁ దెలిపెద వరుసన్. 42

—ముద్రామాత్యము

క. పెక్కేల నీతిశాస్త్రముఁ, దక్కక నెవ్వండు చదువు ధర నెవ్వఁడు పెం
పెక్కఁగ విను నాతఁడు దాఁ, జిక్కఁడు సురపతికి నైన సిద్ధం బెందున్. 43

—పంచతంత్రి

## దుర్గసంరక్షణము

ఉ. శ్రీపతిఁ బోలుభూపతియుఁ జెల్వగుమంత్రియు రాష్ట్రదుర్గము
దీపితకోశసైన్యము లుదీర్ణసుహృజ్జనులుం బరస్పర
వ్యాపిమహోపకారు లగు నట్లుగ రాజ్యాంగబుద్ధిమై
నోపి పరీక్షసేయవలయు న్నిజశిక్షణలక్షణంబులన్. 44

ఉ. ఆరసి రాజకంబుల ప్రజావలి కెల్ల నివాస మయ్యు భం
డారములున్ బలంబుఁ బ్రకటంబుగఁ దాఁపఁగఁ బోలు దుర్గ మే
భూరమణీశుఁ డేలుఁ బరిపూర్తిగ వానికి వశ్యులై ప్రజల్
భూరిధనంబు గూర్తు రది వోలునె కాదె నిజాభిరక్షకున్. 45

క. విమతుల కగమ్య మగుదు, ర్గము లేకుండినను బ్రజకు రాజుకుఁ దమదే
శము లిడుమం బడు ధనధా,న్యము లుండినఁ బిదపఁ బ్రాణహానియుఁ గల్గున్. 46

—కామందకము

క. తనప్రజకుఁ బిదప నిర్భయ,మని యూఱడి తొలఁగిపోయి యహితుల గెలువన్
(జనియైనఁ జుట్టుముట్టినఁ),దునుము నృపుం డశ్రమంబు దుర్గబలమునన్. 47

క. పులు లుండుఁ బొదల నేనుఁగు,లలఘుగిరీంద్రముల నుండు ననిశము సింహం
బులు గుహల నుండుఁ గావున, బలవంతుల కైన దుర్గబల మది వలయున్. 48

ఆ. వె. అలహిరణ్యకశిపు నలజడికై యోడి, విశ్వకర్మచేత విశ్రుతముగ
గురునియమితమునఁ గోటఁ బెట్టింపఁడే,యమర నమరనాథుఁ డమరపురికి. 49

ఆ. వె. ధరణి మదము లేని కరులనుబోలె దం, ష్ట్రములు లేని పన్నగములఁబోలె
నరయ దుర్గరహితులైన ధాత్రీశ్వరు, లవని కెల్ల నసదు లగుదు రెపుడు. 50

క. పరులకు దుర్గము వలచే, హరువరమున భువనవిజయుఁ డగురావణుఁడున్
శరధిగిరిప్రాకారో, త్కరపరివృతమైనలంక ఘన మని యుండున్. 51

—పురుషార్థసారము

గీ. చుట్టువాఱ వెలుగు గట్టిగా నిడికొని, యున్నవారిఁ గడిఁది యోర్చు టనిన
నురుతరంపుదుర్గ మొకటి ప్రవేశించి, బలిసికొనినపిదప గెలువ వశమె. 52

—పంచతంత్రి

వ. కావున దుర్గంబు రాజ్యంబునకు చిరకాలనిర్వాహకం బదియును భూస్థలంబున నిర్మింపంబడిన ప్రాకారంబు స్థలదుర్గంబు, జలవనపర్వతంబులు స్వభావ దుర్గంబు లయ్యును ప్రాకారంబు లేకయున్న బరులకు గోచరంబు లగు నీ చతు ర్విధదుర్గంబులందును విచిత్ర గోపురాట్టాలకంబులును, ననేక దారుమయ యంత్ర నియంత్రితంబులును, నానాస్త్రశస్త్ర శిక్షాదక్ష వీరభటప్రాయంబులును, బహు ధనధాన్య రస సంగ్రహంబులును, ననేకజనసంచారక్షమాంతరాళంబు లును, దృణ కాష్ఠ జల సమృద్ధంబులును, బ్రవేశ నిర్గమ మార్గ నిరోధ రహి తంబులుగా నొనర్పవలయు, నట్లు గానిదుర్గంబు వందిగృహంబు మఱి యును. 53

—నీతిసారము

ఉ. శైలసరిన్మరుస్థలవిశాలవనాశ్రయణంబు మున్నతా
ట్టాలకమాత్ర గోపురదృఢస్థలవప్రశిరఃప్రఘాతముం
గాలసహంబు ధాన్యధనకాష్ఠజలాదికమున్ మహాభటో
త్తాలభుజార్గళంబును బ్రధానకవాటము దుర్గ మెన్మొయిన్. 54

క. గిరులును దరులును జలములు, మరుభూములు మిగుల నైన మనుజేశునకున్
దిరముగ దుర్గము సేయుట, పెర పగు పైరులకుఁ జేర విషమం బగుటన్. 55

—కామందకము

చ. బహుధనధాన్యసంగ్రహము బాణశరాసన యోధవీర సం
గ్రహము నిరంతరాంతరుదకంబునుఁ జాలఁగ నింధనంబు సం
గ్రహము ననేకయంత్రములు గల్గి యసాధ్యములై ద్విషద్భయా
వహము లనంగ నొప్పునె భవత్పరిరక్ష్యములైన దుర్గముల్. 56

—సభాపర్వము

చ. సముచితవస్తుసంగ్రహము సాలినదుర్గము లిచ్చు నందు ధా
న్యము మిగులంగఁ గూర్పఁదగుఁ బ్రాణము నిల్పఁగ ముఖ్యహేతువై
కొమరగు గాసయందు నిడు కోద్రవముల్ చెడకుండఁ బెట్ట ధా
న్యము పెఱధాన్యమైన నవిలంబగతిం జనుఁ గ్రొత్త సేయఁగన్. 57

—నీతిసారము

చ. ధరఁ దృణకాష్ఠతైలఘృతధాన్యజలాదికవస్తుపూర్ణమై
గురుతరమై మహాటవులఁ గోటల భూరిగభీరవాపులన్
బరివృతమై ప్రవీరసులభం బగుదుర్గము గల్గుధారుణీ
శ్వరుఁడు దలంప నెవ్వరి కసాధ్యుఁడు వారికి సాధ్యులే యొరుల్. 58
—పురుషార్థసారము

క. రసరాజ మెనలవణం, బెసగఁగ దుర్గముల సంగ్రహింపఁగవలయున్
బొసఁగునె యన్నము మఱి యే, రసములు గలిగినను లవణరసవర్జితమై. 59

సీ. బలుగాఁపు వాకిళ్లఁ బగలు రేయును నిడి కోటపాశెము తగుచోటఁబెట్టి
కనుమపట్లను నెల్లఁ గావలి నియమించి నడిమిచావిడిఁ దగునరుల నునిచి
నగరిచుట్టును జారి నడిపించి క్రంతలఁ దిరుగుచుండగఁ దలవరులఁ బనిచి
దినచర్యఁ జాలెముల్ దృష్టిపెట్టుచు రేలు దివియలు విడువక తిరుగఁజేసి

ఆ. వె. దొరల రాజులందు నరయుచు భటులందు భేద మొదవకుండ నాదరించి
యుచితవృత్తి గావకుండిన దుర్గంబు, నేలఁగలఁడె భూమి నింద్రుఁడైన. 60

క. బలు వగు దుర్గము గలిగియు, బలములు లేకున్న నిలుప బలవంతునకున్
దలమే నృపులకు నాలుగు, బలములు గలుగుటయె కాదె బలిమి యనంగన్.61

క. కరులును హరులును రథములు, వరభటులు ననంగ నాల్గు వర్గంబులు నొం
దొరులకుఁ బ్రాపై నిలువక, పరసేనం గెలువఁగలఁడె పార్థుండైనన్
—నీతిసారము

క. ఈ నాలుగుదుర్గములకు, మానుగఁ జొర వెడల గూఢమార్గము వలయున్
అనూపజాంగలంబులఁ, బూనిన భూములును వలయు భూనాథునకున్. 63

క. భూగుణముచేత రాష్ట్రము, భోగాస్పదవృద్ధినొందుఁ బొదవినరాష్ట్ర
శ్రీగరిమం బది పొదలు న, రాగము లామంచిభూమి రాజున కెందున్. 64

సీ. సస్యాకరవిశేషసలిలసమృద్ధియుఁ బణ్యఖనిద్రవ్యబంధురంబుఁ
బుణ్యదేశాన్వితంబును గోహితంబును గుంజరోద్భవవనపుంజములును
వారిస్థలపథాన్వితారూఢమును నదీమాతృకంబును సేవ్యమానతలము
నై పొలుపొందుట యవనీస్థలంబున కంచితగుణములై యతిశయిల్లు

గీ. మూషపాషాణశర్కరాత్యుగ్రరూక్ష, భుజంగ కంటక తస్కరభూరివిపిన
సంకులం బగుభూమి యసంఖ్యమైన, నేఫలం బగు భూమి నరేశ్వరునకు. 65

సీ. భూరిభూమిగుణంబుల నుల్లసిల్లుచు సానూపము బర్వతాశ్రయంబు
నానావిదేశజనస్తోమధాముము దనుపక బహుళము ధర్మయుతము
శూద్రకారువణిక్ప్రచురపురాంతరము నుచితమహారంభకృషిపలంబు
రాజానురాగ మరాతివిద్వేషియుఁ బీడాకరసహంబుఁ బృథుతరంబు

గీ. నైన మండలంబునందు నృపాలుండు, వ్యసనమౌర్ఖ్యహీనుఁడగుచు నెపుడు
న్యాయమార్గవృత్తిఁబాయక పోషింప, వలయు నదియు సర్వవర్ధనంబు. 66
—కామందకము

క. ధరణీనాథ భవద్భుజ, పరిపాలిత మైనవసుధ పరిపూర్ణములై
కర మొప్పుచున్నె చెఱువులు, ధరణి కవగ్రహభయం బు దగులకయుండన్.67
—సభాపర్వము

చ. వెస నతివృష్టియున్ మఱి యవృష్టియు మూషకముల్ పతంగముల్
మసఁగు టశోభనంబు కృప మాలిన దండుపు శత్రుసైన్యముల్
ఎసగిఁ యరాతితస్కరు లధీశచమూప్రియు లేచి నొంపుటల్
పసులును మానవుల్ రుజలఁబంచత నొందుట రాష్ట్రదోషముల్. 68

శా. ఆదానాధికమున్ మితవ్యయము ప్రఖ్యాతేప్సితద్రవ్యమున్
మోదారాధితదైవతోర్జితము సమ్యక్త్వాదిరత్నాఢ్యమా
హ్లాదశ్రీకర మాత్మరక్షణవిధాయత్తంబు పైతామహో
నాదిప్రౌఢమునైన పెన్నిధి ధనంబై యొప్పు నక్షీణమై. 69

గీ. ధర్మకామార్థలాభవిధానమునకు, సకలభృత్యాదిలోకరక్షణముకొఱకు
నాపదర్థము నర్థరక్షాపరుండు, గా నవశ్యము వలయు భూకాంతుఁ డెపుడు.70

గీ. ఇట్టిసంపద నెంతయునేర్పుమిగులు,దుర్గములు భూములనుఁగడు దోరముగను
లేని భూపతి వాత్యావిలూనవికట, వికలకాదంబినీసమవిభవుఁ డగును. 71

ఆ.వె. పరఁగ నాత్మరక్షఁ బరపక్షపూజ్యుఁ డౌఁ, బూని దుర్గసంస్థుడైన విభుఁడు
ఇట్టి దుర్గమునకు నెంతయు వ్యసనంబు, పొడమెనేని చేటు గడమలేదు. 72

ఆవె. వెలుగుఁబెట్టి చేనుగలయంగఁబండిన, సుఖిపిఫలముగొన్న తెఱఁగుదోఁప
నాజ్ఞ వెట్టి ప్రజల నరియప్పసంబులు, గొనఁగవలయు రాజకుంజరుండు. 82

క. పసరముఁ బసరము పులిఁబులి, బిసరుహసంభవునిసృష్టి పెంపెంత మహిన్
బసరముఁ బులిఁజేయుఁబులిం, బసరముగాఁ జేయు నృపతి బలమదిగాదే. 83

క. అజమైన సింహమగు భూ, భుజుమన్నన గలుగునట్టిపురుషుం డరయన్
అజమగు సింహంబును భూ, భుజుమన్ననలేనియట్టిపురుషుఁడు దలఁపన్. 84

—పురుషార్థసారము

క. బలవంతుఁడు మన్నించిన, బలహీనుఁడు బలియుఁడనఁగఁబడు ధారుణిలో
వలరాయఁడు చేపట్టిన, యలరులు బాణములుగావె యాఖిళకందా. 85

—నీతిరాఘవ?

ఆ.వె. ఆజ్ఞలేనినృపుఁడు నరయఁజిత్తరువులో, నున్న రాజుఁ జూడ నొక్క రూప
ఆనఁద్రోయుసుతునినైనను దండింప, కున్న రాజ్యమేల యుండుఁజెపకి. 86

క. పనిలేనియాన గర్వం, బునబొడిచిన మగుడ నాన పొడిచినవారిన్
జనపాలుఁడు దండింపం, జనుఁదగుక్రియ నానఁద్రోయుజనుఁడనవారెన్. 87

క. దండము లేకున్నను బ్రజ, లొండొరువుల నాక్రమింతు రుచితస్థితిమై
నుండవు వర్ణాశ్రమములు, దండింపని భూమిపతికి ధర యేప్పుడునే. 88

ఉ. జూదము వాదుఁబన్నిదము జోఁయు మందటకూటసాక్షిమ
ర్యాదలులేమి గబ్బుమెయి నానకు నిల్వక రాజసంబునం
బేదల నొంచు దప్పుగొని పెట్టమినాదిగ వంచనక్రియన్
గా దడఁకించుదుర్జనుఁ గావనిరా జిల యేలనేర్చునే. —నీతిసారము

ఉ. మండలనాథునాజ్ఞకు సమస్తజనంబులు నోడిపాడిమై
నుండక మేర దప్పి బలియుం డబలున్ మననీక పెద్దమీ
నొక్కండికమీను బ్రాపుక్రియఁ గ్రొవ్వునఁజంపుచు నుండిరేని య
మ్మండల మేల యుండు మతిసంతులకుం బరపక్షిభైరవా. 90

—బద్దెనీతి

ఆ.వె. తారతమ్ము సేయఁ దగు శిక్ష చేసిన, నుర్విపతులఁ గొంద ఱొప్పదండ్రు
అది వివేకమగునె వదన మొప్పకయున్న, దర్పణంబుమీఁదఁ దప్పుగలదె
—పంచతంత్రి

## ప్రజాపాలనము

క. నరపాలుఁ డాత్మసంప, ద్వరయుతుఁ డగుచుండి లోకవర్తనవిదుఁడై
చరియింప నఖిలలోకము, కరము సుఖంబుండు తండ్రి గలప్రజలక్రియన్. 92

క. నృపజనచోరాయత్తము, నృపవల్లభ రాజలోభనిజహేతువులున్
విపుల కగునై దుభయములు. నుపద్రవము సేయుఁ బ్రజలకొగి భూపతికిన్. 93

క. న్యాయప్రయుక్తుఁ డగుపతి, సాయక తనుఁదనదుప్రజలఁ బరఁగఁ ద్రివర్గ
శ్రీయుతులఁజేయు మరియ, న్యాయతమతి యయ్యేనేని యఖిలముఁ జెఱుచున్.

ఆ.వె. ప్రజలవర్తనంబు పరికింపనోపని, రాజు కేలగలుగు రాజ్యసుఖము
వారిమేలు గీడు వరుసన తనకును, గీర్తికరమగు నపకీర్తికరము. 95

గీ. వాగ్మితాదులు ధారుణీవల్లభునకు, నాత్మ సంపద యాసంపదాత్ముడైన
రాజు గలిగిన ప్రజ వివర్ధనమునొందు, వాసవునిఁజేరి బ్రతుకు గీర్వాణులట్లు.
—అజ్ఞాతము 96

క. వినికి గలిగి రక్షించుచు, ననువున దయతోడిపాడి నాయతు లెల్లన్
గొనుచుఁదగ నెఱిఁగి పొగడొం, దినరాజున కుర్వి కామధేనువు గాదే. 97
—భీష్మపర్వము

ఉ. రాజు నిజప్రజాసమభిరక్షణ మెప్పుడు సేయ భూజనుల్
రాజున కర్థవృద్ధియు ధరన్ బహుభంగులఁ గూర్తు రిందులో
రా జభివృద్ధికంటె జనరక్షయె యుత్తమ మెందు భూజనుల్
రాజసురక్ష లేక చెడి రా జభివృద్ధి యొనర్పనేర్తురే. 98
—పురుషార్థసారము

చ. గనులు కృషిప్రపంచ మరి కప్పము సుంకము గోకులంబు నం
దనవనముం జలస్థలపథస్థవణిక్క్రియ దుర్గరక్షణం

బనఁ గలయన్నిమార్గముల నర్థము గూర్పక చేపలంబ కాఁ
పున పాలియించురాజు సిరి పొందునె రాజమనోజభూభుజా. 99

—బద్దెననీతి

క. జనపతి పర్జన్యునిగతిఁ, దనభూప్రజఁ బ్రోవవలయుఁ దగఁ బ్రోవడయేఁ
దనుఁ బాసిపోవు నాప్రజ, ఘననీరసనగరసిఁ బాయు ఖగములభంగిన్. 100

—నీతిసారము

క. ఉత్తమయానములును ఘన, విత్తములును రత్నధాన్యవితతులు నయసం
పత్తినిఁ బ్రజఁ బాలింపక, యెత్తెఱఁగునఁ గలుగు ధారుణీశుల కరయన్. 101

గీ. ఫలము కానసేయు పతిగాక నీతితో, భూమిప్రజల నరసి ప్రోవవలయు
నీరు ప్రోదిపెట్టు నెఱిమూలకరివాఁడు, పువ్వుఁ దీగ లరసి ప్రోచినట్లు. 102

—పంచతంత్రి

క. తననగరిలోన నించుక, యును భాండాగార మునుచు నునికి దగదు రా
జునకుఁ బ్రజలె భండారం, బని యేమఱకరయవలయు ననిశము వారిన్. 103

—నీతిభూషణము

క. ప్రజఁ దల్లి పెంచుతెఱఁగున, ప్రజఁ బతి బెంచునది పెరిఁగి పడబడి తల్లిన్
బ్రజప్రోవు నందియము పతిఁ, బ్రజప్రో పది నిక్కువంబు బద్దెనరేంద్రా. 104

క. క్రూరుఁ బ్రజ విడుచు నోడఁగ, నేరదు హిమ్యునకుఁ గాన నృపతి ప్రజను సా
ధారణరూపంబున నయ, పారగుఁడై యేలవలయు బద్దెనరేంద్రా. 105

—బద్దెననీతి

క. అపదలఁ జెందుప్రజలను, భూపతి మొద లిచ్చి మగుడఁ బ్రోవఁగఁ దాఁ
జేపట్టి విడుపవలవదు, భూపతికిఁ గుటుంబ మనఁగ భూమియ కాదే. 106

—నీతిసారము

క. చాలఁ బ్రజఁ బ్రోవకయ తాఁ, గోలాసన్ బాఁడి దప్పి కొనుచుండెడి భూ
పాలకుఁడు కుప్పఁ జిచ్చిడి, పేలాల్వేదకికొని తినెడిబేల తలంపన్. 107

—పురుషార్థసారము

క. మండలము చెడినఁ బతి చెడు, మండలమును బతియుఁ బెద్దమాత్రనె చెడు న
మ్మండలముఁ బతియుఁగావడి, కుండలవలె నుండవలయుఁ గొమరురథిమా. 108

ఆ.వె. తరువుఁ బెంప నేర్చి తమకాలముల వృక్ష
ములను బహుఫలలు ఫలములును బాలు
నొసఁగునట్లు రాజు పోసగంగఁ బ్రోవఁ
బ్రజయుఁ బెంపఁ బతికి ఫలము లిచ్చు.

క. జనపతికిఁ బ్రజాపాలన, మున సద్గతి గలుగు నర్థమును సగుఁ దప్పం
దనమున ధర్మక్షయమును, ధనహానియు నపజయంబుఁ దగ సిద్ధించున్.

—బద్దెనీతి

ఉ. కాపునఁ గాపులోకమునకుఁ గాఁ గలహించిన వక్రశీలురై
పేదిపలం గృషిక్రియలు సేయక తక్కిన నెప్పు పన్నికున్
నా పడిఁ దోరిన న్మనవికాల మెఱుంగక చెప్పిరేనియున్
పాపము లెగ్గునాఁ గొనక బుద్ధివిహీం జను విత్తు రాత్మలై. 111

—నీతిసారము

ఆ.వె. బంధుహీనతకును బరమబాంధవమును, నేత్రహీనులకును నేత్రములును
నన్నితల్లిదండ్రు లన్నను రాజులె, కాక ప్రజల కొరులు గలరె యుర్వి. 112

—పంచతంత్రి

క. సాధింప నడిఁది శత్రుల, సాధించిన బలిమి వృథ నిజక్షితిజనులన్
బాధించు కంటకులఁ బతి, శోధింపనినాఁడు నన్నెచోడ నరేంద్రా. 113

క. జనపతి తన ప్రజభారము, తనముఖమున నడపికొనక తక్కినఁ బొలియున్
విని చెఱుపరతనిసొమ్మున్, జనువారును బ్రజ నరేంద్రచతురాననుఁడా. 114

—బద్దెనీతి

గీ. చాలఁ దస్కరాదిసాహసకర్మల, బాధఁ బొరయకుండఁ బ్రజల నెల్లఁ
గావఁ బ్రోవ నృపుల కాక వారలకును, దలఁచిచూడ నొరులు గలరెయుర్వి 115

క. లోకంబులకును మే లగు, భూకాంతుఁడు మిగులవృద్ధిఁ బొందుచునుండన్
లోకంబునకును గీ డగు, భూకాంతుఁడు మిగులఁగీడు పొందుచునుండన్. 116

ఆ.వె. ఉర్విప్రజలఁ బీడలొనరించెనేనియు, వారిభూరిశోకవహ్నిఁ దగిలి
రాజు సిరియుఁ గులముఁ బ్రాణంబు నొక్కట, నీఱుచేసి కాని నేర దఢిప. 117

ఆ.వె. పరుల వలన గాసి పడకుండఁ దన ప్రజఁ, బూని యరసి ప్రోవలేని రాజు
రాజు గాఁడు వాఁడు రాజరూపంబున, జగతిఁ బుట్టినట్టి జముఁడు గాని. 118

ఆ.వె. పగఱపెలసిబాధ పడకుండ రక్షించు, రాజు లేని మనుజు లోజ లేక
పొలసిపోదు రబ్ధిపూరంబులోపల, నావికుండు లేని నావపగిది. 119

చ. బలియుఁడు నీతిమార్గపరిపాలుఁడు భూపతి గాకయుండినన్
దలపఁగఁ గర్ణధారరహితం బగునావయుఁ బోలె నుండు ని
య్యిలఁ బ్రజ గాన నట్టిధరణీశుఁడు పెన్నిధి భిన్నమై నయ
క్కలమునుబోలె వేగమె తెగన్ విడువందగు నెన్నిభంగులన్. 120

క. పాడి గలపతి వసుంధర, వేడుకఁ బరభూమిప్రజయు వెలయఁగనెక్కున్
బాడి చెడ నడుచుపతి ధర, పాడుగఁ జెడిపోవుఁ బ్రాఁతప్రజయైన వడిన్. 121

—పంచతంత్రి

ఆ.వె. పచ్చ లాయకట్లఁ బటిబోవు నారంభ, మడవిగలయు మత్తె కడగఁబొలము
పంటమీఁద నరులపై దెత్త గజవగుఁ, బ్రజలచేటు భూమి పాడుసేయు. 122

—నీతిసారము

క. ప్రజఁ జెఱిచి కూడఁబెట్టిన, నిజధన మది పలయు వ్యయము నిచ్చలుఁజేయన్
బ్రజయును ధనమును బొలిసిన, భుజబలమున నిలువఁదలమె భూపతికెందున్.

——పురుషార్థసారము

క. న్యాయపుటరి తలపూవులు, గోయుట నట లెస్స తగదు కువలయపతి క
న్యాయ మతి బ్రాను వాడిచినఁ,గాయలుపెనఁ గోయునట్టికరణి దలంపన్.124

—నీతిభూషణము

ఆ.వె. ప్రజ నజంబుఁబోలెఁ బట్టి విత్తమునకై, తగిలి చంపెనేని దానఁదృప్తి
యణఁగ దొక్క మాటి కగుఁగాని ధారుణీ, శునకు మఱియు వలయుననిన లేదు.

క. విను గోపాలునిక్రియఁ గాఁ, పనుధేనువుచేత విత్త మనుదుగ్ధంబుల్
గొనవలయు నిత్య మొయ్యొ, య్యన ఫలరోషాధికముల నవనీశునకున్. 126

—పంచతంత్రి

క. రాజులకు బలము విద్యయు, నాజులరిపు గెల్వఁగాక యపరాధుల న
వ్యాజమునఁ బ్రజలఁ జంపఁగ, యోజించె నెబ్రహ్మరాజు నొండనఁ దలమే.127

—నీతిసారము

## రాజాదాయవ్యయప్రకారము

క. ఇది దేశ మిది కాలం, బిది యాయం బిది వ్యయం బిది యిది సుకృత్సం
పద శక్తి యని విచారము, వదలమి మతి పతికి నాకపై రోచనుఁడా. 128

క. ఆయంబు వ్యయము నొడిచిన, శ్రీయగు సమమైన దశము సెడకుండు వ్యయం
బాయమున కధికమైనను, బాయదు పేదఱిమి సార్వభౌమున కైనన్. 129

క. వ్యవసాయముకొలఁదియు దే, శవిధముఁ గాలంబుఁ బూర్వసంచిత ధనము సొ
మ్ము విచారింపక యుబ్బునఁ, దివిరి వ్యయము సేయునరుఁడు దీనతఁ బొందున్.

ఆ.వె. తనకు నాయమైనధనములో నాలవ, భాగ మొండె మూఁడుపాళ్ల పాల
నొండె నష్టమైన నుచితంబు గాన మి, క్కిలివ్యయంబు సేయవలవ దధిప. 131
—బద్దెనీతి

క. కోశాగారము రక్షా, నిష్ఠితుఁడై చూడవలయు నృపతి కది మహా
శ్రేష్ఠం బగునాయము నగ, రిష్ఠం బగువ్యయము నాచరింపగవలయున్. 132

క. సంవత్సరమున నియతాయతి, భండారము సేయవలయుఁ బతి ప్రియమునకున్
సంవాయము మొదలు గాఁగల, యొండాయము లోలి వెదకుచుండఁగవలయున్.
—కామందకము

క. పేరాసఁ బోట భాండా, గారము వెలిచునది గాని కలవ్యయమునకున్
ధరణిలోఁ గుశలుండై, యూరఁగ వెలివెలిన వలయు నాయతి సేయన్. 134

క. తగనివ్యయం బొకకానియుఁ, దగ జెప్పుడుఁ జేయఁ బతికిఁ దగినవ్యయంబున్
దగ దాయమునకు నగ్గలముగఁ జేయమి యదియ రక్ష ముఖ్యంబునకున్. 135
—పురుషార్థసారము

ఆ.వె. అనుదినంబు గలుగు నర్థంబునం దొక, నియతిఁ గొంత గూర్చి నేర్పు దనర
చీమ ధనము వ్యయము సేయక యంతయుఁ, బాఱఁజల్లునృపతి బ్రతుకు నోటు. 136
—నీతిసారము

క. తనభూమి నొయ్యనొయ్యన, జనపతి యొకకొలఁదితో రసాయనభాతిన్
జను ననుభవింప ననిశము, విను మది కడు మీఱెనేని విషమగుఁ బిదపన్. 137

క. మండలమున నాలుకచవు, లొండొకభోగంబు లెఱుఁగ కొగిఁ జట్మరులై
యుండెడి కులభృత్యులఁ బతి, భండాగారంబు గాఁపు పంపఁగవలయున్. 138

క. ఖాతిగ నిస్పృహులైన కి, రాతులు గొల్లలును భోగరతి లేక ధృతిం
గాతురు పెఱవారలు దా, వేతురు విత్తాపహరము వెలయఁగ మదిలోన్. 139

—పంచతంత్రి

క. భూరమణుఁడు పేదైనను, ధారుణి నెచ్చోటఁ దగదు ద్రవ్యము వెదకన్
వారాశి వట్టిపోయిన, నీ రొండొకచెన ఘటింప నేరఁగనగునే. 140

—నీతిభూషణము

## రాజనీతి

క. ద్రోహుల దండించి బృహ, ద్వ్యాహార్గళశక్తి రిపుల ఖండించియు ను
త్సాహముతోఁ బ్రజఁ గావఁగ. దోహలమతి నజుఁడు భూపతుల నిర్మించెన్. 141

క. వనజజుఁ డింద్రానిలయమ, ధనదార్క శశాంకవరుణదహనాంశంబుల్
గొని నిర్మించుట భూపతి, జనపతి శాసించు దివ్యసామర్థ్యమునన్. 142

చ. జనపతి వేగుజామున లసన్మతి మేల్కని శుద్ధగాత్రుఁడై
యొనరఁగ సంధ్యయున్ జపము హోమము బ్రాహ్మణపూజయుం గ్రమం
బున నొనరించి భూప్రజలఁ బొల్పుగ నారసి పిదుకొల్పి నె
మ్మనమునఁ జేయఁగావలయు మంత్రవిచార మమాత్యయుక్తుఁడై. 143

చ. సకలజనానురంజనము సత్యము శౌచము మంత్రగోపనం
బకృపణవృత్తి దక్షత ధనార్జితశీలత భోగ మీగి నా
స్తికఖలసంగవర్జనము శిష్టవిధేయత దుష్టనిగ్రహం
బకుటిలభావ మింద్రియజయంబు గుణంబులు భూమిభర్తకున్. 144

మ. అతినాస్తిక్య మతిప్రసాద మనృతం బాలస్యమున్ దీర్ఘసూ
త్రత హృత్క్రోధము దీర్ఘచింత విషయాక్రాంతం బమంత్రం బని
శ్చితకార్యార్థ మనర్థచింత హతదాక్షిణ్యం బసల్ప్రక్రియా
ప్రత మస్థైర్యము నాఁ జతుర్దశకముల్ వాగ్దోషముల్ వర్జ్యముల్. 145

—పురుషార్థసారము

క. జనపతి యాత్మాయత్తుఁడు, గొనరఁ బరాయత్తపతియు నుభయాయత్తం
బను గలవు వీరిలోపలఁ, దనరఁ బరాయత్తుఁ డధమతముఁ డరయన్. 146

—ముద్రామాత్యము

క. మనుజాధిపతియు మంత్రియుఁ దనరంగ రాష్ట్రంబు దుర్గధనబలమిత్రుల్
మనుకొను రాజ్యాంగంబులు నొనరఁగఁ బటుసత్త్వబుద్ధియుక్తం బగుచున్. 147

—కామందకము

క. మతిశస్త్రము ప్రకృతులు మేన్, నతిశయధర్మంబు ప్రాణ మతిపృథుతరసం
వృతి జోడు చరులు కన్నులు. చతురుండగు దూత మోము జననాథునకున్. 148

క. స్వామియు మంత్రియు దుర్గ స్తోమము రాష్ట్రంబు ధనము సుహృదులు బలమున్
గా మహి సప్తాంగంబులు. నేమఱక యొనర్పవలయు నిందుల రక్షల్. 149

శా. ఉత్సాహప్రభుమంత్రశక్తుల నజేయుండై పరిక్షీణసం
ధిత్సావ్యగ్రుఁడు గాక విగ్రహముచో దేశంబు గాలంబు సం
పత్సామగ్ర్యముఁ జూచి కార్యముదెసన్ ప్రారంభియై భూప్రజన్
వాత్సల్యార్ద్రమనస్కుఁడై నపతి శశ్వచ్ఛ్రీసమేతుండగున్. 150

—నీతిభూషణము

క. గతదోషుఁడు గుణవంతుఁడు
కృతవిద్యుఁడు శక్తియుతుఁడు గీర్వాణసమో
న్నతచరితుఁ డాత్మరక్షా
రతుఁడగుపతి యనుభవించు రాజ్యసుఖంబుల్. కామందకము 151

—పురుషార్థసారము

సీ. శస్త్రాదిగతియుద్ధసముదితప్రజ్ఞయు ఘనధృతిదాక్ష్యప్రగల్భతలును
దారుణయుక్తి యుత్సాహంబు నూర్జితదార్ఢ్యమూనక్లేశధైర్యమహిమ 152
సుభగప్రభావంబు శుచితయు మైత్రియుఁ ద్యాగసత్యములుఁ గృతజ్ఞతయును
నున్నతవంశంబు నుచితశీలతయును దమమును శమమును ధర్మరతియు

గీ. దయయు సత్యార్జవములు మార్దవము ననఁగ
నాదిగాఁ గల పరమకల్యాణగుణము

లొప్ప నొప్పగు భూనాథుకొప్పిసంబు
లక్ష్యమైయుండు లక్ష్మీకటాక్షములకు. 153

చ. పరిగతసర్వశాస్త్రుఁడయి భాసురశాస్త్రపథానుసారియై
యరయ వినీతిసమ్మతనిజాత్మకుఁడై గతదండనీతియైఁ
బరఁగు నిజప్రజానియమబంధురుఁడైన మహీశుసంపద
శరనిధిఁ బొందు పెన్నదులచాడ్పునఁ గ్రమ్మఱనేర దెన్నఁడున్. 154

సీ. వాగ్మి ప్రగల్భుఁ డవంచితస్మృతియు నుదగ్రుండు నుగ్రబలాధికుండు
దండనయక్రియాదక్షుండు కృతవిద్యుఁ డధికస్వవర్గుండు నమితబుద్ధి
అహితాభియోగప్రహసనుండు సర్వదుష్టప్రతీకారవిచక్షణుండు
శత్రురంధ్రానువీక్షణకళానిపుణుండు సంధివిగ్రహతత్త్వసారవేది

గీ. గూఢమంత్రప్రచారుండు రూఢదేశ
కాలభేదకుఁ డర్థసంగ్రహవిదుండు
నుచితపాత్రజ్ఞుఁడును వినియోగరతుఁడు
నైనభూపతి యాత్మగుణాకరుండు. 155

మ. భయలోభానృతమత్సరత్వములు కోపం బీర్ష్యయుం ద్రోహమున్
బ్రియమున్ జాపలమున్ బరాపకృతి యుద్రేకంబులున్ జాడ్యమా
స్థయుఁ బైశున్యములున్ దొఱంగి ప్రియవాక్సంపన్నుఁడై వృద్ధసే
వయునుం గల్గినవాఁడు దాను నరదేవప్రాప్తి కర్హుం డగున్. 156

సీ. విన నిచ్చగించుట వేడ్కతో వినుటయుఁ బన్నుగా విన్నవి పట్టుటయును
దగఁ బట్టునవి ధ్రువంబుగ నిల్పుటయు నర్థసమితిసాధ్యాసాధనముల మెఱుక
అర్థవిజ్ఞానసమర్థమహోద్యోగరతియు నయుక్తవిరక్తతయునుఁ
గార్యస్వరూపంబు కడఁకతోఁ గైకొంట యవి బుద్ధిగుణములై యెంచఁ దనరు

ఆ.వె. విహితకోపశౌర్యవీతజాడ్యము శీఘ్రకారితలు దలంపఁగా ధరిత్రి
నొప్పుగలిగినట్టియుత్సాహమీగుణా, యుక్తుఁడైనవాఁడె యవనివిభుఁడు. 157

సీ. గురువులఁ బ్రణమితపరభక్తియుక్తుల సద్భావచేష్టల సజ్జనులను
సుకృతకర్మంబుల సురల భూసురలను మృదులమనోవృత్తి మిత్రజనుల

బాంధవజనుల సంభ్రమచేష్టితంబులఁ గామినీజనములఁ బ్రేమములను
దాసజనంబులఁ దగుప్రసాదంబుల నితరుల దాక్షిణ్యచతురవృత్తి

గీ. నాత్మవశ్యులఁ గావించి యన్యకర్మ, నిందసేయక సత్కర్మనిష్ఠఁ దగుచుఁ
జారుకారుణికత్వము సర్వలోక, మధురవాక్యము గలవాఁడు మనుజవిభుఁడు. 158

—కామందకము

క. గురులను గులవృద్ధుల భూ, సురుల ననాథులను బుధులఁ జుట్టంబుల నా
తురులను దీనులఁ గరుణా, పరుఁడై రక్షింపవలయుఁ బార్థివుఁ డర్థిన్. 159

—పురుషార్థసారము

క. కలిమియె చూపుచు నొరులకు, ఫలియింపనిరాజసంబు పనియేమిటికిన్
ములకేలఁ బూచిరాజన, మలవడఁ గొఱమాలినట్లు యాభళకండా. 160

—పదీయము

క. ప్రథమపతు లర్థు లర్థం బడిగిన నది నృపులు కయ్యమడిగినఁ గడుఁ గీ
డ్వడి భయభీతులు శరణం, బడిగిన నిచ్చుటయె ధర్మమనిరి మునీంద్రుల్. 161

—పురుషార్థసారము

క. ఎంతెంత గలుగు రాష్ట్రం, బంతంతియ రాజు పెద్ద యగుఁ గావున చే
శాంతరము లొత్తికొనుట ని, తాంతము ధర్మంబు గాదె ధరణీశునకున్. 162

— నీతిసారము

క. దురమున మరలక యునికియుఁ
బరఁగఁగ ధర్మమున బ్రజలఁ బాలించుటయున్
ధరణీసురశుశ్రూషయుఁ
బరమశ్రేయస్కరములు పార్థివుల కిలన్. 163

క. క్షితిపతిగేహ మభేద్యో, న్నతిమత్ప్రాకారయుతము నానాశస్త్రో
ద్యతకరశౌర్యోత్కరభట, తతియుతసతతాభిరక్షితము గావలయున్. 164

క. ఆకారేంగితవిదులును, లోకజ్ఞులును నవసరజ్ఞులును నవగతతం
త్రాకులు లగుఫణిహారులు, వాకిట నుండంగవలయు వసుధేశునకున్. 165

క. పిలువక నగరు సొరంగను, వలవదు నిచ్చలును వచ్చువారి సదాభ్య
స్థులనైన బిట్టు సొరనీ, వలవ దనవసరమునందు వాఁకిటికాఁపుల్. 166
—పురుషార్థసారము

క. కొలు వీఁదగువేళయె లో, నిలుపందగు నవసరంబు నియమింపక రా
జిలు వెడలమి ప్రజ విన్నప. ముల లేకున్నను నశించిపోవును దానున్.167
—నీతిసారము

క. పలయునమాత్యులు చుట్టం, బులు మూలబలంబు రాజపుత్త్రులు విద్వాం
సులు బలసియుండ నిచ్చలు,కొలువుండుదె లోకమెల్లఁ గొలుపఁగనిన్నున్.168
—సభాపర్వము

క. కొలు విమ్ము మాపకడ యో, ధుల కెల్లను సంధ్యయొద్ద దూతలనుం జా
రుల సంభావింపుము రా, త్రులఁ గాంతాభోగతత్పరుఁడ వగుము నృపా.169
—ధృతరాష్ట్రనీతి

గీ. వెనుకవెన నిల్చి కామినీవితతి గొల్వ. దక్షిణంబున సుకవివితాన మమర
వామదిశయందుఁ బొగడెడిపందిజనులు,నెదురు గాయకగేయంబు లింపుఁబెంప.
—ముద్రామాత్యము

క. పరిజనులు సుమతు లైనను, ధరణీశుఁడు కుమతి యయ్యుఁ దాప యయిచనున్
బరిజనులు కుమతులైనను, ధరణీశుఁడు సుమతి యైనఁ దా వెలయఁ డిలన్.
—పంచతంత్రి

క. క్షితిజనులకుఁ బరిజనులకు, సతతము ప్రెగ్గడనె చూపఁ జనదు ధరిత్రీ
పతి ప్రెగ్గడయై ప్రెగ్గడఁ, బ్రతిహస్తునిఁ జేయవలయు బద్దెనరేంద్రా. 172

క. ధనధాన్యవాహనములెడఁ, జన వీఁదగుఁగాని యెట్టిచనవరి కైనన్
వనితలయెడ భూప్రజయెడఁ, జనవిచ్చుట బుద్ధిగాదు జనపాలునకున్. 173

క. నృపరాజ్యాంగములం దొక, విపరీతాంగంబ రాజ్యవిభవముఁ జెఱుచున్
నృపమంత్రులకును భేదము, చపలస్థితినొదవ సకలజగముం బొలియున్.174
—బద్దెననీతి

క. సమబలుఁడును సర్వజ్ఞుఁడు, సమరాజ్యసమన్వితుండు సదృశోద్యముఁడున్
సమధనుఁ డైనఁటుం బతి. సమయింపండేని తాన సమయు నతనిచేన్ 175

—పంచతంత్రి

క. బలవంతము సామంతుల, బలముల కగ్గలము గలనృపాలున కొప్పున్
బలిమి పెఱకుమతి కాజ్ఞా, బలసంపద కెంతదవ్వు బద్దెనరేంద్రా. 176

—బద్దెననీతి

క. పలువురిఁ బంపనొకో న, స్నెమిట నలుగునొకో యంచు నెప్పుడుఁ దనయా
జ్ఞాపహిమ కులుకుచును మది, సామంతులు గలిగిరేని జనపాలుఁ డగున్. 177

ఉ. రాజులసమ్మతిం బరతరంబుల ప్రాఁతల భక్తియుక్తులన్
రాజితశస్త్రధారులఁ బరాక్రమవంతుల నప్రమత్తులన్
భోజనహేమవస్త్రపరిపుష్టుల హృష్టుల నైనవారిఁగా
నోజ నొనర్పఁగా వలయు నొద్దను బాయక యుండ భృత్యులన్. 178

ఉ. చేరఁగనీరు మున్ను దమచే మృతిఁ బొందినవారివారి ము
న్నీరస మెత్తి మన్కికొఱకిష్టతఁ దాల్చినవారి బన్నముల్
కూరఁగఁబడ్డవారిఁ దమకుం గడుభక్తులు గానివారి ఘో
రాకులదిక్కువారి ననయజ్ఞు లనందగువారిఁ బార్థివుల్. 179

క. అదఁవగలంతియ జూనసి, యొడలంటుట వైద్య మొద్ద నుండుట తనకుం
గుడువంగఁ బెట్టుట యనుపను, లడరఁగ నాప్తులనె పంచు నధిపతి సుమతీ. 180

—పురుషార్థసారము

గీ. ఎవ్వఁడభ్యంతరస్థుల నెడలుచేసి. మిగుల లాతులఁ జేరంగఁ దిగుచుఁదగిలి
వాఁడు వారలచేఁ జెడు వలను దప్పి. యలుక గృధ్రముఁ డనురాజునట్ల
పొలియు. 181

ఆ వె. వినికొఱకుఁ గాదె తివిరివంశజులైన, నేలికొండ్రు రాజు లేల యనిన
మానుగాఁగ నాదిమధ్యావసానముల్, వార లొక్కరీతివారు గాన. 182

ఆ వె. పెద్దఁదొడ్డ సుండ నేపార సితపక్ష
చంద్రకళయుఁబోలె సంతతంబు
వెలయ రాజ్యలక్ష్మి వృద్ధిఁ బొందుచునుండు
నతఁడ [మంత్రివర్యుఁ]డవనిపునకు. 183

—పంచతంత్రి

క. ఆయతపతి నుతసప్తో, పాయంబులు దెలియవలయుఁ బతి సామము భే
దాయతి దానము దండము, మాయోపేక్షేంద్రజాలమార్గము లెల్లన్. 184
—కుమారసంభవము

క. భువి నాన్వీక్షికి మిళితా, ర్థవిదుండై దండనీతిఁ ద్రయి యనువిద్యం
బ్రవణుఁడయి వార్త లోక, వ్యవహారము సూచి యెఱుఁగవలయుం బతికిన్.
—పురుషార్థసారము

గీ. రాజు వారక సకలపరిరక్షణంబు, సేయకుండిన లోకము జీవశవము
అట్టిజగదేకరక్షణ మాచరించు, మానవేంద్రుఁ డనన్యసామాన్యుఁ డరయ.
—కామందకము

క. విద్యాచతుష్టయం బన, వద్యచతుర్వర్గఫలము వసుధేశునకున్
హృద్యచతుష్షష్టికళా, విద్యలు రాజ్యోపభోగవిహితఫలంబుల్. 187
—పురుషార్థసారము

క. నరనాయకుండు మధుకర, పరభృతకలహంసబర్హి పన్నగబకసూ
కరకంకసముత్కరముల, చరితంబులఁ దెలియవలయు జనసుతచరితా. 188
—మార్కండేయము

గీ. వ్యయము నార్జవంబు దయయు హింసయు బొంకు
నిజముఁ దియ్యఁదనము నిష్ఠురంబుఁ
బలుపు శిష్టజనులు గలిగి యాపయఁ బణ్య
రమణివోలె నుండు రాజనీతి 189
—పంచతంత్రి

క. ఎందును నాయాసమునకుఁ, బందయయినవాఁడు సిరికిఁ బాత్రుం డగునే
మందరగిరి మోవఁడె గో, విందుఁడు మును లచ్చికొఱకు విబుధు లెఱుంగన్.
—నీతిభూషణము

క. బలిమియుఁ గలిమియుఁ గలిగిన, నలఘుమతి తెగువవలయు నవనీశునకున్
దలపోసి చూడవలదా, బలవాచాప్పృథివి భూమిపాలుర కెల్లన్. 191

క. వసుధాధీశుఁడు దురయ, గసమున చెడి ఖడ్గముడుగఁ గార్యము సేయుఁ దా
విసుగు సిరి వీరభోజ్యా, వసుంధరా యను పురాణవచనము వినవే. 192
—చాటువు

క. అపరాధులయందును శాం
తపరత్వము మఱియు వలయుతెఱఁ గది యేలా
నృపులకు నలవడఁదగ దను
కృప కృపాయో దానఁ దొంటికీర్తియుఁ జెడదే. 193

ఆ.వె. కీడు సేయువానికిని మేలు సేయుట, మునులగుణము గాక జనుల నెల్లఁ
బ్రోచువాఁడు కల్లరుల నాజ్ఞపెట్టుట, యాగపశువిశసనమట్లు గాదె. 194

గీ. రాజ్యకంటకతతిలోన రాజవిభుఁడు
బాలముఖ్యుని వధియించి శాంతిపఱచి
సామదానంబు లొనరించి సత్వరముగ
ఛిద్ర మంతయుఁ బరిపూర్తి సేయవలయు. 195

—నీతిసారము

సీ. కన్నగాండ్రును జూదగాండ్రు తెక్కలికాండ్రు నాటవికులు [పొలవరులు] తగవు
చెప్పెడిపురుషులు నప్పిచ్చుచో వడ్డి యడరునఁ గొని నొంచు నాడితరులును
జనటాయగాండ్రునుఁ జనవరి లెంకలు రాష్ట్రకంటకులు వీరల నృపాలుఁ
డెఱుఁగు మాన్పక సాగనిచ్చినఁ గన్నంబు వెట్టియుఁ గల్లలఁ బెనిచి తెరువు

గీ. అడచియును బక్షమాడియు నప్పువోర
ద్రుంచి చనియు నల్పుల నదలించి తినియు
లంచములు గొన్న ధర యెల్లఁ బాడు గాదె
క్లేశసంసారభవనాశ కేశవేశ. 196

—మదీయము

క. వీ డని విం దని దా గని, యోడక లంచంబు లనియు నుచితం బని చెం
దాడిన చనవరిచే నిల, పా డగుఁ బ్రజవిన్నపంబు పతి వినకున్నన్. 197

—పురుషార్థసారము

క. న్యాయంబు దొడరి వివిధో, పాయంబుల నర్థముల నుపార్జింపుము ఘూ
నాయక రాజ్యవిఘాతము, సేయునరుల నెఱిఁగి చంపఁ జెలువఁగవలయున్.

—ధృతరాష్ట్రనీతి

గీ. మాలకారి పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి
పువ్వుఁదేనియఁ గ్రోలెడుపోల్కి నెదురు
గఁదకుండఁ గైకొనునది కార్యఫలము
బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁజనదు. 199

—విదురనీతి

క. పెక్కండ్రు జనులు నేరమి, యొక్కటఁ జేసినను వారి నొకమఱిఁ గినియం
జిక్కరు గావున నేర్పున, నొక్కొకరిని పాపి శిక్ష యొనరింపఁదగున్. 200

—నీతిసారము

గీ. పతి యథావిధి దండసంపన్నుఁడైన, వెసఁ ద్రివర్గఫలంబును వృద్ధిఁ బొందుఁ
గాక యున్మార్గదండనకర్కశమున, మునుల కైనను గోపంబు మొలవకున్నె.

—కామందకము

మ. స్థవిరుం డైనను బాలిశాత్ముఁ డయినన్ స్వర్గస్థుఁడైన న్మహీ
ధవుఁ డాత్మోద్భవహీనుఁ డయిన మతిమాంద్యం బొందినన్ భూమికిన్
ధవుఁ డై యుండి తనర్చినం జెడు సముద్యద్రాజ్యసంపత్తి వై
భవ మేకక్షణమాత్రమంద సచివప్రాధాన్యహస్తస్థితిన్. 202

—ముద్రామాత్యము

క. జనపదములెల్ల మంత్రికిఁ, జనరామింజేసి నృపతి సచివులఁ బోలెన్
వినుతగుణాఢ్యుల దేశం, బున కధికారులుగఁ జేసి పుచ్చఁగవలయున్. 203

—నీతిసారము

సీ. ఎవ్వఁ డేపనిపెంట నేరీతి నేర్పరి, వాని నియోగింప వలయు నంద
హితుఁడు విశ్వాసియు మతిమంతుఁడును నగు
విప్రు సమాత్యుఁ గావింపవలయు
శక్తియుక్తులు గల్గుసద్భటావళిచేత, నంగసంరక్ష సేయంగవలయుఁ
బ్రజఁ దల్లి పాటించుపగిది భూజనముల, ననుదినంబును దాన యరయవలయు

గీ. నర్థ మార్జింప నోపిన యట్టివారి
నాజిశూరుల నీతిజ్ఞులైనవారిఁ
బాపరహితుల హాలికబంధుజనుల
నరసి ప్రోవంగవలయుఁ దా నవనివిభుఁడు. 204

—పద్మపురాణము

క. ధనలుబ్ధుల ముచ్చులఁ గూ, ర్పనివారిని బగఱవలనివారిని ధృతి సా
లనివారిని దుర్జనులను, బనుపవు గా రాజకార్యభారము దాల్పన్. 205

క. ఉపధాశుద్ధుఁ బాప, వ్యపగతబుద్ధుల వినీతివర్తుల సములన్
సుపరీక్ష నియోగించితె, నిపుణుల నర్థార్జనాదినృపకార్యములన్. 206

క. చోరభయవర్జితంబుగ, ధారుణి రక్షింతె యధికధనలోభమునన్
జోరుల రక్షింపరు గా, వారలచే ధనము గొని భవద్భృత్యవరుల్. 207

—సభాపర్వము

క. అధిపతి యెవ్వనిఁ దోరపుటధికారము మీఁదఁ బెట్టు నతఁ డుర్వరలో
నధముకులజాతుఁ డైనను, నధికుం డగు సుతుల కెల్ల నాకర మగుచున్. 208

క. శిష్టైననృపతి పరిజన, శిష్టతచే సేవ్యుఁ డవును శిష్టుం డయ్యున్
దుష్టపరిజనము గూడినఁ, గష్టుం డగు సర్పకలితఘనశాఖిగతిన్. 209

ఆ.వె. అధికుఁ డైనవాని నతినీచతర మైన, యట్టిపదవిఁ దెచ్చిపెట్టు టెల్ల
వర్ణనీయ మైన వరశిరోరత్నంబు, కాలఁ గట్టినట్లు కాదె తలఁప. 210

చ. తగనిపదంబునం దిడునదక్షత రాజున కుండుఁ గాక యా
జగమున నీతిమంతుఁ డనఁ జాలిన సేవకుఁ డుండకుండునే
తగరముమీఁదఁ దెచ్చి నిరతం బగురత్నముఁ గీలుకొల్పఁగా
వగచునె రత్న మట్టిపనివానిది దోషము గాక యారయన్. 211

ఆ.వె. ఎచటనుండి లేఖ యేతెంచెనేని య, నాదరంబు సేయు టనుచితంబు
సంధివిగ్రహాదిసకలకార్యంబులు, తెలియు టెల్ల లేఖవలనఁ గాదె. 212

క. ద్వారములను నాయుధహాయ, వారణనిలయములయందు వసుతంత్రవ్యా
పారములందును హితులను, ధారకులను నిపుణమతులఁ బనిగొనవలయున్. 213

—పంచతంత్రి

క. మండలమె యుర్విపతులకు, భండారం బందుఁ దప్పి పాతిక గొనినన్
భండాగారద్రోహుని, దండించినయట్ల పఱపఁదగు నధికారిన్. 214

—పురుషార్థసారము

సీ. పరదేశి ధన మబ్బఁ జాఱిపోవఁగఁజూచు విప్రుండు ధన మీఁదు వెరవు లేమి
క్షత్రియుఁ గోపింప ఖడ్గముఁ జూపుఁ జుట్టముఁ జనవరియునోడరు భజింప
చెలి రా జనఁగ నాజ్ఞ నిలువఁడు కడుఁజిర సేవకుండును దప్పు సేయుఁ దఱచు
పిసిఁడియర్థము రాతిపెడనార యుపకారి పూర్వోపకృతియు చూపుచు నటించు

ఆ.వె. మూర్ఖు నరకపాత్రముగ ననర్థముఁజేయు, దుష్టు సేయు నెల్ల దురితములును
గాన నిట్టివిధము మానవులకు నధిప, దార మీగి వెరవుకలిమి గాదు. 215

చ. వెలువడు గ్రేడిబట్టగను వేగమె తోడనె పుట్టు వైరమున్
జలమును లోభమున్ వడియు జాడ్యము దంటలు రెంటమాటలున్
బొలుచరిగొంటుచందములు బొంకులు అంకెలు వట్టిఱిచ్చులున్
పలుకలు వృష్టితోపులును మర్మము లెన్నుచుఁ దప్పులాడుటల్. 216

—నీతిసారము

క. ధారుణిపతి దనప్రజఁ డా, నారయ కొంపఁ బంచెనేని యర్థము దనకున్
జేరదు ప్రజరిత్తయ చెడు, నారయ నధికారి తనకు నగ్గలికుఁ డగున్. 217

—పురుషార్థసారము

సీ. సొమ్ము రాజులు గొన్న సుంక మెక్కించినఁ బరదేశిసరకులు సొరకు మనుట
వణిజులు దమయంత వలసిన ధారణ సేయఁ జూచుట ప్రజఁ జెఱిచికొనుట
తులలు తూములు పాటి నిలువక సాగంగ నిచ్చుట ప్రముచ్చిమికియ్యకొనుట
కల్ల దులాయించి మొల్లంబు వెడసూఱగొనఁగ మాన్పమి దాన కొనక చెడుట

ఆ.వె. కాన నృపతిలోభి గాక పేదలఁ బ్రోచు, తలఁపు గలిగి బేలుఁదనము విడిచి
తగనివారియందు దాక్షిణ్య మొల్లక, యరయవలయు గూఢచరులవలన. 218

ఆ.వె. ఒకఁడు గొన్నసరకు లొకచాయ నెక్కిన, నెక్కుటెల్ల రాజు లెఱిఁగికొనిన
కొంచెమైనవెలకుఁ గొన్నవస్తువులను, గొన్నవెలయెయిచ్చికొనఁగఁదగును.219

క. చనవరులు నాయగాండ్రును, బెనచినఁ జెడకున్నయట్టి బేహారంబుల్
వినికిఁ గలరాజు వారలఁ, బెనుపక యుండంగ నాజ్ఞ పెట్టఁగవలయున్. 220

క. దాయల బంట్లం జోరుల, రోయుచుఁ దృష్టేంగితము లెఱుంగుచు ఘనులై
రేయునుబగలుఁ దలారులు, పాయక తిరుగంగవలయుఁ బట్టణమెల్లన్. 221

ఆ.వె. ఎంత వొదలియున్న నేరండములు జీలుఁ, గులును దారుకృత్యములకు నగునె
యితరు లెందరైన నేలిక కధికులై. చేయుపనులు పూని చేయఁగలరె. 222

ఉ. చాల నభీష్టముల్ దనవశంబుగఁ జేయు నయోగ్యులైన నె
మ్మేలు దలంచి వారియెడ మిక్కిలియక్కలి సేఁత నేర్పగున్
గాలపువేఁటకాఁడు ఝషకాంక్షఁ గదా యుదకంబుమీఁదటన్
వేయుచు బెండుపై నిలుపు దృష్టియుఁ జిత్తము నాదరంబునన్. 123

—నీతిసారము

క. హాలికులఁ బరివారము నె, గ్గులుపఱపక తగినపడి గొని నడపికొనం
గలపని జేఁయు తనభూమిం, గలుగుట యది పసిఁడిపేర్పు కలిమి నృపతికిన్. 224

క. హీనులకుం గర్షకులకు, భూనుత ధాన్యంబు బీజమును వణిజులకున్
మానుగ శతైకవృద్ధి న, నూనముగా ఋణములిత్తె యుత్తమబుద్ధిన్. 225

గీ. సరిగి పరవంక్తిఁ బొందిన నరుల నోలి
భీతచిత్తుల నవమానపీడితులను
అభయ మిచ్చియు నీఁదగునర్థ మిడియుఁ
బ్రియముఁ బల్కియుఁ దగ నాదరింపవలయు. 226

—సభాపర్వము

క. సమయముల రంతు పరివా, రము పత్తు నియోగిజనుల రాయిడి యరిభ్రము
ప్పిమి గ్రేణికారయన్యా, యము లేకుండంగఁ బ్రజల నరయఁగవలయున్. 227

—నీతిభూషణము

క. పరికింప నీతిమార్గము, నరపతులకు నిదియె బహుజనద్వేషముగా
బొరకొనియెడు లాభంబులు, పరిహరణీయంబు లండ్రు బద్దెనరేంద్రా. 228

—బద్దెననీతి

క. ఈ విధమున నీతికళా, కోవిదుఁ డగుచున్న రాజకుంజరుఁ డాయుః
శ్రీవిజయకీర్తిలక్ష్మల, చే వెలయును రిపులచేతఁ జెడఁ డెన్నఁటికిన్. 229

—మదీయము

## రాజునకుఁ గొఱగాని గుణములు

క. కొండియములు విన్నపములు, దండువ యర్థార్జనంబు తరుణులె భృత్యుల్
మండుప నునికియె లావుగ, నుండెడిభూవిభుఁడు ప్రజకు నుత్పాత మిలన్. 230

క. పరదోషకథ వినోదము, పరపీడోత్పాదనంబు బలిమి పరస్త్రీ
హరణమె సుఖముగ మనుపతి, పరమోత్పాతంబు ప్రజకు బద్దెనరేంద్రా. 231
—బద్దెననీతి

ఆ.వె. ఎవ్వరైన దోష మేమి చేసిన నొప్ప, భూవరునకుఁ జెప్పఁ బోలుఁగాక
యోజఁ దక్కిపోయి రాజట్ల చేసిన, కోరి చెప్పఁగలదె యేరికైన. 232

క. ఇలఁ గఠినంబులు విషమం, బులు గంటకమార్గసహితములునై యొగి ని
మ్ములఁ జెందరాక పర్వత, ములపోలిక నుండుఁ గష్టభూపతులు మతుల్. 233
—పంచతంత్రి

సీ. అద్భుతాచరణంబు నమితోపకారము బొందియు నితరునిపోల్కి నుండు
నతఁ డొనరించిన యతులితకృత్యంబు పరులకృత్యం బని పలుకుచుండు
నరులపైఁ బెట్టు లయంబు నొందఁగఁ గోరుఁ బరఁగ నాసలు చూపి పనులఁ బంపు
సిద్ధికి విఘ్నంబు సేయును బిమ్మట విఘ్నంబు ఁగుటను వెరవు దెగడు

గీ. నమితమధురోక్తియైన నర్థాంతరమున, ఁ స్ఫుటంబుగ రూపించి నిర్వహింపఁ
గపటకోపముఁ జూపుఁ దత్కార్యవశత, నెఱిఁ బ్రసన్నత నొందని నృపవరుండు.

ఉ. జీతము గోరి విన్నపముఁ జేసిన లేచి తొలంగిపోవు న
త్యాతతవృత్తి నొందువల నడపు సేయుచు నిల్లువెళ్లఁ ద
ట్భీతి దొలంగనీఁడు సనుచెంచినదోషము లెన్ను నెన్ని య
జ్జీతము మాన్చు మాన్చి మఱి చేరుట చెట్టఁగఁ జేయు నెమ్మెయిన్. 235

క. సరసప్రసంగవేళను, విరసారోపణము సేయు విరసాత్మకుఁడై
పరఁగ సభామధ్యమునను, నిరసించు నడంచు దుర్వినీతుం డగుచున్. 236

క. కులమును శీలము వృత్తము, గలవారల వీడఁ బల్కఁగా నాతనివా
రలుకమెయి విడుతు రొండెన్, బొలియింతురు మానధనము పొలియుటకతనన్.

క. కడుబెట్టిదమున నెప్పుడు, వడిపెట్టుచు వెట్టిగొనుచు వధియింపంగాఁ
బుడమిజను లతని విడుతురు, విడువఁగరాకున్న జనులు విడుతురు సూడన్.

గీ. తల్లి ప్రజలఁ దిన్న దైవంబు దొంగైన, వార్ధి మేర దప్పి వచ్చెనైనఁ
దప్పిదారి బ్రతుకఁ దలఁపుగుఁ గ్రూరుఁడై, రాజు సెఱుప బ్రతుకరాదు గాని.
—కామందకము

సీ. కొనుచోట నిచ్చుచో గుజగుజసేయుచుఁ బ్రజల నెల్లను తేమిపాలు చేసి
తమ కంచు వాదించి ధారలైనను బోసి ధనము లిడక యర్థితతులఁ గుదిచి
యెడఁబాటు సగమైన నిడక కత్తుక కూరి చంపుచు నాశ్రితజనుల నడఁచి
తేనెలోపలిగూట తెఱఁగునఁ బథ్యంబు పలికి లోనైనవారల నడంచి

ఆ.వె. ధర్మ ముడిఁగి కీర్తిపేర్మియు నొల్లక, పొసఁగఁ బనులు విడిచిబొంకుపల్కి
తానబ్రతుకఁ గోరుధరణీశుకంటె సు, త్పాత మొకటి వేఱె ధరకుఁ గలదె. 240

సీ. జీతంబు గిలిబిలిచిలుకలు దూరంబు మహిఁ జూడ నది పొల్ల వ్రాత కల్ల
అపరాధములు కోటి నృపుఁ జంపఁ దనుపాటి మాన్యత వెడపెడమాట బొంకు
కోపంబు ముమ్మడి కోలాస నలుమడి సత్య మారజ మీగి జమలితొట్టు
ఆచార మెడఁదప్పు నాశ్రమ మట్టట్టు దొరతనం బది పూఁత దురము లేఁత

ఆ.వె. చరిత మెల్ల నింద్రజాలంబు తలఁ పెల్ల, నెల్లిదంబుమాట లెల్ల దంబ
మిట్టి కుమతిఁ గొలిచి యెవ్వాఁడు మననోపుఁ, జిరతరప్రకాశ శ్రీగిరీశ. 241

—శ్రీగిరిశతకము

సీ. ఎట్టకేలకుఁగాని యెదిరికి రానీఁడు, వచ్చినఁ జూడఁ డావంకయేనిఁ
జూచినముఖమునఁ జూపు వైరస్యంబు, నేమేనిపనిఁ జెప్ప నెడన మాఱ్చు
ఊరకైనను నుండు దూరఫలం బైన, నుత్తర మేనిచ్చు నూరకియ్యఁ
గొను నొంటుగాదేనిఁ జను లేచు దిగ్గన, చెప్పఁడు నేరమి చిన్న మైన

ఆ.వె. మేలు చేసెనేని మెచ్చక దోషంబు, లందుఁ గొన్ని గలుగ నావటించుఁ
గృతముకీడు లెన్నుఁ గృపలేనిభూవరుఁ, డదియెటింగి తొలఁగు టైనతెఱఁగు 242

—నీతిసారము

సీ. పగలేచిపెట్టు నాపదల నుపేక్షించు, మేలు చేసిన లేఁతగాలిఁ బుచ్చు
మిన్నక కోపించు మెచ్చెనేనియు నీయఁ, డడుగుచో విన్నప మాలి సేయుఁ
బని నాసగొల్పుఁ దత్ఫలసిద్ధిఁ దప్పించు, నిష్ఠురంబులుపల్కు నేర్పు దెగడు
మర్మంబులాడుఁ బ్రమాదంబు దొడరినఁ, బోనీడు నిక్కంబు బొంకుసేయు

ఆ.వె. మాట లాడనాడ మాన్పించు నడుమన, సెజ్జఁబట్టుఁ గొలువుఁ జేరినపుడు
పెడఁదనిద్రపోవు విరసచిత్తుం డైన, మానవేశ్వరుండు మంత్రిసోమ. 243

—చాటువు

క. భూపతికి మిత్రవర్గము, ప్రాపై నం గాక భూమిభరణము దలమే
యోపునె ఫణిపతియును ధర, మోపునకుం గూర్మకుధరములు లేకున్నన్. 244

ఉ. ఆపద కడ్డమై నిలుచు నర్థసతీజనులందు శుద్ధ మౌఁ
గోపమునం బ్రసాదమునఁ గుందక యుబ్బక నిల్వనేర్చుఁ దా
నేపను లైన రాజునకు నీ డయి తీర్పఁగ నోపుఁ గావునన్
దేవ సుహృజ్జనంబు జలధిక్రమరాజ్యమునందు రాజుకున్. 245

ఉ. భూపతి కెల్లసంపదలఁ బొందెడుచోట ససహ్యాభావమున్
జూపక కార్యభారమున స్రుక్కక విశ్రమవేళ యైన సే
వాపరుఁ డై మహోఘములు వచ్చుపనుల్ దొలగించి చెప్పిన
ట్లేపని యైనఁ జేయునతఁ డీప్సితదైవము గాక బంధుఁడే. 246

ఉ. వడ్డికి నీఁగొనందగదు వాదము సేయఁగలేదు వంచనన్
పెడ్డుచితంబు గాదు పరు వేఁడినయట్ల ధనంబు నెప్పుడున్
దొడ్డుగ నిమ్మనందగదు దోషము లెన్నుట నీతి గాదు పె
ల్లిడ్డనఁ గొండెముల్ వినుట లెగ్గగు మైత్రియ కోరెనేనియున్. 247

వ. అట్టియెడ. 248

క. సామంతుల కల్పాల్ప, గ్రామంబుల నిచ్చి పెద్దగ్రామంబులచే
భూమీశుఁడు చతురంగ, స్తోమము బండరువుఁ బ్రోవ దొరకొను శుభముల్. 249

—నీతిసారము

## అంగీకరించి విడుచుట

క. ఎట్టివిషవృక్షమును దాఁ, బెట్టినయది యగునే పిదపఁ బెఱుకఁ దలంపం
గట్టిఁడినరు లైనను చే, పట్టిన మఱి చెఱుపరాదు ప్రభువున కెందున్. 250

ఆ.వె. ఒకనిఁ దొలుత మిగుల నున్నతి కెక్కించి
యతనిఁ బిదపఁ జెఱుచు టనుచితంబు
వీఁక నెట్టిపాటి విషవృక్ష మైనను
దానె పెట్టి తానె తగునె చెఱుప. 251

క. మును నొక్కొ-రునిం గుణయుతుఁ, డని వానిన పిదప నొప్పఁడని దూషింపం
జనదు ప్రతిజ్ఞాభంగం, బునకు న్మది లోన వెఱచుఁ బుణ్యాత్మనకున్. 252

ఆ.వె. ఇచ్చ మెచ్చి మొదల నెంతయుఁ గొనియాడి
తివిరి పిదప వానిఁ దెగడఁగూడ
దట్టిచంద మైన నాతని విడనాడి
నను గృతఘ్నుఁ డందు రతఁడు గాఁడు. 252

—నీతిసారము

వ. ఇంక విషప్రయోగపరీక్షణంబునుఁ దన్మూలం బగుననయాత్మరక్షణ
శయ్యాసనవిహార పరీక్షావిధంబును నెట్టి దనిన. 254

క. పానాశనశయ్యాసన, యానాంబరభూషణాదు లగువస్తువులం
దూనినవిషప్రయోగము, భూనాథుఁడు దెలియవలయు బుద్ధిప్రౌఢిన్. 255

గీ. విషహారోదకమజ్జనవిమలమూర్తి, యఖిలవిషహరమణిభూషితాంగుఁ డగుచు
హితభిషగ్వ్రతుఁడై సుపరీక్షితాన్న, పానములు గొనవలయు భూపాలకుండు.

—కామందకము

## విషపరీక్షాలక్షణము

క. పంచవిధాహారంబులు, వంచన లే కాప్తులయినవారికి మునుఁ బె
ట్టించి యది వారలకు జీ, ర్ణించినఁ గుడుచునది ధారుణీపతి పిదపన్. 257

—పురుషార్థసారము

సీ. భుజగము విషమును బొడగాంచి గూయును, శుకభృంగరాజశారికలు వెఱచి
లలిఁ జకోరములకన్నులు విరాగము లగుఁ, గ్రౌంచంబు చాల మదించితిరుగు
విషదర్శనంబు గా వెసఁ జచ్చుఁ గోకిల, గ్లాని జీవంజీవకమున కొదవు
వీనిముఖంబున వెసఁ బరీక్షితములై, తనరిన యన్నము ల్గొనఁగవలయు

ఆ.వె. జనవిభుండు గడుఁ బృషన్మయూరావళి, తద్గృహంబునం దుదారలీల
విడువవలయుఁబెంచి వెస దానిఁబొడగన్నపాముఁ దనకుఁ దాన పఱచుఁగాన.

—కామందకము

చ. కొనగొని కొండ్రముచ్చులఁ జకోరములన్ శుకశారికావళిన్
బెనుతురు భూపతుల్ విషము పెట్టినయన్నముఁ జూచి యోలిఁ జ
య్యనవి పెంటిక ల్విడువ నక్షులు మూయఁగఁ గూయు చుండఁగాఁ
గని కుటిలప్రయోగములు గాంచుటకై నృపమంత్రిశేఖరా. 259

—చారుచర్య

క. అనుభావ్య మైనయన్నం, బనలమునకుఁ బక్షులకు సమంచితబుద్ధిన్
మును మిడి తచ్చిహ్నము, లొనరఁ బరీక్షింపవలయు సుచితక్రియలన్. 260

వ. అది యెట్లనిన.

క. నల్లనిపొగలును మంటలుఁ, బెల్లగుఁ జిటచిటలుఁ బుట్టుఁ బెద్దగు నగ్నిన్
ద్రెళ్లిపడి చచ్చుఁ బక్షులు, మొల్లంబగు నవ్విషాన్నమునఁ జిత్రముగన్. 261

సీ. నీరు గ్రమ్ముటయును నీరు దివుచుటయు, వడిఁ జల్లనవుట వివర్ణమగుట
విపులచిహ్నంబులు విషవిదగ్ధంబగు, నన్నమునకు నీలి యరయవలయు
కడుఁగాఁకతోడఁ బైఁ గ్రమ్మునల్లని నురు, గూరక శుష్కమౌఁ గూరగాయ
సంస్పర్శగంధరసంబులఁ జెడుచాయ మిక్కిలి యగునొండెఁ దక్కువగుచు

ఆ.వె. మండలంబుగాఁగ నొండొండబుగ్గలు, పొడమి ఫేనపటల మడరుచుండు
నూర్ధ్వగతము లగుచు నొనర రేఖలువాఱు,సకలవస్తువులు విషప్రయుక్తి. 262

గీ. రసముమీఁదట నీలవర్ణములు పాలఁ
దామ్రవర్ణము తోయమద్యములమీఁద
బికనిభంబులు శ్యామముల్ పెరుగుమీఁద
బొడముఁ బొడవగురేఖలు నడుమనుండి. 263

క. కడుమాడు చిముడు నుడుకుచు, నడగొను శ్యామాయమాన మగు నార్ద్రింబున్
గడుకొని శుష్కము లెల్లను, వడిఁ బ్రవిశీర్ణంబులై వివర్ణము నొందున్. 264

—కామందకము

క. పరుస నగు మృదులవస్తువులు, పరుసనివస్తువులు మృదులభావము చెందున్
ఉరువిడి విషదిగ్ధకమున, కర పరుదుగ నల్పజంతుపాతం బొదవున్. 265

క. కేవలవాత్యాహతమును, భూవిభుఁ డన్యప్రభేదమును నాతురమున్
నావికపరీక్ష లేకయె, నావఁ గరం బెక్కఁ జనదు నయమార్గమునన్. 276

క. జనపతికి గ్రీష్మదినముల, జనశోధితనక్రమీనజాతాంతర మై
ఘనతటలేఖాస్థితహిత, జనచంక్రమణ మగుజలము నను విహరింపన్. 277

క. గహనములు విడిచి శోధిత, బహిరుద్యానములలో నృపాలకుఁడు వయో
విహితసుఖభోగలీలను, విహరింపఁగవలయు సమదవిమలాత్మకుఁడై. 278

క. మృగయోచితవనభూమిని, మృగయాగతి లక్ష్యసిద్ధి మెయికొనుకొఱకై
జగతీపతి సువినీతము, లగుహయములు జాడలాగ నరుగఁగవలయున్. 279

సీ. తల్లిఁ జేరఁగఁ బోవుతఱి నైన భూపతి, భవనశోధన మొనర్పంగవలయు
నెక్కడి కేఁగిన హితు లైనయాయుధహస్తులు చుట్టురా నరుగవలయు
సంకటగహనభూస్థలి నిల్వఁ బోలదు ధూళి సల్లెడు పెనుగాలి నయిన
విపులధారాసారవృష్టి నత్యాతప, ఘోరాహమున నంధకారరాత్రి

గీ. స్వస్థుఁడై యుండి యెఱుగంగఁ జనదు మఱియు
నిర్గమంబుఁ బ్రవేశంబు నియతమేని
రాజపథమున జనులఁ జేరంగనీక
యధిపుఁ డావిష్కృతోన్నతి నరుగవలయు. 280

—కామందకము

క. జనలక్ష్మికి ధనలక్ష్మికి, నసుపమ మగుధర్మలక్ష్మి కాత్మయు మూలం
బని యాత్మరక్ష మఱవక, జననాథుఁడు సేయవలయు సతతము ప్రీతిన్. 281

క. ఏపున యాత్రోత్సవములఁ, బైపడి భూజనులు దట్టపడి యేవేళం
భూపాలుఁ డంచు సరగున, నోపియుఁ బైఁబడఁగవల దయు త్తంబైనన్. 282

సీ. కంచుకోష్ణీషముల్ గలవర్షధరకుబ్జ, కైరాతవామనుల్ చేరి కొలువ
సముచితమ్ముగను రాజన్యుఁ డంతఃపురో, ర్వీతలంబున విహరింపవలయు
విత్తజ్ఞులును శుద్ధచిత్తులు నగునట్టి, సచివు లింపుగ నరేశ్వరునిఁ జేరి
శస్త్రాగ్నివిషవివర్జనముగ నొయ్యన, నర్మవాక్యమ్ము లొనర్పవలయు

ఆ.వె. సంతిపురములోన నధిపతి యున్నప్పు, డచటఁ బాయకుండు నాత్మసైన్య
మతనిఁ జేరి మిగుల నాయితమై నిల్చి, చెలఁగి రక్షణంబు సేయవలయు. 283

క. పసబడి యేండ్లపురుషులున్, దనరఁగ నేఁబదులసతులు తనగృహజనులం
దనిశము నవరోధవధూ, జనచిత్తము లరయవలయు జనపతి నగరన్. 284

గీ. లలితమంజులమంగలాంగలతలు వెలుఁగ
సూక్ష్మవస్త్రాభరణమాల్యసుభగ మూర్తు
లగుచు వారాంగనలు మన్మథాస్త్రలీల
బలసి కొలువంగవలయు భూపాలమదను. 285

సీ. జటిలకుబ్జకిరాతమండజనులసంసర్గము, బాహ్యదాసీజనబాంధవంబుఁ
జేర నంతఃపరిచారజనంబుల, కొదవక యుండంగఁ బదిలపఱచి
వెడలెడునప్పుడు వెసఁ జొచ్చునప్పుడుఁ, దనర నాభ్యంతరజనము లెపుడు
బ్రవ్యముం బనియుఁ దద్ద్వారపాలకులతో నెమ్మి నెఱింగింప నియతి నేసి

గీ. యంత్యకాలపుయాతురుఁడైనయతనిఁ
బెక్కు ననుజీవి శుభము కాఁ దలఁప వలయు
సర్వజనులకు నాతుఁడజనుఁడ గురుఁడు
మిక్కి లనువల్కు భూపతి దలఁపవలయు. 286

ఉ. స్నానవిలేపనాభరణచారుసముజ్జ్వలగాత్రుఁడై శుభ
స్నానము నాత్మదత్తవసనస్ఫుటమూర్తియు నైనదేవులన్
స్థానము చేర్చి వారి సదనంబుల కేగక చేయుచు న్నిజా
ధీనమనస్కుఁడై సతుల తీవ్రులు నమ్మక యున్కి యొప్పగున్. 287

సీ. భద్రసేనుఁడు నిజపత్ని యింటికిఁ జన నతనితోఁబుట్టువ యతనిఁ దునిమెఁ
దల్లిమంచముక్రింద నల్లన యడఁగి తాఁ, బుత్త్రిండ కారూషుఁ బొడవడంచె
లాజలు విషమున నోజించి తేనియ, యని కాశిరాజుఁ దద్వనిత యడఁచె
గరిడా కమేఖలాఘనమణి సౌవీర, భూపు వైరంత్య నూపురముచేత
జాతుషీశస్త్రంబు జడయందు విడుకొని, రమణియొక్కత విదూరథునిఁ జంపు

గీ. ఱెఱిఁగి నమ్మక సతియింటి కేగఁజనదు
    కెరలి శత్రుఁడవయిఁ బ్రయోగింప వలయు.
    .............................. 288
    ——కామందకము

క. కైటభరిపునకు సురవర కోటీరతటాగ్రరత్నకుట్టిమకురువిం
    దాటోపకిరణరంజిత, పాటలితవిరాజమానపదపద్మునకున్. 289

గద్యము. ఇది శ్రీనరసింహప్రసాదలబ్ధకవితావిలాసభారద్వాజసగోత్రాయ్యలార్య పుత్ర సరసగుణధుర్య సింగనార్యప్రణీతం బైన సకలనీతిసమ్మతం బను ప్రబంధంబునందుఁ గవిత్వగుణవిశేషంబును, నీతిశాస్త్రప్రశంసయు, రాజ్యాంగప్రధానం బైన దుర్గరక్షణంబును, రాజునకవశ్యకర్తవ్యం బగు నాజ్ఞాపాలనంబును, బ్రజాపాలననియమంబును, రాజగుణావగుణవిశేషంబును, దద్బంధువివరణంబును, నంగీకృతపరిత్యాగంబును, విషప్రయోగపరీక్షణంబును, దన్మూలం బైన యాత్మరక్షాశయ్యావిహారాదిపరీక్షావిధంబును నన్నది ప్రథమాశ్వాసము.

శ్రీ

# సకలనీతిసమ్మతము

## ద్వితీయాశ్వాసము



మద్రమాధవఖగ, రీమంటప హేమకుంభరిపుభయదగదా
పాదపసశంఖచక్ర, క్షేమంకరకరచతుష్క కేశవనాథా. 290

వ. దేవా చిత్తగింపుము సమవధరింపుము. 291

### కరణికపునీతులు

క. మంత్రికి నధికారియగునతఁ, దంత్రమునకు వలయుపనులు దప్పక కార్యా
మంత్రమును జేయఁ గరణము, మంత్రి యనంబరఁగు నతఁడు మనుజేశునకున్.

క. కరణము రాజగృహంబున, కరయంగా రత్నదీప మగు విజ్ఞాన
స్ఫురణమునఁ బరులతమములు, కర మరుదుగఁ బాప నొప్పుకరణం బగుటన్.

క. ఆయవ్యయములు చిక్కులు, పాయంగాఁ జేయఁ గవిలెపట్టున మాత్రన్
జేయు క్రియ నున్నరూపము, చేయుచుఁ గరణంబు ప్రజలచేఁ బొగడొందున్. 294

—నీతిసారము

సీ. ఆయవ్యయంబులయాజాడ లూహించి, యాయాయివర్గువు లమర నిలిపి
పుటుపుపద్ధతి లోని పరికించి సెలసులు, దప్పిపోవకయుండ నొప్పుదీర్చి
యపనీతిప్రాలాకులవిజలఁ గ్రితచొప్పు, కవిలెసంప్రతులను గలుగ నెఱిఁగి
పనిన నాయవ్యయవాచకంబులు వ్రాసి, వడినెత్తుటావర్గువులకుఁ బాటి

ఆ.వె. గాఁగ నిర్ణయించి కలతరుగువుపొత్ర, తెలిసి ధాన్యరొక్కములకు నిలువ
పేరుబడియుఁ దెలుపఁ బెద్దయు నేర్చుట, కరణికంబు ధాత్రిఁ గందమంత్రి. 295

గీ. వ్రాయఁ జేసి మఱచె వైశమె కవిలెలో, గీయఁ జేనిఁ జెఱిచె గీసవలన
విట్టి ధాన్యవివర మెల్లయు నెఱుఁగఁడేఁ, గరణ మనరు వానిఁ గందమంత్రి. 296

సీ. సరులు గ్రుచ్చినయట్లు వెరసులు చక్కఁగా విశద మయినలెక్క వెసగనిడుచు
నెలమి నేకస్థానములు దశస్థానముల్ చెదరిపోకయుండఁ జిరువపుచ్చి
తలఁపులో మఱవక తరవాయి దప్పక కుఱుచలు ద్రొక్కక కుంటుపడక
యెదిరివారు వినఁగ నెన్నక బలసంబు మోపక పెనుప్రేలు దాఁపుగొనక

గీ. తెలివిపడఁగూడిక లఁపులోపలను వెరసు, నిశ్చయముచేసి వ్రాయంగనేర్చునతని
గణితశాస్త్రజ్ఞు లిల మేటికరణ మంద్రు, మంత్రిమందార యబ్బయమంత్రికంద.

సీ. పదియంకనంబును జడభుజ చేతప్పు దెలిహంసపదముతోఁ గిలుము కత్తి
తుడుపు తద్విగుణంబునెడల నిడ్డటివ్రాలు నిరుఘంటలిఖితంబు విరసపత్రి
పత్రికతుడుపులోపలిసంజ్ఞ ఘనలెక్క తక్కువెక్కువగాక చక్కనిడుట
లలివర్గుజాడలోఁ గలిగి వెరసులలోఁ చగులకుండుటయందు మిగులనుంటఁ

గీ గలుగులెక్కలుమాఱుగవెలయుజాడ, వర్గువులు గూర్చి నెడను వ్యయము డించి
నిలువ సేసినసందులు నెరయ నెఱుఁగు, కరణ మెంతయునేర్పరి కందమంత్రి.

సీ. దొరలు ప్రజలు బంట్లు తొల్లిటిరీతిస కడమజీతవహియు మడుసువడిన
మనవిఁ జెప్పఁగఁజేరఁ జనుదెంచునప్పుడు పరుసఁదనము లేక విరసపడక
మన్నన దప్పక మధురోక్తు లుడుఁగక కవిలెలోపల వ్రాఁతకంద వెదకి గి
తరము దెలిసి వానిఁ దగిలెడుపని దీర్చి వేఁకతోఁ బానట్లు గాకయుండఁ

గీ. బొరసి గాదెయు ముడుపును బొరయఁబోక
యాయవంచన మొదలుగాఁ జేయ కుడిగి
యేలినాతనియందుల హితవు గలిగి
మనెడునాతఁడు కరణంబు మంత్రికంద. 299

—మఱియును

క. ధరణీశుసొమ్ము ప్రజలన్, బొరయింపక ప్రజలసొమ్ము భూపతియందున్
జొరనీక రెంటనుం దాఁ, బొరయక యున్నట్టి కరణమునకున్ సరియే. 300

క. కరణంబుకొడుకు ముందఱ, కరణికధర్మంబునందుఁ గడుఁ గుశలండై
ధరణిఁగలవిద్య లన్నియుఁ, బరువడి నెఱుఁగంగవలయుఁ బని లేకున్నన్. 301

మ. శకకాలంబును వత్సరంబు నెల పక్షంబున్ దిథిన్ వారము
న్నొకదేశంబును దాని నేలువిభు నయ్యూరుం నిజస్థానమున్

సకలార్థంబును నామనిశ్చయముగా సాక్షి మేరంబు వ్రా
యుట కాపురుషు వ్రాల వ్రాయుకరణం బజ్ఞాని గాకుండునే. 302

—నీతిసారము

## రాయసము - కరణము

సీ. అనఘుండు చిత్తజ్ఞుఁడు లఘుహస్తుండునై పెక్కులిపు లభ్యసించి యెఱుకకు మిగుల
ననుకూలుఁడై చెప్పినన్ని కార్యంబులు మఱవక వ్రాసి సమ్మతిగఁ జదివి
అవసరోచిత భాషలందుఁ బ్రవీణుఁడై సమ్ముఖంబున నిల్చి సమయ మెఱిఁగి
కొంచి గోప్యంబులు వెలికిఁ జిల్కఁగనీక జాతియు నీతియు శౌచగుణము

గీ. తగవు వినయంబు హితము నుదారతయును, గలుగుగణికుని నానతాకులకు నేలు
నృపతిరాజ్యంబు పూజ్యమై నిక్కి వెసలుఁ, గీర్తియును బెంపుఁజెందును గేశవేశ.

—మదీయము

క. వేసేత నంపియిచ్చిన, వ్రాసినయప్పుట త్రిబంతి వ్రాసిన నొంటన్
వ్రాసిన నీసెం జుట్టిన నాశమగున్ గార్యమంత్రుడు నరనుత వినవే. 304

క. తగవు తమ పిచటఁ దప్పని, తగదున్నది దలఁప నంబు తగ దిరువుటయున్
వగపు తగ చెపుడుఁ జెప్పఁగ, వగదు తలన్ వ్రాల్చి వ్రాయఁదగ దాలేఖల్. 305

—చాటువు

## వాచకలక్షణము

చ. వెనుకకుఁ బోక హాయనక వేసట నొందక బంతి బంతిలో
వెనఁపక కానమిం బ్రమసి బెగ్గిల కెంతయు మున్ను సూచుచున్
గనుకని యక్షరాక్షరము కందువు దప్పక యేకచిత్తుఁడై
యనుపమభక్తితోఁ జదువునాతని వాచకు లంద్రు సజ్జనుల్. 306

సీ. ఊరక మురియక యుబ్బసం బందక వెఱవక దేహంబు విఱిచికొనక
నిమిసునఁ బెట్టక నిప్పోటమునఁ బోక తరవాయి దప్పక తడవికొనక
యక్షరస్పష్టత యన గీత సష్టత గాకుండ నర్థంబు గానఁబడఁగ
నవ్యైరసంబుల కనురూపముగఁ బెక్కురాగముల్ ఫణితులు బాగుపుట్ట

గీ. చెఱకు కొననుండి నమలినచెలువు దోఁప, నంతకంతకు వేడుక యతిశయిల్లఁ
జదువుచున్నాఁడు వీఁడలచదువుఁ బోలఁ, జదువు లేవని పొగడిరి సభికవరులు. 307

చ. వడఁకక నిక్కి కీయనక వ్రాలక తేలక తూలిపోక సం
దడిఁబడ కొన్కికోక గతి దప్పక తుమ్మక దగ్గులేక వెన్
బడ కటు వెక్కి కుబ్బక నెపం బిడ కంజక వంజ గాక రం
గుడిగి పఠింపఁగావలయు నో పటువాచక మెట్టిమేటికిన్. 308

—పురుషార్థసారము

## బ్రాహ్మణాచారము

క. అమరంగా శౌచము మూ, త్రములు ప్రవర్తించునపుడు తమతమశాఖో
క్తముఁ జేయువలయు భూసురు, లమలినమతి నల్పమైన నధికంబైనన్. 309

క. ఆచారం బెఱుఁగఁగ వి, ద్యాచితసంపత్తి వడయునది యాత్మహితం
బాచారవృత్తి ద్విజతతి, కాచారము లేనివిద్య యది యేమిటికిన్. 310

చ. తెలియుచు నిద్ర శౌచవిధిఁ దీర్చి యనుష్ఠితదంతకాష్ఠుఁడై
జలశుచిగాత్రుఁడై విహితసాంధ్యవిధాయకుఁడై హుతాగ్నియై
యొలు పగుభక్తినిష్ఠ సురపూజకుఁడై గృహమేధి సేయఁగా
వలయుఁ బ్రభాతకృత్య మిది వారిజగర్భకుమారసూతికిన్. 311

క. స్నానవిధి తర్పణము సం, ధ్యానియమము పంచవిధమహాయజ్ఞాతి
థ్యానంతరభోజన మిది, మానితధాత్రీసురులకు మాధ్యాహ్నికముల్. 312

క. అస్తమయవేళ సంధ్యో, పాస్తి యనంతరమ యగ్న్యుపాస్తియు దైవో
పాస్తియు నగుకర్మములు ప్ర, శస్తధరిత్రీసురలకు సాయంతనముల్. 313

క. ఓపి త్రిసంధ్యానియమ, వ్యాపారనిరోధి గాని యధ్యాపన మ
ధ్యాపనవిరోధిగాని ధ, నోపార్జన వలయు భూసురోత్తములకిలన్. 314

చ. మునుకొని బ్రాహ్మణుండు మలమూత్రవిసర్జన శౌచదంతధా
వనముఖమార్జనాచమనవారివిగాహనసాంధ్యకర్మజా
ప్యనియమహోమదేవయజనాతిథిపూజనపానయానభో
జనశయనాదు లొందఁదగు శాస్త్రవిధానముతోడ నెప్పుడున్. 315

క. అతికాంక్ష దుష్ప్రతిగ్రహ, రతికంటెను బహుకుటుంబరక్షార్థముగా
పితృసురులకుఁ దృప్తి సేయుట, హితమనిరి పరాశరాదు లిక్కలివేళన్. 316

—పురుషార్థసారము

## వైద్యనీతులు

క. ప్రియభాషణుఁ బరహితుఁ డా, ప్రతిభేషజవిషయు సరసపాకజ్ఞుఁ గ్రియా
చతురు సుచరితు దయాపరు, ధృతియుతుఁ బతి వైద్యుఁ జేసి దీర్ఘాయువగున్.

—అజ్ఞాతము

క. ఆరోగము సేయింపరె ని, న్ననఘా యష్టాంగమైన యాయుర్వేదం
బున నిపుణులైన వైద్యులు, ఘనముగ ననురక్తులై జగద్ధితబుద్ధిన్. 318

—సభాపర్వము

ఆ.వె. దేవమంత్రవిప్రతీర్థదైవజ్ఞ, వైద్యగురులయందు వసుధమీఁద
నెంత విశ్వసించి రంతయు సిద్ధియౌ, నెంత విశ్వసింప రంత గాదు. 319

—పంచతంత్రి

గీ. సకలలిపికారుఁ డఖిలభాషావిదుండు
రాజరంజనవిద్యాధురంధరుండు
మాంత్రికుఁడు వైద్యుఁ డతిగూఢమానసుండు
సరసధర్మార్థకామమోక్షప్రియుండు. 320

క. ఏదేశమందు నిల్చిన, నాదేశం బేలురాజు నచ్చటిప్రజలన్
వాదులవిపక్షములలో, భేదించుఁ బరేంగితంబుఁ బెద్దయు నెఱుఁగున్. 321

గీ. వైద్యుఁ డెంతను రోగి కవశ్యుఁ డరయఁ
గాన వైద్యప జనవశీకరణ మంద
మాన మొల్లక సేవింపఁ బూనియున్నఁ
గార్యసంసిద్ధి సందేహకరము దలఁప. 322

—ముద్రామాత్యము

## పురోహితనీతి

చ. నృపతిపురోహితుండు నృపనీతివివేకవిదగ్ధుఁడై త్రయీ
నిపుణుఁడునై తనర్చి ధరణీపతి కెప్పు హితాభిలాషియై
రిపునృపకర్మభేదనధురీణత శాంతికపౌష్టికక్రియా
విపులమనీషఁ జేయఁ దగు వేడ్కఁ దలిర్ప గృహప్రయోక్తయై. 323

—కామందకము

క. ధీరుఁడు ధర్మాధర్మవి, శారదుఁడు బహుశ్రుతుండు సమచిత్తుఁడు వా
ణీరమణీకృతవదనస, రోరుహుఁ డనఁదగునె నీపురోహితుఁ డధిపా. 324

క తనయింటిచేటు పరులకు
వినిపింపఁగఁదగదు కార్యవేళనె తక్కన్
వినఁగఁ బురోహితుఁ డర్హుఁడు
విని చక్కంజేయుఁ దనదువిద్యామహిమన్. 325

—సభాపర్వము

క. పోఁడిమిఁ బౌరోహిత్యం, బేఁడును మాతాధిపత్య మింపెసఁగంగా
మూఁడుదినంబులు చేసిన, వాఁడు సుమీ ఘోరనరకవాసుఁడు మీఁదన్. 326

—పంచతంత్రి

## యాజ్ఞికుఁడు

క. జననుత నీయజ్ఞమునం, దనవరతనియుక్తుఁడైన యాజ్ఞికుఁడు ప్రయో
గనిపుణుఁడై యేమఱకుం, డునె నిజకృత్యముల నెప్పుడును సమబుద్ధిన్. 327

—సభాపర్వము

## జ్యోతిషికుఁడు

క. క్షితినాథ శాస్త్రదృష్టి, బ్రతిభను దివ్యాంతరిక్షభౌమోత్పాత
ప్రతికారు లగుచు సన్మా, నితులై వర్తింతురయ్య నీదైవజ్ఞుల్. 328

—సభాపర్వము

క. జాతకయాత్రాప్రశ్న, ఖ్యాతఫలగ్రంథగణితగణచతురధిక
స్ఫీతశతచక్రనిపుణ, జ్యోతిషికులు గలుగవలయు నవనీశునకున్. 329

క. ప్రతికూలవేళ లెఱుఁగుచుఁ, బ్రతికృతరాశ్యాదు లెఱిఁగి పతిరాశిఫల
జ్ఞత యొరు లెరుంగకుండఁగ, సతతము రక్షింపవలయు సాంవత్సరికుల్. 330

సీ. వాన లెక్కువతక్కువలుగాఁగఁ గురియుట చిలుకలు మిడుతలు నెలుకపిండు
నాదిగా సస్యోపహతికారణంబులు గలుగుట తెప్పలును గఱవు రాక
మనుజు లొండొరులతో మత్సరంబుఁ బోవు టధికమై సర్పంబు లాదిగాఁగఁ
గ్రూరజంతువు లతిఘోషంబు పెట్టుట గాలియుఁ జిచ్చు లగ్గలములగుట

ఆ.వె. భూతములు పిశాచములు రేఁగి పట్టుట, యల్పకారణముల నైనచావు
గలుగుటయును నాపదలు వీనిదైవజ్ఞుఁ, డగుపురోహితుండు నడఁపనోపు. 331

## విద్వాంసుఁడు

క. సన్నుతి వడయఁగఁ దివిరిన, యోన్నతి సుచ్చాసనమున నునిచి ధనంబుల్
మన్నించి యిచ్చి నృపతులుఁ, విన్నపము పనేమి యంద్రు విద్వాంసునకున్.

ఆ.వె. చటులసింహశరభశార్దూలగజములఁ, వశ్య మొందఁ జేయ వచ్చు ననిన
నరయ మిగులఁ దజ్ఞు లగువారలకునెల్ల, నవనిపతులు వశ్యు లగుట యెంత. 333
—పంచతంత్రి

క. ఎవ్వరు శూరులు సేవకు, లెవ్వరు విద్వత్ప్రసిద్ధు లెవ్వరు దగువా
రవ్వసుధాధిపుసంపద, కవ్విధమున సర్వు లగుదు రది నిజ మరయన్. 334

చ. పతి సుఖగోష్ఠి సేయునెడఁ బన్నుగ వారమునందుఁ బాఁడి స
మ్మతముగ రాజుపక్షము సమర్థముఁ జేయుచుఁ బల్కుటొప్పుఁ ద
త్ప్రతిపనుపైనఁ దద్వచనభంగి యెఱింగి వినిశ్చితార్థసం
గతిఁ గడు సాధురీతిఁ బలుకందగు వాగ్మిత యుల్లసిల్లఁగన్. 335

## రాయబారప్రకారము

క. దూరపుఁబనులకు మంత్రికిఁ, బోరా దటు గాన నతనిఁ బోలెడివిప్రుం
భూరిగుణాఢ్యుని దూతగఁ, గోరి నృపాలుండు పనులు గొనఁగావలయున్. 336
—కామందకము

క. అవనీపతి నిల్పందగుఁ, బ్రవిమలమతిచతురు నిఖిలభాషాకుశలున్
సవినయశీఘ్రవిలేఖను, వివిధవిధిప్రౌఢు సంధివిగ్రహపదవిన్. 337

—పురుషార్థసారము

క. కృతమంత్రుఁడగు మహీపతి చతురుని నిజమంత్రి మంత్రసమ్మతు నెప్పుడున్
వ్రతసాభిమాను గమ్య. క్షితిపతికిడ కనుపపలయుఁ జెప్పెఁబ మాతన్. 338

—కామందకము

శా. నానాశాస్త్రవిచక్షణుండు నయనానందాంగుఁడున్ సత్కుల
స్థానశ్రేష్ఠుఁడు నిస్స్పృహుండు పరచిత్తజ్ఞుండు వాక్సిద్ధుఁడున్
శ్రీనిత్యుండును లోకమాన్యుఁడగు నిశ్చితుండు నై యుండినన్
వానిన్ మానుగ రాజదూత యని తల్పన్ వచ్చు నుర్వీస్థలిన్. 339

—పంచతంత్రి

క. శ్రుతిమంతుడు ప్రగల్భుఁడు, కృతకర్మాభ్యాసి వాగ్మి కీర్తితశుభస
న్మతి శస్త్రశాస్త్రనిష్ఠుఁడు, పతికిన్ దగు దూత గాఁగ బహుకార్యములన్. 340

—కామందకము

క. ప్రతిభయు నవ్యసనిత్వముఁ
బతిభక్తియుఁ బలుకువెరవుఁ బరనృపధర్మ
జ్ఞతయును వినయముఁ దేజము
నతిశుచితయు దూతగుణములండ్రు నయజ్ఞుల్. 341

సీ. లిపులెల్లఁ జదువను లిఖియింప వలఁతియై భాషలఁ బెక్కింటఁ బ్రౌఢి గల్గి
సమయవర్ణాశ్రమాచారవిధిజ్ఞుఁడై యెదిరిని దన్నును నెఱుఁగనేర్చి
మధురగంభీరసుస్థిరవాణియై సుముఖుఁడై కార్యభారమున కోర్చి
మఱి పదవాక్యప్రమాణవిజ్ఞానియై ప్రజ్ఞ నూహాపోహపరుఁడు నగుచు

గీ. రాజహితుఁడయ్యుఁ బ్రజ కనురాగ మెసఁగఁ, జేయ నేర్చినయాతనిచేతఁగాక
యితరదూతలు చేసిన నేల పొసఁగు, విమతజయకారు లగుసంధివిగ్రహములు.

—నీతిసారము

క. ధీయుతుఁ డభయుం డచలుఁ డు. పాయజ్ఞుఁడు సముచితప్రభాషుండు పతి
శ్రేయోర్థి పరేంగితవిదుఁ, డాయాసనహుండు దూత యగు నధిపతికిన్. 343

—పురుషార్థసారము

ఉ. మేధయు వాక్పటుత్వమును మిక్కిలిప్రజ్ఞయు నింగితక్రియా
బోధము ధైర్యముం బ్రియము భూపతిభక్తియు క్తి వైరిధర్మసం
శోధనమంత్రియున్ గలవిశుద్ధచరిత్రుని రాయబారిగా
యోజము గూర్చి పంపు సుగుణోన్నత యబ్బయకందధీమణీ. 344

—మదీయము

క. పలికిన చెప్పినమాటలె, పోలఁగఁ జెప్పుచును బనియుఁ బొందఁగఁజేయం
జాలుట యుత్తమదూత్యము, పాలింపఁగవలయు నిదియుఁ బతిహితతతికిన్.

—ముద్రామాత్యము

ఉ. కొందఱు చెప్పినంతయును గూర్చ వచింతురు చిల్కపోలికన్
కొందఱు మూఁగుభంగి నొనగూడఁదలంచి వచింపనేర రిం
పొందఁ దలంచినట్లవల నొప్ప వచింతురు కొందఁఱుర్విలో
నెందును సత్కవీంద్రుగతి నీక్రియ మర్త్యులు మూఁడుచందముల్. 346

—పంచతంత్రి

క. మునుము నిసృష్టార్థుఁడు, వెనుక మితార్థుండు నతనివెనుకను మఱి శా
సనహారకుఁడు ననంగాఁ, దనరుదు రొగి దూతజనులు దమతమశక్తిన్. 347

—కామందకము

సీ. పలుమాటకుఁ బొందుపడ మాట గల్పించు నతఁడు నిసృష్టార్థుఁ డనఁగఁజెల్లుఁ
బతి చెప్పినంతయుఁ బలుకతఁ బల్కునాతఁడు మితార్థుండు నాదరణిఁ బరఁగు
నట లేఖఁ గొని యేఁగి నంతటనే యుండు నాతండు శాసనహారకుఁడు
ఈయుమ్మువ్వురును దూత లిందులో సచివునిసామర్థ్యమునకంటె నరవి నొక్క

గీ. పాలు సగంబు ముప్పాలు పరఁగఁ గొఱఁత
యగుచు వర్తించువారు వీరగుటఁజేసి
నీతి మార్గంబుచే వీరి నెఱిఁగి యెఱిఁగి
పనుచు పెంతయునొప్పు భూపతికి నెపుడు. 348

సీ. దూతజనుం డొగి భూతలాధిపునాజ్ఞఁ దల మోచికొనుచుఁ బ్రత్యర్థికడకు
నిజనాయకునివాక్యనిర్ణయేతరముల నిచ్చఁ జింతించుచు నేఁగవలయు
నటగట్టిరాజులు నాటవికులు దన కాప్తమిత్రులు గాఁగ నలవరించి
తోడరి జలస్థానదుర్గసంస్థలములు నిజబలార్థంబైన నెమ్మిఁ దెలిసి

గీ. రాక యెఱిఁగించి శత్రుపురంబునందు
నుండి సముచితవృత్తిమైనొయ్య నొయ్యఁ
గాల మీక్షింపవలయుఁ దత్కార్యమునకు
నంత నాతఁడు చను మన్న నరుగవలయు. 349

క. అడిదపుధారలు దనపై, జడియఁగ నేలినన్నృపాలుశాసనమార్గం
బెడపక పలుకుచుఁ జూపుల, వడుపును మోమునను దెలియవలయుసుజనంబున్.

సీ. చాల ననిష్టవాక్సంచారమున కోర్చి క్రోధకామంబులఁ గుతిలపడక
పరులమనస్థితి బయలుగాఁ బలుకక యెల్లచిత్తంబుల నెఱిఁగికొనుచు
దననృపప్రకృతులతలఁపుల నన్యోన్యరాగాపరాగనిర్ణయము నెఱిఁగి
యొనరఁగఁ గృత్యపక్షోపజాపము నొగి ననుపలక్షితుఁడు నై యలవరించి

ఆ.వె. తననృపాలుప్రకృతిజనులవిచ్యుతి యెవ్వ
రడుగునప్పుడైన నొడవకుండి
నృపుఁడె యడిగెనేని నీపె యెఱుంగుదు
వనుచుఁ బలుకవలయు నవిదితముగ. 351

క. కులమును బేరును ధనమును, బలవత్కర్మములు నుభయపక్షములందున్
గలపతి యుత్కర్షంబుగఁ, దఱకొని వినిపింపవలయుఁ దననరపాలున్. 352

గీ. ఉభయవేతనజనులతో నొయ్యఁ గూడి, సాల శిల్పోపదేశమిషంబువలనఁ
గృత్యపక్షం బెఱుంగుచుఁ గేనమునను, నానృపాలునిచేష్టల నరయవలయు 353

—కామందకము

క. కౌటిల్యవృత్తి నెంతయుఁ, బాటించియె కాక సంధి బలహీనుల కె
ప్పాటి నలవడునె యైనను, పాటించి యెరుంగవలయుఁ బరహృదయంబుల్.

—ముద్రామాత్యము

గీ. తీర్థముల నాశ్రమంబుల దేవగృహము, లందుఁ దాపసవేషంబు లలవరించి
యున్న నిజచారజనులతో నుచితశాస్త్ర, పటువివేకమిషంబునఁ బలుకవలయు.

క. పానద్యూతము లుడుఁగుచు, నానాఁటికి నచటివార్త నరనాథునకున్
దా నమ్మిక గలనరుచే, మానుగ నెఱిఁగింపఁ బంపుమత మది వలయున్.

క. తనపతికులముఁ బ్రతాపము, వినుతైశ్వర్యంబుఁ ద్యాగవిభము దార్ఢ్యం
బను నుత్సాహము ఘనతయుఁ, బెనుపుగ నుపమింపవలయు భేద్యులయెదుట

క. కాలముతోడన తనపనిఁ, గీలింపుచు నొరులభేదకిల్బిషములచేఁ
దూలక కాలక్షేపము, లాలోకింపంగవలయు నన్యకృతంబుల్.

సీ. ఇన్నిదినంబులు నితఁడు విలంబింప నితనికిఁ గారణం బేమియొక్కొ
మన్మహీపతియందు మహితవ్యసన మొక్కొ డారసి పొడఁగను నాసనొక్కొ
స్వాంతప్రకోపము నడఁచుటకై యొక్కొ కడగి సస్యాదిసంగ్రహముకొఱకొ
ప్రత్యగ్రదుర్గనిర్మాణంబునకునొక్కొ కృతపూర్వదుర్గసత్క్రియలకొఱకొ

గీ. పక్షవృత్తిని యాత్రకు బాగు గాఁగ
దేశకాలవిభేదనోద్వీక్షణంబొ
యాత్మయాత్రావసరసత్క్రియార్థ మొక్కొ
యనుచుఁ గాలవిలంబన మరయవలయు. 3

గీ. మఱియు వార్తావిశేషంబు నెఱుఁగుచుండి
తననృపాలున కెఱిఁగించి పనుపవలయుఁ
గాలయాపనహేతువు గానవచ్చి
వెరవుపడకున్న నప్పుడు వెడలవలయు.

క. జనపదసారము దుర్గం, బున గుప్తము శత్రురంధ్రమును ధనము బలం
బును మిత్రబలము నొయ్యన, మనమునఁ దెలియునది దూతమార్గం బరయన్

చ. అరివరశత్రుదుర్గమును నాతనిబంధుసుహృద్విభేదమున్
బురధనసైన్యసంపదలపోఁడి మెఱుంగుట కృత్యపక్షవి
స్తరపరిసంగ్రహం బతనిజానపదాటవికంబు సాధ్యముల్
దిరమిడి యుద్ధసారము విధిజ్ఞత యన్నివి దూతకర్మముల్. 36

—కామందకము

గీ. దూతముఖమునఁ బతి యఖిలాతిజనుని
యంతరంగము సర్వము నరయవలయు
నాత్మపక్షమునందును నరసి యరసి
నితరదూతవిచేష్టిత మెఱుఁగవలయు. 363

ఆ. వె. నృపతి పరులదూతనిజ మెరుఁగఁగఁదగు, వారివలనఁ దిరుగు వారివలన
నైనఁ గొలువఁ బనిచి యాత్మీయులగువారి, వలననైనఁ బరులవలననైన. 364

ఆ. వె. పరుసగాఁగ దూత పలికిననైనను, జేయఁదగని పనులు చేసెనేని
చంప నొంపఁదగదు సైరణ వాటించి, యనుపవలయు నుచితమైనభంగి. 365

క. నృపతులకుఁ గులవిహీనుఁడు
గుపితుఁడు నలసుండు లంచగొండియు మూర్ఖున్
జపలుఁడు మిథ్యావాదియుఁ
గపటియు నగుదూత చేతఁ గా దేపనులున్.

—కామందకము

క. చెప్పినమాటలలోపలఁ జెప్పక యొకకొన్ని మఱచి చెప్పెడు నందున్
దప్పులు వెసఁ జెప్పెడివాఁ, డెప్పగిదిని రాయభారి యిలలో ననఘా. 367

క. తడఁబడక తప్పు లాడక, జడిఁబట్టక పరుస గాక సభ్యులు మెచ్చన్
గడు స్రుక్కక యెగపెక్కక, నడుకక మాటాడవలయు నాగరికుండై. 368

—నీతిసారము

క. ఎదిరికి హితమును ప్రియమును
మది కింపును గాఁగ నాడు మాటలు పెక్కై
యొదవినను లెస్స యటుగా
కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్. 369

క. మత్తుఁడు సుప్తుఁడు హృదయా. యత్తము విదితంబు గాఁగ నాడుదు రగుటన్
ఎత్తఱి నేకాంతమునన, మత్తత నిద్రింపవలయు మానోన్నతుఁడై. 370

—విదురనీతి

## చారులనీతులు

క. పరికింపుచు బాహ్యాభ్యం, తరములలోపల ననారతము నిజరక్షా
పరులైనపరమహీశుల, చరితము వీక్షింతె నిపుణచరనేత్రములన్. 371

—సభాపర్వము

గీ. సారమతులైన సద్గూఢచరులచేత
నమరునిజపక్షశత్రుపక్షములలోను
గలుగుతీర్థంబు లన్నియుఁ గ్రమముతోడ
నెఱుఁగు నెవ్వఁడు వాఁడొందఁడెపుడుఁగీడు. 372

—అజ్ఞాతము

సీ. మంత్రిపురోహితమంత్రిజనాధ్యక్షసైన్యాధినాయకసన్నిధాతృ
లాటవికప్రశాస్త్రాయోధనాయకవ్యావహారికసమాహర్తృదండ
పాలదుర్గప్రాంతపాలప్రదేష్టృ కార్మాంతి కాంతర్వంశికాధికార
యువరాజదౌవారికోపేతముగ నిట్లు ముయ్యేడుతీర్థంబు లయ్యె జగతి

ఆ.వె. నివి యెఱింగి రాజహితబుద్ధిపరపక్ష, ములను నతినిగూఢముగను జరులఁ
బెట్టవలయు నట్టిబెట్టిదముగ సంధు, లరయుచుండవలయు ననుదినంబు. 373

చ. జనపతి సంస్థలున్ మిగుల సచ్చరితంబులు గల్గువానిఁగా
నొనరఁగఁ గార్యసిద్ధికొఱ కున్కిగఁ జేయుట వోలు వానియం
దనువునఁ జారులుండి వెరవాడి విదేశములోని మర్మముల్
గనుఁగొనుచుండఁగావలయుఁ గావున శాత్రవరాజధానులన్. 374

—కామందకము

వ. మఱియు దూతలకు నగోచరంబు లగుసూక్ష్మకార్యంబులు జనసంచారవిస్రంభాలాపంబుల నెఱుంగంబడుఁ గావున నయ్యెస్థలంబులఁ దనకు నాప్తులగు భృత్యులఁ జరులగా నియోగింపవలయు వారు. 375

క. తమదేశమును బరదే, శమున నిగూఢాత్ము లగుచుఁ జరియించి విశే
షము లెన్ని యన్నియును భూ,రమణున కెఱిఁగింపవలయుఁ బ్రతివాసరమున్.

ఆ.వె. గతియు మతియు బైలు గాక పరేగింత, చేష్టితాదు లూహచేతఁ దెలిసి
బొంకు చాపలంబు బొరయక నృపునెడ, సత్యవాది యగుట చరునిగుణము.

—నీతిసారము 377

చ. తలఁపును రాకయుండుటయుఁ దాఁకుభయంబున నోర్వఁ బల్కు న
ప్పలు కొకరీతి పొందుపడఁ బల్కెడునేర్పును గాలివేగమున్
వెలయఁ బరేంగితజ్ఞతయు నిశ్చయబుద్ధియు దుఃఖ మోర్చుటల్
వలయుఁ దగంగఁ జారున కవశ్యము లివ్నియు నెన్నిభంగులన్. 378

గీ. తోడిరి తాపసవేషులు ధూర్తజనులు
చాల శిల్పోపజీవనశాలు లగుచుఁ
జరులు చరియింపవలయు విశ్వమునసెల్ల
నెల్లజనులమతంబులు నెఱిఁగికొనుచు 379

క. అనుదినము నిర్గమించుచు, నొనరఁ బ్రవేశించుచును సముద్ధతవార్తా
వినిరూపణంబు సేయుచు, జనపతి కతిదూరదృష్టి చారులు జగతిన్. 380

గీ. సూక్ష్మసూత్రప్రచరణముల్ సులభవృత్తిఁ, జొరఁవ కరివీరచేష్టలఁజూచుచుండు
చారచక్షులు గలిగినజనవరుండు, నిద్ర పోవుచునైనను నెలమిఁ జూచు. 381

క. అరుణుఁడు కిరణంబుల సం, చరణంబుల వాయు వెపుడు చరియించుగతిన్
జరజనులూఁతగ నృపతియు, నొరుగతిజగమెల్ల నెఱిఁగియుండఁగవలయున్.

చ. కడుకొని యప్రకాశుఁడు ప్రకాశుఁడు నా నుభయప్రకార మై
యడరుచుఁ జారభేద మది యందుఁ బ్రకాశుఁడు దూత నాఁగఁజొ
ప్పడుఁ జరుఁడప్రకాశుఁడును బన్నుగ దూతవశంబు సంధి య
ప్పుడు చరునంద చర్యఁ గనఁబోలును నాత్మపరస్థలంబులన్. 383

—కామందకము

క. వేషవిశేషవిదుల్ బహు, భాషాకోవిదు లచలులుఁ బరహితులును వి
ద్వేషనృపకృత్యరంధ్రా,న్వేషులు నగు గూఢచరులు నృపతికి వలయున్. 384

—పురుషార్థసారము

సీ. అధ్యాపకుఁడు భిక్షుకాఖ్యుండు లింగియు వణిజుండు మఱి కృషీవలుఁడు వరుసఁ
గాపట్యవాసీనతాపసవైదేహగృహపతు లేవేళ నహితువీటఁ
జపలకుఁ దాపిగాఁ జరియించుకొఱకునై ధన మిచ్చి తగుచోట్ల కనుపవలయు
రసదుండు సత్రి ప్రవ్రజితుండు దీక్షితుం డనువారు గరదుండు దనరుతపసి

ఆ.వె. వరుఁడు వేషధారి తిరిపెము సాధన, గురువు లనఁగ మాయ బెరసియుండ్రు
వీరు నలువురరయ వేగులవారలొం, డొరుల నెఱుఁగకుండఁ దిరుగవలయు

—కామందకము 385

ఉ. ఒజ్జలు చాపశిక్షకులు యోగ్యులు భోగ్యులు రాజయోగ్యధీ
మజ్జను లైంద్రజాలికులు మల్లులు సూపకరుల్ విదూషకుల్
గుజ్జులు దేశికుల్ యతులు కోమటు లాడెడువారు గాయకుల్
వెజ్జులు లోనుగాఁ గలుగువీరి మహీపతి సేయుఁ జారులన్. 386

సీ. వ్రతులు సన్న్యాసులు వైద్యు లాచార్యులు జపితలు జ్యోస్యులు శకునగాండ్రు
బట్లు శ్రీహరినామపాఠకు లాడెడువారు విద్యలవారు వాదవిదులుఁ
గుంగులు మూఁగలు బధిరులుఁ జపలులు జంగాలు జోగులు సావుతేలు
వగ్గులు గొరగులు వాహకు లడపాలు సురయమ్మువారలు జూదగాండ్రు

ఆ.వె. మానటీలును బరిహాసకులును బాగ (?) వేగుజాము క్రోఁతివేఁటకాండ్రు
నాదిమైనవారి యాకారములు దాల్చి తిరుగవలయుఁ జరులు దేశము .ను. 387

——నీతిసారము

చ. జడబధిరాంధమూకమిషిషండకిరాతకకుబ్జవామనుల్
అడరఁగఁ గారువారజజనావళి భిక్షుకి పుష్పలావియున్
గడుకొని దాసియున్ బహువికల్పకళావిదులై చరించున
ప్పుడఁటుకలున్ వెసన్ దిరుగుపాఠకులుం దగుచారు లెల్లెడన్. 388

క. ఆరయ ఛత్త్రాధారులు, వారక భృంగారు యానవాహనధారుల్
ఆరభిక్షకు లాదిగ, నారసి యెఱుఁగుదురు బాహ్య మగువార్తలిలన్. 389

గీ. మిగులఁ సంకేతసంజ్ఞిత మ్లేచ్ఛవచన, గూఢమూర్తులఁ బ్రతికారగూఢరూప
చేష్టితంబుల నొందుచు నిష్టవృత్తిఁ, జెలఁగి చారులు తమలోన మెలఁగవలయు.

చ. జనపతిచారచక్షుఁ డయి చాలఁగ రంధ్రము రోసి శత్రుపైఁ
జని గెలువంగఁబోలుఁ జరచక్షుఁడు గానినృపాలుఁ డంధుఁ డా
ననిశము శత్రుసంప దుదయంబును సర్వదశావిచేష్టలుం
గనుఁగొను టొప్పు శత్రుజనకల్పితకృత్యము చారదృష్టి యై. 391

—కామందకము

క. పసదన మెఱింగి చారుఁడు, వెసతో నేతెంచుఁ గాన వేమాఱును నా
పసదనమును జీతంబును, బొసఁగి క్రియ నిడఁగవలయు భూపతివృత్తిన్. 392

ఆ.వె. చరులు లేనిరాజు పరులచే నాపదఁ జెందు ననుట యేమిచిత్ర మరయ
భక్తి సేయునట్టి ప్రజలైన నెఱుగమి, సూచి మోసపుచ్చు జాతురనిన. 393

—పంచతంత్రి

ఉ. కొందఱ నారయంగ నిడి క్రమ్మఱి వచ్చుచుఁ బోవుచుండగా
గొందఱఁబంచి వేడ్కయును గొందఱ నొండొరుపోక గానకుం
డం దగఁ బంచి చారులు బెడంగుగఁ జెప్పినచోట ముప్వురే
చందము సమ్మతించి రది చందముగాఁ గొనిపోవఁగాఁ దగున్. 394

—నీతిసారము

ఆ వె. హృదయకమలమందు నెద్దారిపగయైనఁ
జారగూఢమంత్రశక్తిఁ జేసి
తమకుఁ బూని గెలువఁ దఱియైనయంతకు
నది సహించికొందు రమలమతులు. 395

క. నానాదేశంబులఁగల, భూనాథుల శత్రుమిత్రబుధబంధువులన్
గానంబడుబహువిధముల, మానగు వైదేశికులఁ గ్రమంబున నడుగన్. 396

ఉ. చేరి తలంటువారలును జెచ్చెర నాపదగాత్రమర్దనుల్
నారయ భోజనాంబుకుసుమాంబరభూషణగంధదాయకుల్
వారక పీ డె మిచ్చి చనువారును నిత్యసమీపవర్తనుల్
దారుణచిత్తవృత్తి రసదాయకు లౌదురు చేయనేర్చినన్. 397

క. పరఁగ నణుమాత్రరంధ్రం, బరిపక్షమునందుఁ గన్న నది మార్గముగాఁ
బరిమార్పవలయు రాజ్యము, పరువడి సలిలంబు యానపాత్రముఁబోలెన్. 399

క. ఈరీతి నడువనేరని, ఘోరమణుఁడు శత్రువులు ప్రబోధత నుండన్
వారక నిద్రించినవాఁ, డారయ మేల్కాఁనఁగనేరఁ డాజన్మమునన్. 399

—ముద్రామాత్యము

## సేనాపతిలక్షణము

క. నానావితరణవిజయమ, హానిపుణ లవార్యవీర్య లనఁదగువారిన్
సేనాధ్యక్షులఁ జేసితె, నీనమ్మినవారి మాననీయుల హితులన్. 400

—సభాపర్వము

సీ. సత్కులుఁ డౌదార్యసంపన్నుఁ డభిమాని సత్యవంతుఁడు మేటి సత్యధనుఁడు
మంత్రజ్ఞుఁ డుత్సాహమంత్రసమ్మతుఁ డాగమజ్ఞుండు శుభమూర్తి
మహితకీర్తి
బహుబంధుమిత్రసద్భటసమగ్రుఁడు పతికార్యదక్షుఁడు యుద్ధకౌశలుండు
..........................................................
నైనదళవాయి నేలినయతఁడు రాజు, ఘనకళాభోజ యబ్బయకందరాజ. 401

—చాటువు

మ. నయవిజ్ఞానముఁ దత్ప్రయోగములు నానావాహనారోహణ
క్రియతో నాయుధకౌశలంబు నుచితక్రీడారణామర్ష మెం
తయు నాయాసనహత్వముం బరబలాంతస్సారవేదిత్వమున్
జయశీలత్వము గల్గుసైన్యపతి రాజప్రీతిపాత్రం బగున్. 402

సీ. మహిమ లేకుండిన మన్మథపరుఁడైనఁ గ్రొవ్వినఁ బనిలేక కోపి యైన
నుచిత మెఱుంగకయున్న నిస్పృహుఁడయ్యుఁబరుసగా భృత్యుల బలుకునేని
మృగయాదిసక్తుఁడై మెలఁగిన రాజన్యహీనుఁడై మాఱు సహింపకున్న
మొనలు దీర్పఁగ వాని ముంగలి నడిపింప నేరఁడేఁ దనయిచ్చ నిగుడఁడేని

ఆ.వె. నవను నెఱుఁగఁడేని నట్టిసేనాపతి, కొని జయంబుకలనఁ గొందు ననుచుఁ
గుక్కతోఁకఁబట్టుకొని మహాంబుధి దాఁటఁ దలఁచినట్లు కాదె ధరణిపతికి.

—నీతిసారము

క. సేవల సద్భక్తిస్నే, హావేశము గలిగి శూరుఁడై యలజడికిం
దా విసువనిసత్కులజున్, గావింపుము సైన్యవిభునిఁగాఁ గురుముఖ్యా. 404
—ధృతరాష్ట్రనీతి

క. అతిమహిమోన్నతియును సం, పతియును జేయునది యర్థభారనియోగ
స్థితియును దంత్రము మంత్రిని, బతిఁజేయుట బుద్ధిగాదు బద్దెనరేంద్రా. 405
—బద్దెననీతి

## రాజభృత్యనీతులు

మ. ధరణీనాథులు లేనిభృత్యులును భృత్యశ్రేణియున్ లేనిభూ
వరులున్ (నేర్తురె లోకయాత్రఁ గడపన్ వా రొండొరుంగూడి య)
చ్చెరువై దేహముఁ బ్రాణమున్ రవియు రోచిఃశ్రేణులున్ శబ్దమున్
సరసార్థంబునుబోలె నొండొకటితో సంబంధమై యొప్పెడున్. 406

క. కులమును శక్తియు భక్తియుఁ
గలభృత్యునిమనసు దగదు కందింప శుభం
బొలయఁగఁ దలఁచినయాతని
బలుమఱు పోషింపవలయుఁ బతి సుతుఁబోలెన్. 407

క. మానవపతి మెచ్చిన స, న్మానము నొనరించుఁ గొంత మఱి భటుఁ డా స
న్మానమున బ్రాణ మిచ్చున్, గాననృపాలునకు నీతి ఘనుల ఘటింపన్. 408

క. చెన్నెసలారఁగ భృత్యుని, మన్నించెడివాఁడె ఘనుఁడు మనుజేశులలో
నెన్నఁడుఁ దగ మన్నించెడు, నన్నరపతిఁ బాయ రీవి యల్పంబైనన్. 409

క. సర్వోపాయములను రిపు, గర్వ మడంపంగ భటులు గాల్గొనకుండన్
బర్వెడికడఁక మనిపెడు, నుర్వీశుఁడు వారిఁ బ్రోవ కుండుట గలదే. 410
—అజ్ఞాతము

క. తన్నని నమ్మినఁ బ్రోవక, పొన్నాకులమీఁదఁ దేనెఁ బూసినభంగిన్
మున్నిమాటలయన్నల, మన్నన లేమందు మబ్బుమంత్రియకందా. 411
—నీతితారావళి

కం. తమతమ కనియెడుతఱి జీ, తము గానక నవయుభటుల దౌర్గత్యవిషా
దము తెలిసినవానికవ, శ్యము నెగ్గొనరించు నతఁడు శక్రుం డైనన్. 412

—సభాపర్వము

ఉ. సచ్చినవారిఁ బ్రస్తవమున స్మృతిఁ బొందినవారివారి నా
హవముఖవీరులన్ బనులయందుఁ బ్రగల్భుల వేఱులేనిబాం
ధవుల నయజ్ఞులన్ బుధులఁ దప్పనికావుల శక్తియుక్తులన్
బ్రమదముగఁ బ్రోవలేని నృపతుల్ కుపతుల్ పరపక్షభైరవా. 413

కం. నడిపినజీతం బెప్పుడుఁ, గడపక తాఁ బెట్టునృపుఁడు గా నొకచక్రిన్
గడు వర్తించిననైనను, విడువరు సద్భృత్యు లెపుడు విసువరు కొలువన్. 414

కం. భూపతి విరక్తుఁడైనను, నాపత్కాలమున విడుచు టవినీతి యగున్
ఆపద పైకొనునయ్యెడ, నోపి విడువకుండునాతఁ డుత్తముఁ డరయన్. 415

—బద్దెనీతి

ఆ. వె. ఉర్వీపతులవలన నొకయుపద్రవ మైన నపుడు పెట్టకున్ననైన భటులు
తెగెలి తన్మహీశుఁ దమజీవనంబుల, హానిఁ గోరి కొలుతు రనుదినంబు. 416

ఉ. ఏపునఁ గూడి పూర్వమున నేలినవానినయొండెఁ దక్కొరున్
భూపతిఁ జేయుటొండెఁ దలపోతురు రాజులనొండె నొండొరున్
బ్రాపుగఁ జేసి రాఁదలఁచి ప్రాణము లీ వడిఁ గారణంబుగా
రాపొనరింపఁగాఁ దగదు రాజు భటావళి నెల్లకాలమున్. 417

చ. అఱిమి రణంబునం బడినయాతనిసంతతిఁ బ్రోవఁడేని చే
కుఱు నటజీవితంబు గొని ఘోరరణంబున నోడి వచ్చినన్
బఱపకయుండె నేని జనపాలునిదిక్కున నంతవేడ్కయున్
వెఱపును జెడ్డ బ్రాణములు వెట్టుటె యీ ననిలోన సేవకుల్. 418

—పంచతంత్రి

క. ఏలిక పనిచినఁ గీడౌ, మేలౌ నది భటుఁడు సేయ మెయికొనఁ డేనిన్
వాలాయము విడువనె తగు, నాలరి యగు భటునిఁదలఁప నయ్యేలికకున్. 419

—పంచతంత్రి

క. తన కెన్నఁ డుండియును ద, క్కనిభృత్యులఁ బెరుగ మనుపఁగాఁ జనదు ప్రయో
జనమునకుఁ దగినవెల యి, చ్చునది నరేశ్వరుఁడు నన్నిచోడనరేంద్రా. 420

క. మనుపఁగొఱయేని జీతము, దనియఁగ నిచ్చునది యెంతదయ గల్గిన నే
రనివాని నెఱతనమునకుఁ, జొనుపుట దుర్నయము నన్నిచోడనరేంద్రా. 421

—బద్దెనీతి

క. ఎవ్వని ప్రసాదమున సుఖ
మెవ్వనికిం గలియుండు నెల్లప్పుడుఁ దా
నవ్విభునికొఱకు మృతుఁడగు
టెవ్విధమునఁ బుణ్యలోకహితము దలంపన్. 422

—ముద్రామాత్యము

క. పుడమిపతిచేత జీతము, కుడిచినఋణ మెల్ల నీఁగికొనఁ దనయంతన్
జెడనున్న ప్రాణ మనిలో, విడువక పోనాడుభటుఁడు వేదురు గాఁడే. 423

క. సుతులకుఁ దలప్రాపుగ భూ, పతిఋణమునఁ బోయి తెవులఁ బడి చచ్చి యధో
గతి బొఱఁగుకంటెభటునకు, శతమఖపురిఁ జూఱగొనుటఁ జావనినరుఁడే. 424

— పురుషార్థసారము

ఆ.వె. అఖిలసంపదలకు నావాసముగఁజేసి
నట్టిదాత కెదరు పుట్టినపుడు
దరణి నేభటుండు తనప్రాణములు దాఁచు
నతఁడు నరకమునకు నరుగు వేగ. 425

—పంచతంత్రి

క. కులభృత్యులైన సద్భృ, త్యులకును సత్కారసమృద్ధితోఁ జేయుదె వా
రలు నీప్రస్తవమున ని, మ్ములఁ గృత్యము దలఁచి ప్రాణములువిడుతురనిన్.

క అనఘా నీప్రస్తవమున, నని నీల్గినవీరభటులయసుఁగుజనుల నె
ల్లను బ్రోతె భోజనాచ్ఛా, దనముల వారలకు నెమ్మిఁ దఱుగకయుండన్. 427

క. జనపతి ప్రాణము లిచ్చినఁ, జనువారలఁ బ్రోవకున్న సత్యము పాపం
బునఁ బొరయు వారిఁ బ్రోచిన, తనవారిని బ్రోచు మీఁద దైవము గరుణన్. 428

గీ. ప్రాణ మిచ్చియు రణమున బ్రతికెనేని, నతనిరక్షించు దనకొఱకైన రాజు
శూరవృత్తిని మోక్షంబు సూఱగొన్న, వారివారలఁ బ్రోవంగ వలయుఁగాని. 429
—సభాపర్వము

ఆ.వె. యోగులకును లేదు యాగముల్ సేసిన, వారలకును లేదు వసుధమీఁదఁ
బతికి హితవు గాఁగఁ బ్రాణంబు విడనోపు, నలఘుసేవకులకుఁ గలుగు
సుగతి. 430

క. దురమునఁ జచ్చినఁజయ్యనఁ, బరమందుం బ్రతికెనేని బహుసుఖకీర్తుల్
దొరకును గావున రెండును, నరుదులు సిద్ధించు శూరు లగువారలకున్. 431

క. కడునభ్యంతరవర్తిం, బుడమీశుకుఁగాఁగఁ బ్రాణములు విడిచిన ని
క్కడ నురుతరకీర్తియు న,క్కడ మఱి సాయుజ్యపదము గల్గు ధ్రువంబై. 432

ఆ.వె. కోరి తనధనంబుకొఱకును విప్రుల
కొఱకు సతులకొఱకు గోగణంబు
కొఱకు నని యొనర్చి నెఱయ నెవ్వఁడు ప్రాణ
మిచ్చు నతఁడు ముక్తికీశ్వరుండు. 433

క. తనయేలిక కగుచుట్టము, తనచుట్టము తననిజేశుదాయయ మిగులన్
దనదాయయు ననుతలఁపున, మను నెవ్వఁడు ప్రియుఁడుమనుజేశునకున్. 434

చ. చెలువుగ దుష్కరంపుఁబని చేసితి నొక్కెడ నాక క్రూరతన్
బలుమఱుఁ జేసిన న్గడవఁబల్కిన నుల్లములోన నొండుగాఁ
దలఁపక పల్కు టొప్పిదము తథ్యముగాఁ దగఁ బల్కు లోపలం
బిలువక వచ్చియున్నతఁడు భృత్యుఁడు రాజున కెన్నిభంగులన్. 435

క. మానవనాథున కగు భయ, హానులు మదిఁ దానె యెఱిఁగి యతిరభసమునన్
వానికి నెవ్వం డడ్డము, నై నిలిచినవాఁడు మాన్యుఁడగు రాజునకున్. 436

ఆ.వె. అన్యదేశమెల్ల నాత్మదేశంబ కాఁ, దలఁచువాఁడు నెపుడు దలఁకు లేక
రణము సేఁత యెల్లరాజ్యంబు సేఁతగాఁ, దలఁచువాఁడుఁ బ్రియుఁడు
ధరణిపునకు. 437

క. మానుగఁ బతి పనిచినఁ దమ, చే నిది గా దనక వేగఁ జేకొని యనలం
బైనఁ జొరవలయు నంబుధి, యైనను నీఁదంగవలయు నర్థిన భృత్యుల్. 438
—పంచతంత్రి

క. దూరమున వెరవు గదిసిన, దారి నిలుచువారి నృపతి దగు మన్నింపన్
దూరమున బిఱుదు గదిసినఁ దా రచ్చట లేనివారిఁ దగు వర్జింపన్. 439
—నీతిభూషణము

క. ఏయేలిక సేవింపఁగ, బాయక యేభృత్యులకును బహుదుఃఖమ కా
నాయేలిక దూరమునన, నాయతమతి విడువవలయు నాభృత్యులకున్. 440

క. ధనవంతుఁడు సత్కులజుఁడు, ననుపమతరవిక్రముండు నైనను ధరలో
ననభిజ్ఞుఁడైన భూపతి, ననుమానము లేదు విడుతు రరయఁగ భృత్యుల్. 441

క. వలచేయును డాచేయును, బొలుపుగ రత్నంబు గాజుపూసయు సరిగాఁ
దలఁచునృపునొద్ద నుండినఁ, జులుకన యగుఁ దప్ప దెంతశూరుండైనన్. 442
—పంచతంత్రి

క. పతి కీడైనను భృత్యుఁడు, పతిహితుఁడై యుండవలయు బ్రతుకఁగరా కా
పతిఁబాసి చనిన వేఱొక, పతియైనను బ్రోచుఁ దొంటిపతిహితుఁడనుచున్. 443
—పురుషార్థసారము

## భృత్యులకుఁగొఱగాని రాజుల లక్షణము

క. అకుటిలు లగు తనభృత్యుల, కొకయాపద ముట్టినప్పు డుడుపక యేయే
లిక యూరకుండు నాయే, లిక ముక్తికి మిగుల నెడ గలిగియుండుఁ దుదిన్.

క. పలికినజీతముఁ గెడపిన, బలవంతునినైన విడుచుఁ బరివారము దాఁ
బొలు పెఱుఁగనియేలిక నిల. ఫలహీనకుజంబు విడుచుపక్షులఁబోలెన్. 445
—పంచతంత్రి

క. దొర వడయవలయునొండెను, సిరి వడయఁగవలయు నృపతిచే భృత్యులకున్
దొరయును సిరియును వెలిగా,నరపతులను గొల్చు టేల నయతత్త్వనిధీ. 464

క. కోపప్రసాదములలోఁ, గోపమె చూపుచుఁ బ్రసాదగుణ మెయ్యెడలన్
జూపనినరపతిఁ గొల్చిన, పాపమునకు మేర యెద్ది బద్దెనరేంద్రా. 447

ఉ. జీవిత మీఁదు మ న్నడవఁజేసినవృత్తి క్రమక్రమంబునన్
బోవఁగఁజూచుఁ దేజమునఁ బుట్టెడు లాభము దప్పఁజేయు స
ద్భావము బొంకుగా వగచుఁ బాయక నేరమె రోయుఁగావునన్
సేవకులన్ విరక్తనృపుసేవ విపజ్జలరాశి ముంపదే. 448

—బద్దెనసీతి

ఆ.వె. వల్లకాట నిడినవానికిఁ జెప్పెడి, వారు గలరె యెంతవారికైన
నట్లె పెట్టలేని యవనిపాలకునొద్దఁ, బట్టియుండ రెపుడు పరిజనములు. 449

—పంచతంత్రి

## రాజులకుఁ గొలుగాని భృత్యులు

చ. ఒకరునిచేతఁ గ్రోపును దదున్నతిఁ బ్రాపును గాంచి యెల్లపెం
టకును గొలంత లేక పొగడందగు సంపద నొందునట్టి దా
తకు మదిఁ గీడుచేసినకృతఘ్ను నిపీనుఁగునైన రోఁతవె
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా. 450

ఉ. ధీరత ఒక్క భీతిఁబడి దీటమి నిల్వక పాఱి పాఱి వీ
రారులచేతఁ జచ్చినభటాధము లేలినవానిదుష్కృతం
బారఁగ నంతయున్ గుడుచునాతఁడు చేసినపుణ్యమంతయున్
జేరుఁ బడీయభర్తకని చెప్పుదు రుత్తమధర్మకోవిదుల్. 451

—విదురనీతి

ఆ.వె. ఆయుధముల నెపుడు నలజడిఁబెట్టక
చిత్రకథలు కొన్ని చెప్పికొనుచు
నుండుభటులు గలుగునుర్వీశ్వరులలక్ష్మి
లహితు లనుభవింతు రంద్రు బుధులు. 452

—పంచతంత్రి

క. తను నమ్మిపై రిమీఁదం, జన వానికిఁ బ్రాణ మీక చనుటయు ద్రోహం
బని రిపునిఁ గూడెనేనియుఁ, జనునే యుద్దండ మైనజనపతిదానిన్. 453

—నీతిసారము

క. కలిమియును భూరిబలమును
గలయంతకు భటుఁడు భటుఁడు గాఁడు దలంపన్
గలిమియును భూరిబలమును
గలిగిన మఱి భటుఁడు భటుఁడు గాఁ దేవతికిన్. 454

—పంచతంత్రి

## సేవకనీతులు

క. ధరణీసురవరులకు నృప, వరులకు వైశ్యులకు నాత్మవర్తనములకున్
బరిచరులు లేక నడవమి, సరసిజసంభవుఁడు శూద్రజాతి సృజించెన్. 455

క. అతులితవిద్వజ్జనులకు
వితరణశీలురకు విశ్వవిక్రమసేవా
గతులకు రాజులు దక్కఁగ
మతిఁ దలపఁగ నొరులు దిక్కు మఱి కలుగుదురే. 456

క. మనుజపతి దేవతామయుఁ, డని మనువాక్యంబు గాన యారీతిన కాఁ
గొనవలయు నతని నొండుగ, మనంబునం జూడవలదు మతిమంతులకున్. 457

క. దేవాంశోద్భవుఁ డగునర, దేవోత్తము మర్త్యుఁ డని మదిం దలఁపక స
ద్భావమున నీశ్వరుం డని, భావింపఁగవలయు నరులు బాలుని నైనన్. 458

—పురుషార్థసారము

క. అవనీశుల వేల్పులలో, నవనిపులు విశేష మతిశుభాశుభములు దా
నవనిపు లిప్పుడ నూపుదు, రవి వేల్పులు నూపఁజాల రాజన్మమునన్. 459

క. కడుహితులకు నహితులకును,
వడిమేలును గీడుఁ జేయవలసినవారల్
పుడమిపులఁ గొలువవలయును
గడు పెవ్వఁడుఁ బ్రోచుకొనఁడె కరటక చెపుమా. 460

—పంచతంత్రి

క. తక్కు నయాత్ముఁడు గలఁడే, యెక్కుడుగా నెత్తి పలికి హిత మెఱిఁగింపన్
జెక్కిలి మీటుట కూరిమి, తక్కుటయే పాలుపోయుతఱి బాలునకున్. 461

క. స్థిరమతి నెప్పుడు నిజమం
దిరమునఁ దద్వారమునను డెల్లముగా సం
గరమునసుం గ్రమ్మన నే
నరుఁడుండు నతండు ప్రియుఁడు నరనాథునకున్. 462

—నీతిభూషణము

క. జూదమును బన్నిదంబును, వాదును బతితోడఁ దేఁడవలవదు కడుఁ బో
రాదయ్యేనేని భృత్యులు, భేదము గాకుండ గెలుపుపెం పీవలయున్. 463

—నీతిసారము

క. మొగ మలరఁ జూచిరమ్మను, టగుఁబొమ్మని మాటవినుట యడిగిన కార్యం
బొగిఁ జేయుట పనిఁబంచుట, జగదీశ్వరుకూర్మికిని నిజం బగుచేష్టల్. 464

సీ. పొడగనునంత నప్పుడ ప్రసన్నుం డగుఁ దనుఁ జేరఁ బిలుచు నాసనము నిచ్చు
క్షేమప్రసంగంబుఁ బ్రేమమై నడుగుఁ దద్వాక్యంబు వినుచు ముదంబు నొందు
విజనస్థలంబున నిజరహస్యంబులు గొంకఁ డొక్కింతయు శంకపడఁడు
ఆతఁడు సెప్పుచో నతనిఁ జెప్పినచోట నాకర్ణనముఁ జేయు నాదరమున

గీ. వినుతిపాత్రులలోపల వినుతిఁ జేయు
నతని వినుతింప మెచ్చుఁ గథాంతరముల
దలముగాఁ దద్గుణములు కీర్తనము సేయుఁ
జాల ననురక్తుఁ డైనట్టిజనవిభుండు.

465

—పురుషార్థసారము

క. వచ్చినఁ జూడమి దగ్గఱ
వచ్చిన నొడఁబడమి తోడ వచ్చిన నొరుతోఁ
జెచ్చెరఁ బలుకుట పతిఁ దా
మెచ్చమియును భృత్యునొల్లమికి లక్షణముల్.

466

——చాటువు

క. దుర్వేషియు నకులీనుఁడు
గర్వియుఁ గడుదుర్జనాగ్రగణ్యుం డైనన్
సర్వత్ర వాఁడు పూజ్యుఁడె
యుర్వీశ్వరు మిగులఁ జేరి యుండినఁ జాలున్.

467

క. శ్రీయుతు లగునరనాథులఁ, బాయక సేవింపకుండు పాపాత్ములకున్
వేయేల తిరియఁజేఁతయె, ప్రాయశ్చిత్తంబు సుమ్ము పరికింపంగన్. 468

క. వెలిగొడుగులు చామరములు, బలువాజులు నందలములు భద్రేభంబుల్
వెలసినభూనాథునికృప, గలవారికిఁ గాక యెందుఁ గలవే ధరణిన్. 469

క. బలుగొడుగువోలె నెండకుఁ, జలికిని వానకును నోర్చి జనపతి నెవ్వం
డలవడఁ గొలుచును వానికి, వలనొప్పఁగ సిరులు దాన వచ్చి వసించున్ 470

ఆ.వె. మాన్యతయును గడు నమాన్యతయును మఱి
సరియె కాఁ దలంచునరులు పిదప
నుగ్రమూర్తు లైనయుర్వీశ్వరులకును
మిగులఁ దారె మాన్యు లగుదు రెపుడు. 471

క. క్షితిపతికి మిగులఁ బ్రియులును,హితులును నగువారి నాశ్రయింపఁగవలయున్
సతతము వారలయాజ్ఞకు,నతిఁ గడవక యుండవలయు నతిమతిమంతుల్.472

క. ఘనసేవకయుతులకు నఘ, మును పుణ్యములును విశేషములు గానివి దాఁ
గొనుఁగొన భూశయలఘుభో, జనముఁ గృశత్వంబు బ్రహ్మచర్యము
సమముల్. 473

ఆ.వె. సేవకుండు గోరి సిగ్గఱి వ్యాధిక, ష్టములు సనముకొఱకు సంతతంబు
నధిపునొద్దఁ బడినయట్లు ధర్మమునకుఁ, బడియెనేని సుగతిఁ బడయరాదె 474

క సురచిరగుణవంతుం డగు, ధరణీశుఁడు పేదయైనఁ దగు సేవింపన్
నెరయఁగ నొకానొకప్పటి, కరుదుగ మేలొందుఁగాన నాయనవలనన్. 475

క. వలయుపను లెఱిఁగి చేయుచుఁ, బలికినఁ బని యేమి యనుచుఁ బాయకనీతిన్
గొలువఁగ నేర్చినయాతఁడె,తలపోయఁగ మిగులఁ బ్రియుఁడు ధరణీశునకున్.

క. మన సెఱిఁగి నడవనేర్చిన
మనుజాళను లైన మాటమాత్రములోనన్
దనవశ్యు లగుదు రవనిన
మనుజేశ్వరుఁ డనఁగ నెంత మది నూహింపన్. 477

—పంచతంత్రి

క. సకలగుణరత్నభూషా, ప్రకటితుఁడై యర్థశౌచపరుఁడై భూపా
లకుమనమున విశ్వాసము, వికసిల్లెడునట్లు సేవ వెసఁ జేయఁ దగున్. 478
—కామందకము

క. జనపతికృపఁ బడసిన ధన, మనయము దగువ్యయము చేసి యంచితవస్త్రా
ద్యనుపమవస్తువు లొసఁగిన, మన ముల్లర ధరించినతఁడు మాన్యతఁ బొందున్.
—పంచతంత్రి

చ. ధరణిపుచక్కఁగట్టెమరఁ దక్కఁ బిలుందును గానియట్లు గా
నిరుగెలనం దగం గొలచి యే మనునో యెటు సూచునొక్కొ యె
వ్వరిదెస నెప్పు డేతలఁపు వచ్చునొ యాతని కంచుఁ జూడ్కి సు
స్థిరముగఁ దన్ముఖంబునన సేర్చుచునుండుట నీతి కొల్వునన్. 480

క. నగళులలోపలిమాటలు, తగునే పెలి నుగ్గడింపఁ దమ కేర్పడ నొం
డుగడం బుట్టినపని విన, నగుపని సెప్పెడిదిగాక యాతనితోడన్. 481

క. తా నెంతయాప్తుఁడైన మ, నాయకుసొమ్ము పాముసొమ్ములుగా లో
నూనినభయమునఁ బొరయక, మానినఁగా కేల గల్గు మానము సిరియున్. 482

ఆ.వె. ఆవులింత తుమ్ము హాస్యంబు నిష్ఠీవ, నంబు గుప్తవర్తనములు గాఁగ
నిలుపవలయు నృపతి గొలువున్నయెడల బా, హిరములైనఁ గెలని కెగ్గు పుట్టు.
—ధౌమ్యనీతి

ఆ.వె. ద్యూత మెల్ల జమునిదూతయుగా ధనం, బెల్ల హాలహలము నింతు లెల్ల
ఘోరతరములైనకారాగృహములుగఁ, దలచునతఁడు ప్రియుఁడు ధరణిపునకు.
—పంచతంత్రి

క. పతిచీర లట్టిచీరలు, పతితొడవులఁ బోలుతొడవు పతిగతివేష
స్థితియును సేవకులకుఁ దగ, దతిఘనయుతులైన నసుఁగులైనను సభలోన్.
—నీతిసారము

క. కలిమికి భోగములకుఁ దా, ఫల మని తను మెఱసి బట్టబయలుగఁ దా వి
చ్చలవిడి భోగింపక వే, డ్కలు సలుపఁగవలయు భటుఁ డడంకువతోడన్.
—ధౌమ్యనీతి

క. చనువాఁడు సేయుకార్యం, బున కడ్డము సొచ్చి నేరుపున మెలఁగుచుఁ దా
నను బైఁ బూసికొనుటదన, మును మెలఁగెడు మెలఁకువకును ముప్పగుఁ
బిదపన్. 487

ఆ.వె. రాజు పెద్ద పలువురకు సంకటంబుగాఁ, దెలఁగుపనుల కెంతతేజమైన
వారు బుద్ధిగలుగువా రొల్లరని మీఁదఁ, జేటువచ్చు నెల్ల సిద్ధ మగుట. 488

ఆ.వె. ఉత్తమాసనములు నుత్కృష్టవాహనం,బులును దమకుఁగరుణ భూమిపాలుఁ
డీక తార యెక్కు నెంతటి మంత్రియుఁ, గలుగువారికైనఁ గార్యమగునె. 489

—ధృతరాష్ట్ర నీతి

ఆ.వె. కామధేను వనఁగఁ గల్పవృక్షం బన
నెసఁగు రాజు దనకు నొసఁగఁడేని
తనయదృష్ట మనుట దగుఁగాక యాతని
దూఱఁ గలదె సేవ మీఱి యైన. 490

—నీతిసారము

## సేవకుఁ గొఱగానిరాజులు

క. పొసఁగిన సేవకు నెఱుఁగని, వసుధేశ్వరుఁ డెంతదొడ్డవాఁడైన నొగిన్
గుసుమఫలభరిత మైనను, వెస జిల్లెడు విడిచినట్లు విడువఁగ వలయున్. 491

క. సేవ యెఱుంగని రాజును, సేవింపరు బుధులు గాక సేవించినఁ ద
త్సేవ యది చౌటఁ బెట్టిన, యావిత్తునుబోలె వ్యర్థమై చెడిపోవున్. 492

క. ఇల నవివేకనృపాలునిఁ, జెలు వందగఁ గోరి సేవ సేయుట లెల్లన్
దలపోయఁ జౌటినేలను, విలసిల్లినబీజ మిడినవిధము దలంపన్. 493

ఆ వె. భైక్షమైన మేలు భారోపజీవితం
బైన మేలు కానలోన నుండు
టైన మేలు గాని యవివేకనృపుఁ గొల్చి
పొరయులక్ష్మి లొప్ప వరసి చూడ. 494

—పంచతంత్రి

ఉ. పలుకులచెప్పువంబులకుఁ బ్రాప్త మెఱుంగమి కెంత దప్పినన్
వలఁదుమికెప్పితప్పుట కుదారప్రవృత్తికి శౌర్యశక్తిభ
క్తులకు మనంబులోనఁ బరితోషముఁ బొందకయున్కి కాత్మలో
నలసి పరిత్యజింతు రెడ కా వెడ నేలినవాని సేవకుల్. 495

—పురుషార్థసారము

క. తెలసము చేసియు నవసినఁ, గొలిచిన కొద వట్లి యీని కువలయపతులన్
గొలు వేటి కుత్తరోత్తర, ఫలసారమె రాజసేవ బద్దెనరేంద్రా. 496

—బద్దెనీతి

ఉ. ఇల వ్యసనుండు క్షుద్రుఁడును నెంతయు మూర్ఖుఁడు నైనయట్టి భూ
తలపతిఁ జేరఁగూడ దది తప్పగుఁ దొల్లియు నిట్టిరాజు నిం
పలరఁగ సేవఁ జేసికొని న్యాయము నాసపడంగఁ బోవుచున్
దెంచన నేరమిన్ శకడి భృత్యుపులందఱుఁ జేటు నొందరే. 497

క. తను సర్వభక్షుఁడగు వి
ప్రుని ననుకూలతయుఁ గానిపొలఁతిని మిగులం
దిన కెనయనిసఖు నెల్లం
దను గరుణయె చేయునృపునిఁ దొలఁగఁగవలయున్. 498

—పంచతంత్రి

క. నేరమి దొడరిన నలుగఁగ, నేరకయుండెడివిరక్తనృపతుల కొలువుల్
మూర్ఖులు గాకుండెడి, వారలు దుర్మతు లుదారవై రోచనుఁడా. 499

—బద్దెనీతి

ఆ.వె. ఎట్టిభృత్యుఁడైన నేలిక కించుక
తప్పు సేసెనేని తలఁప మద్య
బిందుమాత్రమునన పెరుగుబ్రాహ్మణ్యంబు
చెడినయట్ల వాఁడు చెడుట నిజము. 500

—పంచతంత్రి

ఉ. జీతము లూదికొంద్రు పతిచిత్తము గూడరు వారు స్వేచ్ఛలై
భూతలనాథ వీ డురిలిపోవఁగఁ జూతురు పోవకుండినన్

వేతురు విగ్రహవ్యసనవృత్తి భయస్థులు గారు గాన సం
ఘాతసమర్థులై మనుమగల్ ప్రతిపక్షులు గాక భృత్యులే. 501

—బద్దెననీతి

క. ఏమ కరిఁ గుడిపి పెంచితి, మే మెఱిఁగింపంగ విద్య యెఱిఁగె నజస్రం
బే మక్కడ నుందుము మా, కేమని యేమఱినఁ జంపు నేనుఁగుఁ బతినేన్.502

—పురుషార్థసారము

క. ఏ నితనికి మాన్యుఁడ నని, భూనాథునికరుం నమ్మి పొంగి భటుఁడు సే
వానియతి వదలు టొప్పదు, నానాఁటికిఁ గ్రొత్తమన్ననలు నృపతులకున్.503

—నీతిభూషణము

క. నైజగుణం బగుతమమది, రాజన మప్పటికిఁ గప్పి ప్రజతో నయ్యో
యోజం బరికింపనియా, రాజులు సాధు లని నమ్మరా దెప్పటికిన్. 504

—కేయూరబాహుచరిత్రము

క. జనపతికి నేను మాన్యుఁడ
నని యెవ్వఁ డహంకరించు నాతఁడు లోక
మ్మునఁ జరణంబులు రెండై
వినుము విషాణములు లేనివృషభముఁ బోలున్. 505

చ. ఇల గుణహీను లెంతయు మహీశుసమీపగు లైనవారు ని
ర్మలగుణయుక్తులం గని యమాన్యత సేయుదు రేల వారు వా
రలయెదుర న్వెలింగెడి తరంబులు గామిని గాన నేల రా
త్రులవలె మించు నే మిగులఁ దోయజబంధునిమ్రోల దీపముల్. 506

గీ. సేవకాళి యన్యసేవకులను రాజు
చాలఁ బెద్దసేఁత సైపఁజాల
రరయ నొక్కమగనియాండ్రు దా రయ్యును
సవఁతి జూచి సవతి సైపఁగలదె. 507

క. తనపదము ద్రోప నెవ్వఁడు
గొను నాతఁడు తనకు నిపుడు గొనకొని వారిం
దునుమాడుఁ దనకుఁ జయ్యన
నెనయనివాఁ డెంత దనకు హితుఁడై యున్నన్. 508

క. అరయఁగ జీవన్మృతు లే, గురు నిర్ధనికుండు నరసికుఁడు మూర్ఖుఁడు భూ
వరసేవకుఁడు ప్రవాసియుఁ, బరఁగుఁబరాశరతనూజుపలు కిది ధరణిన్. 509

క. రాజాధికారపురుషుని, పై జయముండునని మృత్యుపాశము లుండున్
నైజమునఁబట్టి పలు కే, యోజమెయిం జెప్పమతియె యోగ్యుండైనన్. 510
—పంచతంత్రి

క. తమబ్రతుకు తమకుఁ గడువిర, సము చింతకుఁ బొత్తు మానసంబు పరాధీ
నము లైశ్వర్యంబులు స, ర్వము సేవకు లెవ్వ రరయ వారలకెల్లన్. 511
—పంచతంత్రి

## షోడశసంధిప్రకారము

సీ. ఒనరఁ గపాలంబు నుపహారసంధియు సంతానసంధియు సంగతంబుఁ
జాల నుపన్యాససంధియుఁ బ్రతికారసంధియు సంయోగసంధికంబుఁ
బురుషాంతరాదృష్టనరనామకమ్ములు నాదిష్టకంబు నాత్మామిషంబు
పరిక్రయవిగ్రహబంధురోపగ్రహసంధులు నుచ్ఛిన్నసంధికంబు

ఆ.వె. ననుపమపరదూషణాంచితస్కంధోప, నేయసంధు లనఁగ నిశ్చితముగ
షోడశప్రకారసునిశితసంధివి. ధాన మెఱుఁగవలయు ధరణిపునకు. 512

గీ. బలిమి సమసంధియైనఁ గపాలసంధి, యర్థదానముచే నుపహారసంధి
దారికాదాన మీగి సంతానసంధి, చాలమైత్రిపూర్వక మది సంగడంబు. 513
—పంచతంత్రి

గీ. అరయ నేకార్థముగ నుపన్యాసచతురు, లమరఁ గూర్చినయది యుపన్యాససంధి
కడఁగి యుపకర్త ప్రత్యుపకారకాంక్షఁ, గలసి మెదలుట యది ప్రతీకారసంధి.

గీ. అతని కుపకార మొనరించి యతనిచేతఁ
గొరలి ప్రత్యుపకారంబు గొనఁగవలయు
ననుచు రాముఁడు సుగ్రీవు నాప్తుఁజేయు
కరణిఁ గలయుట యది ప్రతీకారసంధి. 515

క. ఇరువురుఁ గూడి యొకనిపై, నరుగుట సంయోగసంధి యగుఁ బణపూర్వం
బిరువురు యోధులఁ బంపుట, బురుషాంతరసంధి యనఁగ బుధమతమయ్యెన్.

క. అరిమీఁదఁ బనుపుతలఁపునఁ, దిరముగ సంధి యగునది యదృష్టనరాఖ్యం
బరయఁగ నాదిష్టం బగుఁ, బరునకు భూమ్యేకదేశపణ మిచ్చుటయున్. 517

సీ. ఆత్మసైన్యముచేత నరితోడ సంధాన మాత్మామిషం బన నతిశయిల్లుఁ
బ్రాకారరక్షార్థమై యఖిలం బైనవిత్తంబు నిచ్చుట విగ్రహంబు
యఖిలప్రకృతిరక్షణార్థమై యర్థప్రకృతి నిచ్చునది పరిక్రీణసంధి
సారభూములు గొన్ని వైరిభూపతి కిచ్చి చేసిన నదియ యుచ్ఛిన్నసంధి

గీ. సర్వభూమిఫలంబును శత్రువునకుఁ
దోరముగ నిచ్చునది పరదూషణంబు
మిత్తు లొనర్చి ధనం బిడ మతిఁ దలంచి
చేయునది పునఃస్కంధోపనేయసంధి. 518

క. ఇతరేతరోపకారము, సతతోదితమైత్రి సంధిసంబంధజముల్
చతురత నుపహారము నీ, చతుర్విధమునందు సర్వసంధులు నయ్యెన్. 519

క. ఖలుఁడును నిర్మర్యాదుఁడు, బలవంతులు నైనరిపునృపాలురతో ని
య్యల సంధివిగ్రహము లవి, యలవడ వేవేలునైనయానమతక్కన్. 520

క. ఘనబలుఁడు పాపకర్ముఁడు, ననఁబడురిపుసంధివిగ్రహంబులయెడలన్
గనద్వైధీభావము గై, కొని యుండఁగవలయుఁ బగఱకును నయ్యెడలన్. 521

గీ. తాపఖండనంబులవికృతంబు గాక, సదృశకార్యార్థ మదియ యసహ్యవేళ
కాంచనమపోలె నెన్నండు గలసియునికి, సంగతాఖ్యము కాంచనసంధియయ్యె.

ఉ. చాల బలాద్యయోగ మది సంధి యశంబొకొ పూర్వకక్రియన్
మేలగుఁ గాన సంగతము మిత్రము దా నవి శూన్య మైననుం
బోలగుసంధి నా నితరము ల్దగు నాయుపహారసంధి భే
దాలియకారసంధి కుపహారము యెక్కటి సంగతం బగున్. 523

క. ఎత్తిచనున్నృపతి రిపుచే, విత్తముఁ గప్పంబు గొనక వెనుకకు మగుడం
డిత్తటి సంధికి దానం, బుత్తమ మట్లగుట సంధి యుపహార మగున్. 524

వ. అసంధిదేహస్వరూపం బెట్టి దనిన.

సీ. బాలుండు వృద్ధుండు పటుదీర్ఘరోగియు నిల నిజజ్ఞాతిబహిష్కృతుండు
భీరుకుండును గడు భీరుజనుండును లుబ్ధుండు మఱియును లుబ్ధజనుఁడు
సతతవిరక్తప్రకృతియైననృపతియు విషయరసాసక్త విరళమతియు
మఱియును బహుచిత్తమంత్రుండు దేవతాబ్రాహ్మణనిందాపరాయణుండు

గీ. దైవహతకుండు దైవచింతనపరుండు
వ్యసనదుర్భిక్షకుఁడు బలవ్యసనపరుఁడు
లలి నదేశస్థబహుశాత్రవులును గాల
యుక్తుఁడును సత్యధర్మవియుక్తమతియు. 525

క. ఈయిరువదుపురతోడన్, బాయక విగ్రహము సేసి పైకొనుటయు వా
రేమెడ మాన్కొనక బల, శ్రీ యఱి వశవర్తులగుచు సిరి యిత్తురలన్. 527

వ. అది యె ట్లనిన.

గీ. బాలుఁ డరయ నప్రభావుండు గావున, యుద్ధములకు బలము లోహటించి
తనకు శక్తి లేక తక్కిన నితనికై, పూని యితరుఁ డేల పోల నిచ్చు. 529

క. వృద్ధుఁడు దీర్ఘామయుఁడు న, మిద్ధోత్సాహంబు లేమి మేకొని యరితో
యుద్ధంబున కసమర్థులు, సిద్ధము నిజజనులతోడఁ జెడుదురు పెలుచన్. 530

క. మతిసకలజ్ఞాతిబహి
ష్కృతుని నిజజ్ఞాతులకు విశేషప్రియాం
చితకృత్యము లొనరించినఁ
జతురతఁ దమరిపునిఁ బట్టి సమయింతు రొగిన్. 531

సీ. భీరుఁడు సంగ్రామభీతుండు గావున విజిగీష లెత్తిన వేగఁ జెడును
భీరుజనుం డెంత భీతుఁడై యనిమొనఁ దనవారు వాఱంగఁ దాన చిక్కు
లుబ్ధుఁ డేమియు నీమి లులితచేతస్కులై నిజభటు లాజిలో నిలువఁబడరు
లుబ్ధజనుఁడు మఱి లుబ్ధపరాధీనమతు లగుజనులచే మడియుఁ దాన

గీ. సతతము విరక్తుఁ డైనభూపతియు నెల్ల
ప్రకృతివర్గంబు విడుచు సంగ్రామభూమి

విషయసంసక్తమతియగు వికలహృదయుఁ
డుడుక ప్రత్యర్థికి సుఖాభియోగ్యుఁడగును. 532

ఆ.వె. మఱియు వినుమనేకమంత్రులచిత్తముల్
చంచలములు గాన సచివు లెల్లఁ
గార్య మొదవినపుడు కడఁగి యుపేక్షింతు
రతఁడు మను విరోధి యగుటఁ జేసి. 533

క. దేవబ్రాహ్మణనిందకుఁ, డేవెరవునఁ బొలియు ధర్మహీనుం డగుటన్
గేవలము దేవహాతకుఁడు, భావింపఁగ నట్లు చెడు నభాగ్యుం డగుటన్. 534

ఆ.వె. దైవ మఖిలమునకుఁ దానె కారణ మని
చేష్ట యతనిదైవచింత నుండు
క్షయము నొందుఁ దాన నయము దుర్భిక్షవ్య
సని బలవ్యసనికి శక్తి లేదు. 535

క. వ్యాయామాయోగ్యం బగు, నాయెడయ యదేశ మనుట నల్పుఁడు చెఱుచున్
వే యేల కచ్ఛపముచేఁ, దోయాంతరమున గజంబు తూలదె పెలుచన్. 536

క. బహుళశ్రముఁ డెందు వచ్చిన నహితులు వెనుదగిలి చెఱుతు రయ్యెచోట్లన్
బహుళమహావిపినాంతర, విహిత మగుకపోత మట్లు నిర్భరవృత్తిన్. 537

ఆ.వె. సరి నకాలయుక్తసైన్యుఁ డాహవకాల, యుక్తసైన్యుచేత నుక్కడంగు
అర్ధరాత్రసమయమందుఁ గానఁగలేక, గూబచేతఁ గాకకులముఁబోలె. 538

గీ. సత్యధర్మవ్యపేతుతో సంధి యొప్ప
దతఁ డసాధుఁడ గావున నప్పుడ తిరుగు
నిట్లు సందేహన్నృపతుల నెఱిఁగి వారి
తోడిసంధానమున కొనఁగూడఁజనదు. 539

—కామందకము

వ. మఱియు సందేహస్వరూపం బెట్టి దనిన. 540

గీ. అనఁదు సర్వార్థధార్మికానార్యనృపులు
భ్రాతృసంఘాతవంతుండు బలఘనుండు
ననుపమానైకవిజయుండు ననఁగ నేడ్వు
రొప్పుదురు సంధి సేయంగ యోగ్యు లగుచు. 541

ఉ. సత్యుఁడు సత్యవాక్ప్రియతసంహితుఁడై వికృతుండు గాఁడు ప్రా
ణాత్యయమైన నార్యుఁడు ననార్యతఁ బొందఁడు యుక్తకారియై
సత్యము ధార్మికప్రభుఁ డసాధ్యుఁడు ధర్మజనానురాగసాం
గత్యము యుద్ధసాధనము గావున సంధి యొనర్చు టొప్పగున్. 542

చ. తొడఁగి యసాధ్యుఁ డైననృపుతోఁ దగు సంధి యొనర్పకుండినన్
గడఁగి తదీయశత్రువులఁ గైకొని వచ్చి యయుక్తకారియై
యడఁచు సమూలకందముగ నారయ భ్రాతృసమేతుఁ డొప్పు బ
ల్పిడిఁ బటుకంటకాకలితవేణునికుంజమున ట్లసాధ్యుఁ డై. 543

సీ. బలవంతుఁ డెంతయుఁ బైనెత్తివచ్చిన నేయత్నములు మఱి యేమి సేయు
హరివరాధిష్ఠిత హారిణంబునకుఁబోలె నమ్మేటి దగుశరణమ్ము గలదె
మార్కొన నోడిన మత్తగజేంద్రంబునొడియుసింహముఁబోలెనొప్పుగొనఁడె
బలవంతుతోడ నెబ్బంగినైనను బోరు మనుచుఁ జెప్పెడినిదర్శనము గలదె

గీ. యుబుక పెనుగాలి కెదురుగాఁ దఱమవశమె
కాన శుభకాంక్షియైన భూకాంతుఁ డెపుడు
త్రివిధశక్తిసమగ్రుఁ డేతెంచెనేని
సంధి యగునది కార్య మసంశయంబు. 544

క. బల్లిదునకుఁ బ్రణమిల్లుచు, మెల్లన కాలముల విక్రమించెడిజనులం
బెల్లెడఁ బాయవు సంపద, లల్లన జలరాశిఁ బొందునాపగలక్రియన్. 545

చ. బహు యనేకయుద్ధవిజయుం డగురాజు ప్రతాపవహ్నిచే
నని రిపుకోటిఁ గ్రాఁచుజమదగ్నితనూభవునట్ల వారితో
ననుపగ సంధి చేసికొని యాతనిదోర్బలశక్తిప్రాపునన్
మనుమనుజేంద్రుని న్మొరసి మార్కొన నోడుదు రన్యభూపతుల్. 546

క. బలియుడెన సంధి యయ్యును
బొలుపుగ నమ్మంగవలదు పురుహూతుఁడు ము
న్నలవడ సమయము దలఁపక
పొలియింపఁడె వృత్రుఁ గుటిలబుద్ధిప్రౌఢిన్. 547

వ. మఱియు నధికసమానహీనాభియోక్తృసంధిస్వరూపంబు. 548

మ. బలవంతుం డరుదెంచి పై విడిసినన్ బాటించి దుర్గస్థుఁ డై
కలఁగంబాఱక యంతకంబె బలియుం గారామునం దెచ్చి యా
బలవంతు న్విడిపించుటొండె భుజదర్పం బొప్ప సింహోల్లస
ద్బలుఁ డై పైఁబడుటొండె నొప్పగు భరద్వాజోక్తమార్గంబునన్. 549

క. తనయుండు తండ్రి నైనను
దనయుని మఱి తండ్రి యైనఁ దఱికొని త్రుంచున్
ఘనరాజ్యగాంక్షిఁ గావున
జనచరితములట్ల గావు జనపాలునకున్. 550

మ. మదమాతంగసహస్రసంఘముల నున్మాదించి సింహం బొకం
డదరంటన్ వెసఁ దాఁకి త్రుంచునటు లుద్యద్బాహువిక్రాంతిసం
పద యూహించి కడంగి తాఁకి యధికున్ బ్రత్యర్థిఁ గుందించు న
మ్మదదర్పోన్నతుఁ జూడ నోడుదు రరుల్ మానంబు దోరంబుగాన్. 551

క. సముఁ డరుదెంచిన సంధియఁ సముచితమగు శత్రుజయము సందియమగుటన్
గ్రహమున సంశయితక్రియ, లమరించుట యొప్ప దని బృహస్పతి చెప్పెన్.

చ. తగ నభివృద్ధికాముఁ డయి తా సమసత్త్వునితోడనేనియున్
మిగులఁగ సంధిసేయుట సమిద్ధవివేకము యుద్ధమాడిరేఁ
బగలుదు రిద్దఱున్ సరి నపక్వఘటంబులు దాఁకినట్లు మె
చ్చుగ నల సుందుఁ డొంట నుపసుందుఁడుఁ బోరి నశించుకై వడిన్. 553

చ. ఎడరున నెత్తివచ్చిన విహీనుఁడు పీడ యొనర్చుచోటులో
బెడఁగునఁ బడశీతజలబిందువుకైవడి సంధిగా నొడం
బడ కెటు లొప్పు సంధి యతఁ డొల్లనిచో నెడఁగాంచి పై బడిన్
బడి పొడిసేయఁగావలయు బాహుబలోన్నతగర్వమత్తుఁ డై. 554

వ. మఱియుఁ బ్రకారాంతరంబు. 555

చ. బలియునితోడ సంధి యయి బంధురయత్నము దప్ప నాతఁడున్
బొలుపుగఁ జూచి నెమ్మి గడుఁ బుట్టెడున ట్లనువృత్తి చేసి యే
కొలఁదిన నమ్మినట్ల యతిగూఢతరాకృతవేషుఁ డై ప్రియం
బులు వలుకంగఁ బొల్పగు సముద్భవ మొప్పఁగఁ గార్యకాంక్షుఁ డై. 556

క. నమ్మిక గలిగినఁ బ్రియుఁ డగు, నమ్మిక మైఁ గార్యసిద్ధి నమ్మినయది యా
నమ్మించికాదె యింద్రుఁడు, నమ్మిక దితిగర్భవిదళనం బొనరించెన్. 557

క. స్థిరబుద్ధి సంధి యొల్లని, యరివరుయువరాజుతో మహాభృత్యునితో
వెరవార సంధి సేయుచు, నురుగతి నంతఃప్రకోప మొనరింపఁదగున్. 558

వ. అది యెట్లనిన. 659

చ. ధనములు లేఖలున్ బహువిధంబులమై నడిపించి తాఁ బ్రధా
నునకుఁ బ్రదూషణంబు గడునూత్నముగా నొనరింప శత్రుభూ
జనపతికిన్ స్వపక్షజనసంఘముపై నపనమ్మి కెమ్మెయిన్
దనర నతండు దాన చెయిదంబు దొఱంగి కరంగు నాత్మలోన్. 560

మ. అహితారంభము మార్చియుండెఁ దదమాత్యభ్రాతృసంధాత యై
విహితాచారత వానివైద్యజనునిన్ భేదించి దానంబునన్
సుహృదుం జేసి మహానసం బతనిచేఁ జొప్పార భేదించి యుం
డె హితుం బంచి సురంధ్రి మైఁ బొడిచియుండెన్ దాఁకి త్రుంపందగున్. 561

ఉ. దేశముఁ బాపి తద్విమతదేశనివాసుల యై నిమిత్తని
ర్దేశము చేసి లోకులకుఁ దెల్లము గాఁ గడునిద్ధలక్షణో
ద్దేశముఁ జూపుచున్ నృపతి దీన వసించుట నిక్క మంచు నా
దేశము చెప్పి పంప నగు ధీనిధి యై నిజగూఢచారులన్. 562

సీ. పెక్కుభంగుల మున్న పేదయ కాఱించుచెంతయుఁ దగు విగ్రహింపఁదగదు
ఉఱక విగ్రహమున నుదయించు సంక్షయవ్యయము నాయాసంబు నాత్మపదము
నర్థమ్ముఁ బుత్రమిత్రాదులు వ్యర్థమై మిన్నక పోవు నిమేషమాత్ర
దురవస్థ పలుమఱుఁ దోఁచుసందిగ్ధంబు రాజ్యముఁగీర్తియు రణమునందుఁ

గీ. గాన విగ్రహింపక సామదానభేద
విధుల సీమాసమాగత విమతనృపునిఁ
గలఁచి సంభ్రమ మడఁచి దప్పులనె నిలిపి
సమబలుండయి తోఁచిన సంధి యొప్పు. 563

గీ. ఆత్మబలగాఢసంరక్షితాత్ముఁడగుచు, వీరసంచారములఁ దావవివశుఁ జేసి
చాల నిలచినఁ దనుఁ దాన సంధి యగును, దప్తలోహద్వయానుసంధానమట్లు.
—కామందకము

క. మును దన కపకారము సే, సినవానికిఁ దాను గీడు సేయక సామం
బున సంధి యగునె కాఁపని, యును మిసుమును గదియ నడువనేలా కూడున్.

సీ. మైత్రిహిరణ్యభూమండలంబులలోన సలర నొక్కటిఁ గొన్న నుత్తరోత్త
రము మేలు మును సహాయము లేనివానికి మిత్రు లన్యముకంటె మే లతండు
నాపదలకుఁ గూడి యరుదేని వాఁడైన భూమిఁ దా విడువంగఁ బూనెనేని
ధనము మే లచలుఁడై తానుండు వానికి సీమతోఁ జేరిన భూమి మేలు

ఆ. వె. కపటమిత్రత మును నెపుడు సొనారని, పణము నెన్నఁడు ఫలపడనిభూమి
యును నిరర్థకంబ యోపినయెవ్వానిఁ, దెలిసికొనుట భూపతికి గుణములు. 566
—నీతిసారము

క. ఇప్పాట సంధికృత్యం, బొప్పారుం బూర్వమునిజనోక్తనయగతిన్
ఇప్పగిది లాపు సంధియు, నొప్పగు నధికాల్పకార్య మూహించి తగన్. 567

## సామము

గీ. సత్సహాయము ప్రజ్ఞయుఁ జాలఁ గలిగి
సత్త్వదేశోపబృంహితచరితుఁ డగుచు
నాయతోద్యోగసద్వ్యవసాయములను
శత్రుమీఁద నుపాయముల్ సలుపవలయు. 568

క. తొలుతఁ జతురంగబలములఁ, దలపెట్టక సామమంత్రతత్త్వజ్ఞుం డై
లలి మాంత్రకోశబలమున, గెలువంగావలయు నృపతి గినిసి యరాతిన్. 569
—కామందకము

క. ఇది సామంబును దానముఁ
బొలుపగు భేదంబు దండమును మాయోపే
క్షలు నింద్రజాలములు నాఁ
గలఁప నుపాయములు సెల్లఁ దనరుచునుండున్. 570

చ. తనరఁ బరస్పరోపకృతిదర్శనముం గుణకర్మకీర్తనం
బును నిజబంధుతాకథనమున్ దగ నాయతిసంప్రకాశనం
బును మృదువాక్ప్రచారములఁ బొల్పగునాత్మసమర్పణంబు నా
జనపతిఁ బొందుఁ బంచవిధసామము సామవిధిజ్ఞ సమ్మతిన్. 571

—కామందకము

చ. సమ్మతునియందు సామమును సంగరమూలబలప్రకారదు
ర్గమునెడ భేదమున్ ప్రకృతిరాగ మెలర్పఁగ నోర్వరాని సే
న ఘనరి నట్టివానివలనం దగు దానము హీనుఁ జూచి బె
ట్టిదముగ దండమున్ ప్రతిఘటించి సమగ్రబలోజ్జ్వలుం డగున్. 572

—అజ్ఞాతము

క. పైపై సమ్మతము చిలికెడు, రూపునఁ జీతముల నలరురూపునఁ జవులం
బాపోవకానువిధమున, తీపుగఁ గనుఁగొనుచుఁబలుకు తెఱఁ గొప్పలరున్. 573

ఉ. ఒరులకు బెగ్గలం బొదవకుండగఁ బల్కెడుపల్కు సామమ
చ్చెరువుగ నట్టిసామము ప్రసిద్ధముగా నిజమాడుచోఁ బ్రియం
బరుదుగఁ బల్కుచో మధుర మగ్గలమై యొదవంగ నాడుచోఁ
బరగఁ నుతించుచోట నెఱపందగు సజ్జనసమ్మతంబుగన్. 574

ఉ. సామమునందుఁ గార్యము నిజంబుగఁ బూనికొనంగఁబోలు నా
సామవిధానబంధముఁ బ్రశస్తి యొనర్తురు నీతికోవిదుల్
సామమునందె కాదె సురసంఘము ద్రచ్చె మహాసముద్రమున్
సామవిరోధులై చెడరె సంగరభూమిని ధార్తరాష్ట్రులున్. 575

ఉ. అంబుని విక్రమప్రశము నుపాయఫలప్రవిదూరునిన్ క్షయా
కులితు నయప్రవాసపరిభూర్జితు నిద్రితు భీతు మూర్ఖుఁ గొం
తలఁ బసినాలుపన్ బలు నధార్మికు దుర్జనమైత్రిశీలు ని
శ్చలతరభక్తియుక్తిఁ దగ సామమునంద జయించు టొప్పగున్ 576

—కామందకము

ఉ. దండమునందకాని యహితక్షితినాథులు గారు సాధ్యు లం
చుండుదు రెండునుం గలదె యూరకె యాకుఁజప్పుడైనఁ బె
ట్టుండక పాఱునీచులను నొయ్యన సామముతోడఁ దెచ్చి యు
ద్దండతఁ బట్టి యుద్ధతుల దారుణవృత్తి వధించివైవరే. 577

క. సామంబుఁ బోల నౌషధ, మీమహి నెక్కుడిది రిపుమహీశులఁ జంపన్
దామర నెస వశియింపదె, హేమంతసమయమునందు హిమపాతమునన్. 578

అ.వె. వనము నేర్చుచోట వహ్నిమూలంబులు
దివ్వఁ గాల్పలేదు తీవ్ర మయ్యు
మృదువుఁదనువయైన యుదకప్రవాహంబు
పెళ్లతోడఁ గూడఁ బెకలఁద్రోచు 579

క. తనయర్థముఁ బ్రాణంబును, ఘనరిపుచేఁ బోవుచుండఁ గలిగినఁ దా నా
తనిశరణుఁ జొచ్చియైనను, గొనకొని యారెండు నిల్పుకొనవలయు వెసన్. 580

ఆ.వె. అరయ సామమునన యగుకార్యములకును
దండముల నొనర్ప దలఁప రరులు
జగతిఁ బైత్యశమము శర్కర నగుచుండఁ
జేతిపోళ్లకాయచింత యేల. 581

ఆ.వె. సామమునన మిగుల సకలకార్యంబులుఁ
బోలఁ జేయవలయు నేల యనిన
బేర్చి సామమున నొనర్చు కార్యము తుది
హానిఁ బొందనేర దంద్రు కాన. 582

క. సామమునను దక్కఁగ రు, గ్గామానలశత్రుఘనతగా దీప్తులయం
దేమిటను బాసి చన దరి, భూమీపతిసంతమసత బుద్ధిఁ దలంపన్. 583

క. ఈమహిశుమీఁద సుజన
స్తోమముఁబోలె...శుద్ధములై యా (?)
సామమునఁ జేయు కార్యము
లేమిట మఱి వికృతిఁ బొంద వెన్నఁడు నరయన్. 584

క. ఇన్నిటికంటెను దా ముని
మున్న నిగూఢప్రకారమున దండమునన్
బన్ని మఱి సామముఖమున
సన్నాహము సేయవలయు శౌర్యోన్నతుఁడై. 585

—పంచతంత్రి

## దానము

చ. పరనృపదత్తవస్తుపరిపాటిన తోఁ బ్రతిదాన మీగియున్
బరుఁ డిడువస్తుసంస్థితియు భవ్యవినూతనవస్తుదానమున్
ఇర వగుసొమ్ముఁ బేర్కొనఁగ నిచ్చుట లిచ్చినయప్పు మానుటల్
పరగఁగ నిట్లు పంచవిధలక్షితమై చను దాన మిమ్మహిన్. 586

గీ. ఆత్మవిక్రయ మొనరించునను వు దోఁప, నీప్సితార్థము లీఁదగు నిచ్చుచోట
నీరు కొండఁ భేదిలచునేర్పుతోడ, రిపుల భేదించునదియు నిరీక్షితముగ. 587

—కామందకము

సీ. మొదల సామోపాయమునఁ జక్కఁబడకున్న విగ్రహ మని దారుణాగ్రహమున
దారుణవిగ్రహోదయ మైనతఱిని దానంబున శాంతి యొనర్పవలయు
యాత్మజ చేసినయపరాధమునకునై భృగునందనుండు గోపించినపుడు
దానంబుచేతన దనుజేంద్రుఁ డగువృషపర్వుండు సుముఖి యై పరఁగెఁగాదె

గీ. కాన నాతనిఁ బ్రార్థించియైన నాతఁ
డడిగినది యిచ్చి విగ్రహ మడఁపవలయు
దానవిముఖాత్ముఁడై సుయోధనుఁడు మున్ను
సకలబంధుసమేతుఁడై సమసెఁగాదె. 588

—కామందకము

సీ ఒకరుండు ముందట నొసఁగి వెండియుఁ బెద్దయాసలఁ జూపుచు మోసపుచ్చి
జీవితం బిరువంకఁ జేకొని వారిచేఁ గడఁగి భేద్యులనెల్లఁ గలఁపవలయు
వెలయ లుబ్ధుఁడు లబ్ధవేతనుండైనను మాని యమానితుం డైనయెడలఁ
గ్రోధి యకారణకుపితుఁడైనను భీరుఁ డతిభీషణుం డైనయట్టిచోట

గీ. వీరికోర్కులు ప్రియముతో వెస నొనర్చి
పరఁగ భేదించునది శత్రుపక్షజనుల
నాత్మపక్షజనంబుల యాత్మ లెఱిఁగి
య త్తెఱంగున నెడము సేయంగవలయు. 589

ఉ. దానపురస్సరంబుగఁ బదంపడి చేసినసామభేదముల్
దానఫలంబుపెంపున నుదంచితకార్యఫలప్రదంబు లౌ
దానవిహీనమైనను వృథావికృతం బగు సామమేని య
ద్దానము లేనిసామమునఁ దా భజియించునె పత్నియేనియున్. 590

క. దానంబుమహిమ యిట్టిది, యౌ నన నిల నెపుడు దృష్టి యారసిచూడన్
దానం బిడినను శత్రుం, డైనను నాక్షణమ మిత్రుఁ డగు వారలకున్. 591

క. తనయునికంటెను దానమె
ఘన మగుప్రియ మనఁగవచ్చుఁ గనుగొనఁ బశువ
య్యును గ్రేపు సనినసైనను
నినుమడిఁ గొలుచిడిన నీడె యెప్పటిభంగిన్. 592

క. తగుదానమహిమ యేమని, పొగడెడిది మనుష్యుఁ డరయ భూరిధనమునన్
జగమునఁ దండ్రిం జంపిన, పగయైనను మఱచి సాధుభావము దాల్చున్. 593

గీ. తనర నొక్కట సర్వస్వమును హరింపఁ
జాలు శత్రునియందుల స్వల్పదాన
మునన సంతోషపఱతురు మున్నెఱింగి
బాడబము నబ్ధి సంతోషపఱచినట్లు. 594

చ. అమరఁగ దుష్టులం దతిబలాహితు సంచితబుద్ధి నల్పదా
నమునన పొందు చేసికొని నాశముఁ బొందఁడు మూర్ఖువాఁడు సా
మమునెడఁ గల్గుపుట్టెఁడు మానుగ వేఁడిన నీఁడు క్రూరదం
డముతఱి గంపెఁ దొక్కట నొడంబడ నిచ్చి నశింపఁ జయ్యనన్. 595

ఆ.వె. అరిబలం బభేద్యమైనను భేద్యమౌఁ
జాలఘనము లరువఁ జాలిరేనిఁ

వంచితమైన మిగులఁ దరిద్రపుష్వ దొలిచిన
ప్రాను విఱువ సుసర మైనయట్లు. 596

ఆ.వె. తనమిత్రవుండు తనకంటె ఘనుఁ డైన
సకలమైనధనము నతని కిచ్చి
తన్నుఁ గాచికొనఁగఁ దగు నీతిపరుఁడు దాఁ
గలిగెనేని ధనము గలదు గాన. 597

ఆ.వె. జయము గోరునృపతి శత్రునుద్ధత వాంఛఁ
దీఱి దానమునన తీర్పవలయు
జలధినీరు పేర్మి బడబానలమువాంఛ
పొసఁగఁదీర్చి జయము పొందినట్లు. 598

ఆ.వె అవపఁబడు విరోధి యంచితదుర్గస్థుఁ, డైన నతులితంపుదానమహిమ
నవని నీటిలోన నల్పమత్స్యప్రదా. నమున నల్లఁబెద్దతిమియుఁబోలె. 599

క. ఎవ్వరి సర్వముఁ జెడుచో
సగ మొండు త్యజించియైన నది రక్షించున్
ధర మూఢుఁడు గడునల్పమ
నుబంధసమున విడువ లేక సకలముఁ జెఱుచున్. 600

ఆ.వె. అధికలోభ మూది యర్థంబె చూచుచు
నుండు నాతఁ డెవ్వఁ డుర్వి నెల్లఁ
జాల లోభమహిమఁ బడి పెం పెఱుంగక
పిల్లివోలె నతఁడు బెట్టు సచ్చు. 601

—అజ్ఞాతము

క. పౌరులను జానపదులను, సారము గలదండనాథజనులను నృపుఁ డిం
పారఁగ సాధింపఁగఁదగు, జారుక్రిన్ సామదానసంస్కారములన్. 602

## భేదోపాయము

క. అనురాగస్నేహవినా, శనమును సంకర్షణంబు సంతర్జనమున్
జనియింపఁజేయునది తాఁ, జను భేదం బనఁగఁ ద్రివిధసంచారములన్. 603

గీ. మంత్ర్యమాత్యపురోహితమండలికిని
దివిరి యువరాజునకునైన తేటపడఁగ
భేద మొనరింపవలయు నభేద్యవృత్తి
నట్టి దగునేని మఱి యసాధ్యంబు గలదె. 604

క. యువరాజు నమాత్యుండును
నవనీపా-న కుదంచితాయతభుజముల్
ప్రవిమలనేత్రము మంత్రియు
నవు నం దొకనూనమైన నట్లగుఁ బతియున్. 605

క. మతిమంతుం డగునరపతి
ప్రతిపక్షజ్ఞాతిభేదపరుఁ డగునది త
త్కృతమున నకులజుఁడు పెన
హతవహుక్రియఁ గాన నెల్ల నుగ్రతఁ గాల్చున్. 606

మ. తగ దాజ్ఞాతిసమానుఁడైనయతఁ డంతర్జ్ఞానియై యుండు సే
నగుభేదార్హుఁడు గాన శత్రువులయం దాయిద్దఱన్ భేదమ
ట్లొగిఁ జేయింపఁదగుం దనం దొదవినన్ యుద్ధస్థితిన్ వారిఁ బొ
ల్పుగ శాంతాత్ములఁ జేయఁగావలయుఁ దా భూపాలుఁ డెబ్భంగులన్. 607

ఉ. శిక్షణరక్షణార్థముగఁ జేరి విభేద మొనర్పఁబోలు నా
దక్షుఁడు సౌమ్యుఁడో శఠుఁడొ తా నెఱుఁగందగు సూక్ష్మబుద్ధియై
నక్షయసౌమ్యుఁడైనఁ దనయాడినపల్కు ఫలింప జేయు ని
ర్పక్షములం గలంచు బలుభంగులమై శఠుఁ డందు లోలతన్. 608

—కామందకము

వ. మఱియు నరనాథుం డొక్కపని యిచ్చెదనని యాసఁజూపి కాలయాపనంబుఁ జేయం దివిరి తవిలినయభిమానియును, దాఁజేయవలవ దనినపని యితండు గావించె నని మిథ్యాదూషణంబు సేయనోపి (ర్చి) న యతండును, వివాదంబున జయంబు గొనియెద నని యతనికి జయం బిచ్చెద నని రప్పించి నిర్ణయవేళ న ట్లొనరింపకున్న నపజయంబునఁ బొందినయతండును, తగవు చెప్పుచు...బంచినతన్ను నవమానించెనని యాఘోషంబులు సేయుజనులకు

మనోమోదంబు గావించిన నట్లు దండనంబునఁ బొందినయతండును, దం డాధికారియు నన నియ్యేవురుఁగ్రోధవర్గంబు; భీతిదోషంబున రాజువలన వెఱచుచుండు వాఁడును, నవనీశ్వరజ్ఞాతియు నాత్మదోషంబుననొందె, వైము ఖ్యంబున నొండె నితరంబును భూవల్లభుచే దూషింపంబడునతండును నీము వ్వురును భీతవర్గంబు; నైసర్గికంబైన యభిమానంబు గలయతండును, మానాధికుం డగుట పరామర్శింపక మహాసాహసంబు సేయునతండును, విద్యాభిజనధనమదోద్వృత్తుండై యాత్మశ్లాఘ చేసికొనునతండును, నీముువ్వురు మానివర్గంబు; ధనహీనుండగుట ధర్మకామార్థవిరహితుం డైనయతండును, జ్యేష్ఠుం డైనయతండును, బరిచరితుం డైనమానియు, నాత్మదుష్కార్యశంకా భీతుం డైనయతండును, బూర్వమున విరోధియై సమాధానంబునఁ బొందిన యతండును, నీచుతోఁగూడం బనిసేయం బంపువడ్డవాఁడును, దనసరివారిచే మాటఁబడ్డవాఁడును, దనదుఃస్వభావంబున నొక్కనెపంబున బంధనప్రాప్తుం డైనయతండును, నిమిత్తంబు లేక పెడలఁబాటుపడ్డయతండును, సపూజిత పూజార్హుండును, హృతద్రవ్యకళత్రుం డైనభోగాభిలాషుండును, బరిక్షీణుం డును, బహిష్కృతుండును నన నిట్లు సెప్పంబడిన యిన్ని దెఱంగులవార లును భేదార్హులుగా నెఱుంగవలయు. 609

గీ సామమును నాసపెట్టుట చతురతయును, దారుణాత్యుగ్రసభయదర్శనంబు మహిమవస్తుప్రదానంబు మన్ననయును, ననఁగ భేదంబునకు నుపాయంబు లయ్యె. 610

క. బలియుండు విగ్రహించిన, నలవడ భేదం బొనర్చునది బుద్ధిమెయిన్ బొలుపుగఁ జండామార్కుల, గెలుచుట భేదమునఁగాదె గీర్వాణు లొగిన్. 611

—కామందకము

క. అతులితబలనృపుఁడైనను, నతిరయమున భేదసాధ్యుఁ డగుఁ గావున నీ క్షితిజయముఁ గోరినను భూపతి భేదము సేయవలయుఁ బాయక యతనిన్. 612

గీ. ధరణి నవిరోధకృన్మంత్రతంత్రతతులు
గడు సువృత్తసుహృద్వ్యక్తికంబులయ్యు
నరయ నించుక లోభేద మగుటఁజేసి
బంధనప్రాప్తములు గావె పాయ కెపుడు. 613

ఆ.వె. సామదానములఁ బ్రశాంతిఁ బొందనిశత్రు, నందు వలయుభేద మొందఁజేయ
భేదమునన యెట్టిపృథుసత్త్వుఁడైనను, బొల్లయై నశించిపోవుఁ గాన. 614

క. బలములఁ గిరులను గపటం, బులచెలుముల భిన్నమంత్రములఁ గార్యములన్
లలివొక్కశబ్దమాత్రన, పెలుచవ కడుఁగాతరుండు భేదం బొందున్. 615

—పంచతంత్రి

## దండోపాయము

క. వధయు సకలార్థహరణము, నధికక్లేశంబు ననఁగ నట దండవిధా
విధినిరతులచే దండన, మధిగుణవినుతముగఁ ద్రివిధమై చెలువొందున్. 616

సీ. అరయఁ బ్రకాశంబు నప్రకాశం బన వధ రెండు తెఱఁగులై వఱలుచుండు
నుఱక ప్రకాశనం బొనరించునది లోకవిద్విషం డైనట్టి విహితుమీఁద
నప్రకాశనదండ మడరించునది రాజవల్లభులై మఱి యెల్లజనుల
కుద్వేజనము సేయుచుండెడివారిపై నధికులై భావించునట్టివారి

ఆ.వె. విషహుతాశనాదివివిధమార్గముల ను, ద్వర్తనముల నాయుధములచేత
నిట్లుపాంశుదండ మెవ్విధమున యథా, న్యాయమార్గమున నొనర్పవలయు. 617

గీ. తనర విప్రుండు జాతిమాత్రకుఁడె యైన
ధార్మికుం డగునాతఁ డంత్యజుఁడ యైన
వారిపై వధదండముల్ వల దొనర్ప
ధర్మసంగ్రహవిదుఁ డైనధరణిపతికి. 618

ఆ.వె. ధరణిలో నుపాంశుదండార్హు లెవ్వార, లందుఁ జంపఁదగినయట్టివారిఁ
బరఁగ బాధపెట్టఁ బరఁగ నుపేక్షింప, వలదు నెదురయైన వల దుపేక్ష. 619

చ. యముఁడునుబోలె నేరికి భయంకరమై కదియంగరాక దం
డమునకుఁ బాత్రు లందుఁ బ్రకటం బగుదండనసేయు టొప్పు భూ
రమణుఁడు మ్రోలఁ జంపు పెదురన్ విడిపించుట లిట్టిచందముల్
దమకము లే కెఱుంగనివిధంబునఁ జేయు టయుక్త మారయన్. 620

గీ. తొలుత భేదంబు గావించితోడరి పిదప
హనన మొనరింపవలయు దండనమొనర్చి
కమియఁ దఱిమినఁ జివికినకాష్ఠ మరయ
నఱకఁబూనినమాత్రన సుఖముఁగాదె. 621

క. వెస దేశకాలబలమును, సుసహాయోత్సాహబలము శోభిల్లంగా
వెసఁగి యుధిష్ఠిరుపోలిక, నసమున శత్రువులఁ ద్రుంచునది దండమునన్. 622

క. భీకర మగునాత్మభుజ, శ్రీకలిమిన యైన శత్రుఁ జెండాడఁదగున్
ఏకాకి యగుచు రాముఁడు పోకార్పఁడె బాహుదర్పమున నృపకుఁ మున్. 623

ఆ.వె. సామభేదదానసంప్రయోగము గడు, విఫల మైనయెడ వివేకియగుచు
దండమార్గ మెఱిఁగి దండ్యుల దండింప,వలయునెపుడు భూమివల్లభుండు 624

—కామందకము

ఆ.వె. అఖిల మైనవారికది సనోహరలక్ష్మి, నలిగియుండుఁగాని తలఁచిచూడ
అతులదండనీతియుతులకు నెప్పుడు, ప్రథనలక్ష్మి వశ్యమై తనర్చు. 625

గీ. అరయ దండంబుదక్క సామాద్యుపాయ
లబ్ధ మగులక్ష్మి నృపతికి లక్ష్మియెట్లు
దైవ మిచ్చినఁ బులి దింపఁ దరలలేక
యుండుమదిగోద యదియును నొక్కటగునె. 626

గీ. సామదానభేదంబులఁ జక్కఁబడక, తక్కెనేనియు మఱికాక తగదుమున్న
దండ మదియేల యనవుడు దండనీతి, యుర్విపులకెల్ల దుర్గతి కూఁత యగుట.

ఆ.వె. దండనీతి వదలి తక్కినయమ్మూఁటి, నమర నడపురాజు కహితులెల్ల
భీతుగాఁ దలంచి పెలుచన పైనెత్తి, వరువుఁబోలె నడపవత్తు రెపుడు. 628

—అజ్ఞాతము

గీ. సామదానములందు నసాధ్యుఁడైన, మంత్రిజనబంధుభేదంబు మఱియొనర్చి
పిదప దండన మొప్పగు నదియు గూడ,రూఢచేష్టల రెండయి రూఢికెక్కు. 629

ఆ.వె. దండనీతి లేక తక్కినవిద్యలు, గలిగెనేని లేనిగతిన పొందు
రాజు దండనీతిరతుఁడైనఁ దక్కిన, విద్యలెల్ల సతని వెదకిపొందు. 630

క. దానమును లుబ్ధభేదము, మానుగ నన్యోన్యశంకమానాత్మల దు
ష్టానీకము నేర్పడఁగ న.నూనత దండమున వశము నొందింపఁదగున్. 631

—ముద్రామాత్యము

## మా యో పా య ము

సీ. మఱి దేవతాప్రతిమా స్తంభసుషిరసంపిహితులచేతఁ జంపించుటయును
స్త్రీ వేషధారియై చేరి చంపుటయును రాత్రిమై ఘోరదర్శనము సేఁత
ఉగ్రబేతాళమహోల్కాపిశాచశివారూపవారుణవర్తనంబు
ఇవ్విధములను ననేకవిచిత్రసంపాదనము మనుజమాయ యయ్యె

గీ. కామరూపధరత్వంబు గడఁగి శస్త్ర, వహ్నిపాషాణశరజలవర్షణంబు
తగఁదమోమేఘశైలసందర్శనంబు, మారుతులుక నమానుషమాయయయ్యె.

క. స్త్రీరూపంబున భీముఁ డవారితముగ సింహబలుని వధియింపఁడె ము
న్నారయ నలుఁడును గూఢా, కారుండై దివ్యమాయ గడగఁడె పెలుచన్. 633

క. తనకంటెఁ బ్రబలు నబలుఁడు, ఘన మగునొకమాయయైనఁగడతేర్పఁదగున్
వనితారూపము గైకొని, చనిభీముఁడు సింహబలునిఁ జంపినమాడ్కిన్. 634

## ఉ పే క్షో పా య ము

క. వ్యసనము నన్యాయంబును, మసలక యుద్ధమును జేయ మాన్పమి యది దాఁ
బొసగుఁద్రివిధస్వరూపత. నెసఁగునుపాయములయం దుపేక్షయనంగన్.635

క. ప్రకటముగఁ గీచకుం డొగి, నకార్య మొనరించువేళ నవినీతుండై
చకితుండపోలె విరటుం, డొకభంగి యుపేక్షచేసి యుండఁడె మదిలోన్.636

సీ. మేఘాంధకారసమిద్ధవర్షాగ్నివిదాహపర్వతఘోరదర్శనంబు
నున్నతధ్వజనిచయోదగ్రసైన్యవితానభీకరదూరదర్శనంబు
ఛిన్నపాటితపటుభిన్నశిరద్రక్తధావద్భటోద్భటదర్శనంబు
నివి యాదిగాఁగలయింద్రజాలక్రియ దగు నైంద్రజాలికదర్శనంబు

ఆ.వె. ఇటులు పెద్దఁబడినయీయుపాయంబులు, సాల బహువిధార్థసాధనములు
గా నెఱింగి యుచితకాలముతోడ ను, పేక్ష యోజ మీఁదఁ జేయవలయు. 637

ఉ. నేరుపుమై నుపాయములు నెక్కొని యాత్మపరస్థలంబులన్
వారక చేయువారల కవశ్యము గల్గు జయంబు లక్ష్మియున్
ఆరయఁగా నుపాయరహితాత్మకులై కడు నంధులట్ల సం
చార మొనర్తురేని నొకసందునఁగూలుదు రెట్టివారలున్. 638

—కామందకము

శా. శ్రీమద్రామగిరీంద్రవసచ్ఛృంగారదిక్పూరితో
ద్దామాలంకృతకీర్తిహార రిపురాడ్దర్పాపహారక్రియా
భీమోదగ్రకరాళచక్ర వినమద్బృందారకస్తోమచూ
డామాణిక్యమరీచిపింజరితగాఢశ్రీపదాంభోరుహా. 639

క. బృందారకమునివందిత, బృందావనమధ్యగోపబృందవధూటీ
సుందరరాసక్రీడా, నందితహృదయారవింద నతముచుకుందా. 640

వసంతతిలకము : కంజాతజన్మజనికారణనాభిపద్మా
కంజాకుచస్థలిపికర్మఠపాణిపద్మా
మంజీరరత్నరుచిమండితపాదపద్మా
పుంజీకృతాసుపరిపూరితపూతనామా. 641

గద్యము: ఇది శ్రీనరసింహవరప్రసాదలబ్ధకవితావిలాసభారద్వాజగోత్రపవిత్రాయ్య
లామాత్యపుత్ర సరసగుణధుర్య సింగనార్యప్రణీతం బయిన సకలనీతి
సమ్మతంబను మహాప్రబంధంబునందు బ్రాహ్మణాచార నియమంబును గణక
పురోహిత విద్వద్యాచక జ్యౌతిషిక వైద్య రాయబార దూతమార్గంబులును
సేనాధిపతి లక్షణంబును భటసేవకోత్తమాధమమార్గంబులును సామదాన
భేదదండమాయోపేక్షేంద్రజాల సప్తోపాయనిరూపణంబులు నన్నది
ద్వితీయాశ్వాసము.



# సకలనీతిసమ్మతము

## తృతీయాశ్వాసము



శవాణీశరుద్రాణీశసురేశాదిసకలదివిజార్చితదో
షాపాశరుజాది, క్లేశరహితపదసనాథ కేశవనాథా. 642

### షాడ్గుణ్యము

క. చన వెఱిఁగి నడవవలయును, వినయోచితవృత్తి సంధివిగ్రహయానా
సనసంశ్రయద్వైధము లనుషాడ్గుణ్యంబు పతి ప్రజామాత్యులతోన్. 644

—కుమారసంభవము

వ. తత్ప్రకారం బెట్టి దనిన. 645

సీ. తనసమానుం డగుధరణీశుపాలికి గూఢచారులఁ బంచి కొలఁది యెఱిఁగి
చెలిమి యేర్పడఁగ లేఖలు పుచ్చి క్రమ్మఱ నతనిలేఖలు విని యాదరించి
పావడంబులు రాయబారులచే నంపి యతఁడు పుత్తెంచిన ననుభవించి
.......................................................

ఆ.వె. తగినబాస చేసి తాను నాతఁడు గని వేడ్కఁ దాను నతఁడు వియ్యమంది
యతఁడు దనకుఁ దాను నతనికినై కూడి, సఖ్యమాచరింప సంధి యయ్యె. 646

సీ. పరభూమిరాజు దుర్బలుఁడై నతఁడెఁ దనమన్నించువారిని జెన్ను మిగులఁ
బసులుదెచ్చియు గడిపల్లెలు పొడిచియుఁ జిచ్చులు వైచియుఁ జెఱలు గొనియుఁ
దెరువాటు లడిచియుఁ దెక్కలి దాఁకియు నూళ్లు గాల్చియు పైరి నొలిచికొనియు
బందులు పట్టియుఁ దొందడి చేసియుఁ గన్న గాంద్రను బంచి కలిమిగొనియు

గీ. కొలుచుఁ జేలును దోఁటలు కొల్లగొనుచు
బ్రతుకఁ డని తాను జతురంగబలముతోడఁ
బగఱపైఁ జని దేశంబు పాడుచేసి
వెఱపు పుట్టించుచునికియ విగ్రహంబు. 647

సీ. సంతోష మొదవ వసంతకాలంబున శుభవేళ శకునంబుఁ జూచి కదలి
 పొలపరుల్ ముందటఁ గెలఁకులఁ బిఱుఁద రానియమించి సుసరంపు బయలుఁ దెరువు
 గైకొని రథములుఁ గరులు నశ్వంబులుఁ దాను బ్రేఁకపుముట్లు తగినవారు
 సమముగాఁ బ్రొ పూరిపుడకలు నీళ్ళును గలమేలు చోటఁ గావలి యొనర్చి

ఆ.వె. గొల్లెనలును దెరలు జల్లడ దట్లువా
 సమ్మలు మఱి వలయు నభిమతములు
 బలిమి మిగులఁ గదిసి పగతుపై నరుగుట
 యాన మనఁగఁ బరఁగు మానవేంద్ర 648

సీ. బలు వగుదుర్గంబు పాటించికొని యాప్తచరులచూపులఁ బరుసంబు చూచి
 మతిమంతు లనఁదగు మంత్రివర్గముఁ బంచి యధికులతో నెయ్యమలరఁగూడి
 తనయంతవానిని దళవాయిగాఁ జేసి చతురంగబలముతో నతనిఁ గూర్చి
 పగవారిభూములపై దండు పంపుచు భవ్యవస్తువులు గప్పములు గొనుచు

ఆ.వె. నాత్మరక్ష మేర యన న్యాయవర్తుఁ, దనకు నెగ్గు సేయఁ దలఁచువారి
 మద మడంచి యెందుఁ గదలక యుండుట. యాసనం బనంగ నతిశయిల్లు.

సీ. ఎల్లగుణంబుల నెక్కుడు నేర్పును సాహసంబును లావుఁ జలము గలుగు
 పగరాజు లిరువురు బలసమేతంబుగాఁ గడిమిమైఁ బై నెత్తి విడియుటయును
 గలఁగక తొలఁగక కార్యంబుతోడన మదము బెరయ సేన కెదుర నడచి
 (యొరు)భేదముగఁ జేయ నొయ్య నవ్వలివాని నొకరునితో నెయ్యమొనరఁ గూడి

ఆ.వె. యతఁడు దాను నున్న యతఁడు ద న్నేమఱి
 యున్నచోటఁ బొడిచి యుక్కడంచి
 సొమ్ముల నడరియును జూఱలు గొనుటయు
 సంశ్రయంబు (నాఁగ జగతిఁ బరఁగు). 650

సీ. వైద్యులు వంటలవారు సావాసులు దాసులు......వాహనాధి
 కారులు నంగరక్షకు లాదిగాఁ బరిజనులకు వేర్వేఱ ధనము లొసఁగి
 గరకానలాదుల ... ... ...
 ... ... ... ...

సీ. ....  ....  , బనిచి యందులోఁ గలిగిన బలియుపేరఁ
గల్లలేఖలు వ్రాయించిఁ గళ్ళబట్టి,వడఁగఁ బంచుట ద్వైధి నాఁబరఁగు నధిప.

క సామ ...  ...  తరంబున నాఋదెఱంగులుగా రచియించి
ప్రయోగింపవలయు నది సంధివిగ్రహయానాసనసంశ్రయద్వైధీభావంబు
లనఁబడు....

...  ...  ధి యపకారంబు సేయుట విగ్రహంబు దండెత్తి పోవుట
యానం బుపేక్షించుట యాసనంబు పరునిఁ గొలుచుట సంశ్రయణంబు

...  ...  ....  బనంబడు వీనియందు. 652

—నీతిసారము

సీ. సన్నపువానికి సంధికార్యం బతిబలునకు మర్యాద గలిగెనేని
విధియించుకొను
................................జను టొప్పు సుద్ధతి తనభూమి కొందదేని
సముఁ డైనవాని కాసనమైన నుచితంబు తలఁచుకార్యము మీఁదఁ దగిలెనేని

ఆ వె. శక్తిహీనుఁడు  ...  ....
...  ...  ద్వైధ మయ్యెరువురకును మైత్రి యెసఁగదేని.653

## అష్టాదశవ్యసనములు

క. పది కామజంబు లెనిమిది  ....  ....
...  ...  ...  వలనఁ బాయంగవలయున్. 654

క. పరివాదాక్షఖేటక, పరబాక్యత్రిక పథూకపానాష్టమద
స్ఫురణాప్రృతార్థులు పృథ్వీ, శ్వర  ...  ... (?) 655

క.  ...  ...  రపచనదూషణము లనం
గా వేఁ దతిశయదోషా, స్థానము లష్టాదశవ్యసనములలోనన్. 656

క. కామజవ్యసనం బ .... ....
.... .... ద్గామక్రోధోద్ధితోన్మదవ్యసనములన్. 657

—పురుషార్థసారము

క. వనితాసక్తియుఁ బానం, బును జూదము వేఁట యర్థము[న దూషణ మొ
ప్పనిదండమ్మును వాక్కఁ, ఘనపరుషత వ్యసనసప్తకం]బనఁ బరఁగున్.

—నీతిసారము

వ. అట్టివ్యసనంబులు సహజాగంతుకభేదంబుల రెండుదెఱంగు లందు సహ
జంబుల గుర్వాజ్ఞాధర్మశాస్త్రంబుల నూతనపుణ్యోపాఖ్యానంబు లాకర్ణిం
చియు నుపశమింపఁ జేయునది. 659

సీ. స్త్రీ సేవ ఘనమైనఁ జెడు దేహధనములు పానాభిరతి మతిభ్రష్టుఁ జేయుఁ
బల్లి చచ్చినను జూదరి లేచిపోవండు మృగచోరబాధలు మృగయఁ గలుగు
ధన మప్రయోజనదత్తమై ధనపతి కైనఁ బేదఱికంబు నావహించుఁ
బలుకుప్రల్లదమును బరుసనిశిక్షయుఁ బగసేయు ధరఁ గలప్రజల నెల్లఁ

ఆ.వె. గాన వీని విడుపు గడఁకమై మఱియును
ధనము యశము ప్రాణమును హరించు
సాహసంపుఁబనులచక్కటిఁ బోవక
పాటి యనక యుండ బ్రతుకవలయు. 660

—అజ్ఞాతము

క. ఏకమృగయావినోద, వ్యాకులుఁ డగునేనిఁ బతి పురాంతికభూమిన్
శ్రీకరమృగయారణ్యము, గైకొని చేయింపవలయుఁ గడుసౌఖ్యముగన్. 661

వ. అది యెట్లనిన. 662

సీ. నగసమీపంబున నదిపొంతనేనియు బహుజలశాద్వలప్రకటభూమి
నిడుపు వెడల్పును నెఱి యర్ధయోజనసమ్మతమై కడుఁ బదరముగను
మృగలంఘనీయమై యొగి వన్యదుర్గమై యురుపరిఖాచక్ర మొప్పు మిగులఁ
గంటకోత్కరలతికాగుల్మశూన్యమై వరవిషపాదపవర్జితముగ

గీ. జ్ఞాతపూర్వంబులై మనోజ్ఞంబు లగుచు
సురభిఫలపుష్పగంధముల్ విరళములును

స్నిగ్ధనీలఘనచ్ఛాయముగ్ధములును
నై నతరుపులయది మృగయావనంబు. 662

సీ. పాంసుప్రపూరితబహురంధ్రకందరక్ష్మాతలనాదిసమంచితంబు
స్థాణువల్మీకపాషాణాదివిదళనభూరిసమీకృతభూతలంబు
శోధితగ్రాహవిశుద్ధజలంబును నవతిగంభీరజలాశయంబు
మహితనానావర్తమధురవిహారంబు నగణితవిహగసమాశ్రయంబు

గీ. చారుసంఘాత్యమృగపరిపూరితంబు. ననుపమితహస్తినీకలభాన్వితంబు
భగ్నదంష్ట్రినఖవ్యాఘ్రబంధురంబు.ఛిన్నశృంగవిషాణిసంపన్నతలము. 664

సీ. పరిఖాతటంబునఁ బరిమళబహుళప్రసూనపల్లవపరిశోభమాన
మై సుఖసేవ్యలతాపూర్ణ మగువనరాజిమై నెంతయు రమ్య మగుచు
వెలుపల నతిదూరవిస్తృతస్థలమున నపగతభూరుహం బగుటఁజేసి
యనుదినశత్రుసైన్యాగమ్యభూమి యై నిజమనఃప్రీతిసందీపనంబు

గీ. వనమృగస్వాంత వేదులు ఘనదృఢాత్మ
లనుపమానైకదుష్కరాయాససహులు
నైనయాప్తులచే రక్షితాఖిలంబు
నగువనం బొప్పుఁ బతికి విహారమునకు. 665

క. విజితశ్రముఁ డగుమృగయుఁడు. నిజరాజవిహారమునకు నిపుణతను మృగ
వ్రజమున్ దద్వనభూమికి.నిజముగఁ గొనివచ్చి వచ్చి నింపఁగ వలయున్.666

చ. రమణ ననన్యకార్యవిధురంబుగ నేఁగి ప్రభాతవేళ సం
క్రమణసమర్థుఁడై విహృతికాంక్ష మితాప్తభటాలి గొల్వ భూ
రమణుఁడు తద్వనస్థలిఁ జొరన్ వెలిఁ జుట్టును సైన్యముల్ వని
భ్రమణము లేక నిల్చునది బంధురలీల విదూరసంస్థలన్. 667

మ. మృగయాయానగుణంబులన్ బడయుసంప్రీతిన్ బ్రజాధీశుఁ డీ
మృగయాక్రీడనసద్విధిన్ (గుశలియై మేకొన్నఁగా కన్యథా
మృగయుంబోలె యథేచ్ఛ దుర్గవనభూమిం జొచ్చి వేఁటాడినన్
వగలం బొందఁడె శత్రుసత్త్వవిపదధ్వక్లేశవిభ్రాంతుఁడై.) 668
—కామందకము

మ. మృగముల్ చావకయున్నఁ దాఁ బ్రవణతన్ మేకొన్నఁ గాకున్నఁ దా
మృగయాజీవికిరాతజాతవిఘురామీలన్మనోజ్ఞాతుఁ డై
మృగయాదోషముఁ బొందుఁ గాన పతి యిమ్మైఁ బోవలేదే....
... ... .... .... యిమ్మెయిన్. (?) 669

—అజ్ఞాతము

వ. మఱియు ద్యూతవ్యసననిరూపణము. 670

సీ. అధికధనం బైన నప్పుడే చెడుటయు మునుకొని లజ్జావిముక్తతయును
నిస్సత్యసంస్థితి నిష్ఠురకర్మంబు కడుఁ గ్రూరవాక్ప్రఖండనంబు
కోపము ధర్మవిలోపంబు కర్తవ్యవివిధకర్మక్రియావిముఖతయును
సత్సమాగమసుఖాస్వాదవిచ్ఛిత్తియు సంతతదుర్జనసంగతంబు

గీ. అర్థనాశము నిత్యవైరానుబంధ, మమితనిత్యార్థములును నిరాశతయును
గడనసత్యార్థములచోట ఘనతరాశ, లనుగతక్రోధసంతాపహర్షములును 671

సీ. ప్రతిదినంబును గ్లేశభాజనమై యునికి విసువ కెప్పుడు సాక్షి వెట్టుటయును
స్నానాదిగాత్రసంస్కారభోగములందు ననవరతంబును నరయవలయు
నవ్యయవ్యాయామ మంగదౌర్బల్యము విపులశాస్త్రార్థగవేషణంబు
క్షుత్పిపాసాపరిశోషణక్లేశము హవనాదివేగనియంత్రణంబు

ఆ.వె. ఇవియు నాదిగా ననేకదోషంబులు, జూదమందుఁ గలుగఁ జూచినట్టు
జనులు సెప్పుచుండ వినఁబడు నెప్పుడు, గాన జూదమాడఁ గాదు పతికి. 672

క. రెండవసురేంద్రుఁ డగున, ప్పాండుసుతాగ్రజుఁడు మున్ను పటుమతియుతుఁడై
యుండియు జూదంబున మ, గ్నుండై పట్టంపుదేవిఁ గోల్పడి చెడఁడే. 673

క. జూదవ్యసనంబునన మ, హోదయ మగురాజ్యమెల్ల నోటువడి ప్రియం
బేది కళత్రము దొఱఁగి య, నాదరకర్మమునఁ గొలువఁడా నలుఁడన్యున్. 674

క. రుక్మాచలసమధైర్యుఁడు, రుక్మద్యుతిదేహుఁ డధికరూఢబలుం డా
రుక్మియు జూదంబున నా, రుక్మగజాశ్వముల నోడి రూపఱి చెడఁడే. 675

ఆ.వె. దంతవక్త్రుఁ డనఁగఁ దనరు కాశికరూశ, దేశపతి యథేచ్ఛఁ దెఱఁగుమాలి
పరఁగ జూదమునన బలభద్రుచేతఁ దాఁ, బండ్లుడుల్లనాటుపడఁడె మున్ను. 676

· జూద మనర్థహేతు వగు జూదము మైత్రికి మూలహాని యా
జూద మమందచిత్తమున క్షోభము పుట్టు ననాత్మపక్షసం
భేదము పుట్టుఁ గానఁ బతి బేలయి జూద మొనర్చు టొప్ప దా
హ్లాదము నున్మదోద్ధతజనాదరమున్ బరివర్జ్య మెమ్మెయిన్. 677

· కార్యగతిక్రియాకాలాతిపాతము పృథులధర్మార్థ సంపీడనంబు
సంతతాభ్యంతరసంపాతవివశుఁడై కుందుటఁ బ్రకృతిప్రకోపనంబు
యువతిపక్షముచేత నొగి రహస్యవిభేద మరయఁగ గార్యక్రియాప్రియంబుఁ
దనర నీర్ష్యామర్షజననముఁ గ్రోధంబుఁ జాలవిరోధంబు సాహసంబు

·వె. నివియు మొదలు గాఁగ నిన్ని దోషంబులు
ద్యూతమందుఁ గలుగు దోషములును
అంగనావ్యసనమునందు నిన్నియుఁ బుట్టుఁ,
గాన యది భజింపఁ గాదు పతికి 678

· కామినీజనముఖవిలోకనమునందుఁ, దమకపడియెడునల్పచేతసుల కెపుడు
యౌవనముతోడఁ గూడ సమస్తమైన, యాహితంబులు లయమందకేలతక్క.

## పానవ్యసనము

· వమనంబు విహ్వలత్వంబు సంజ్ఞానాశవర్తనలీల వివస్త్రతయును
బహువిధాబద్ధదుర్భాషావిశేషము ననితరాకారణహసనములును
యుఱక ప్రాణగ్లానియును సుహృన్నాశముఁ బ్రజ్ఞామతిశ్రుతభ్రాంతి మఱియు
సద్వియోగంబు నసజ్జనయోగంబు సతతకృతానర్థసంగ్రహంబు

· స్ఖలనవేపథుతంద్రావికారములును, జిరతరాత్యంతకాంతానిషేవణంబు
లాదిగాఁ గలదోషంబు లఖిలసద్వినిందితంబులు పానంబునందుఁగలుగు. 680

· శ్రుతశీలబలోపేతులు, నతిప్రతాపులును నైనయంధకవృష్ణుల్
అతిపానదోషవశమున, హత మంది యడంగి రనిన నన్యులవశమే 681

·వె యోగిజనవరేణ్యుఁ డున్నతగుణశాలి, భృగుసమానబుద్ధి భృగుసుతుండు
శుక్రుఁ డకట పానశూరుఁడై తనచేతఁ, బుంగలేక కచుని ద్రుంగఁ డయ్యె 682

క. పానమదాంధుండై పనిఁ, బూని మదింపంగఁ జేయుపొం దెఱుఁగఁ డొగిన్
గానఁ బతి పానసంగతి, మానంగావలయు విజితమానసుఁ డగుచున్. 683

—కామందకము

వ. ఇట్లీకామవ్యసనచతుష్కంబునందలి తారతమ్యం బెట్టి దనిన. 684

క. స్త్రీపానంబులకంటెను, భూపతిఁ జెఱుపంగ జూదమును వేఁటయుఁ దా
నోపు లఘుమాత్రయేనియుఁ, బైపడి సేవించెనేని పండితు నైనన్. 685

ఆ.వె. మాత్రతోడఁ బానమానినీవ్యసనముల్, జరుపు టొప్పు నెన్ని చందములను
నింతయైన చేఁత యెగ్గగుఁ గావున, వేఁటజూదములను విడువవలయు. 686

క. ఈసప్తవ్యసనములకు, నోసరిలుట లెస్స విడువనోపఁడయేనన్
వ్యాసక్తి వలదు వేఁటయు, నాసవపానమును నింద్య మని రాపతికిన్. 687

—మదీయము

## మంత్రరక్షణార్థములు

ఉ. రాజితమంత్రబీజము ధరావలయేశ్వరు రాజ్యలక్ష్మికిన్
బీజము గాన మంత్ర మవనీపతి రక్ష యొనర్చు టొప్పు నా
యోజ ఘటింపఁడేని నతఁ డొక్కట నాశముఁ బొందు నట్టివి
భ్రాజితమంత్రరక్షఁ దగుదా జనపాయసుఖంబు గైకొనున్. 688

—అజ్ఞాతము

క. రాజులకు విజయమూలము, రాజితతంత్రంబు సుస్థిరంబుగ దానిన్
రాజాన్వయ రక్షింతె ధ, రాజనులకుఁ గర్ణగోచరము గాకుండన్. 689

ఆ.వె. కార్య మెట్టిదియును గాసియౌ మంత్రంబు, దలఁప నొరులచెవులు సిలికెనేని
కాన నాల్గుచెవుల నూనంగ రక్షింప, వలయు నెఱుక గలుగువారు ధరణి. 690

—సభాపర్వము

క. ఆప్తు లెఱింగిన నాప్తుల, యాప్తు లెఱుంగుదురు తత్తదాప్తశ్రవణ
ప్రాప్త మగుచుండుఁ గావున, నాప్తపరంపరల మంత్ర మవియున్ బతికిన్.

—బద్దెనీతి

ఆ.వె. మిత్రునకును గొంత పుత్త్రికకును గొంత సచివునకును గొంత సద్భటునకుఁ
గొంత సతికిఁ గొంత గుప్తంబు సేయంగ వలయు నెడలు కొన్ని గలిగియుండు.

ఆ.వె. చారణునకు వందిజనునకు భటునకు నెరయ రక్షకులకు నీచులకును
మాలికులకును జనదు మంత్రంబు సెప్పంగ వేగ ప్రకట మొందు వీరిచేత. 693
—అజ్ఞాతము

ఆ.వె. ఆప్తసమ్మతముగ నఖిలకార్యంబులుఁ జేయువారి కెప్పుడుఁ జేటు లేదు
ఆప్తుగా నెఱుంగ కాడిన మంత్రమే, దనము నొంద కేల తక్కనేర్చు. 694
—ముద్రామాత్యము

క. ఆప్తు నవివేకి నొల్లర, నాప్తుని విద్వాంసు నొల్ల రార్యులు మంత్ర
వ్యాప్తికి మంత్రి వివేకియు, నాప్తుఁడు గావలయు దశదిశాభరణాంకా. 695
—బద్దెనసీతి

సీ. నిగ్రహాక్షంబును నిస్తంభసంశ్రయ మరయ నిర్భిత్త్యంతరాశ్రయంబు
నగునెడ నిర్మాల్యగ్రహందు సరణ్యంబునందును సవిలక్షితాత్ముఁడగుచు
మనుమతద్వాదశమంత్రిమండలమైన సురమంత్రిమతమంత్రిషోడశంబు
కవిమతవింశతికంబైన మతి యథాసంభవం బైనను సచివసమితి

ఆ.వె. తనదుచుట్టుఁ గొలుపఁ దవిలి యథా
శాస్త్రమార్గవృత్తిఁ గార్యమంత్రచింత
యమరఁ జేయవలయు నాహితచిత్తుఁడై
బుద్ధివృద్ధికై సుబుద్ధి యగుచు. 696

క. మఱి వేఱు వేఱ తా ని ద్దఱితోడన కార్యచింత తగఁ జేయుచుఁ దా
రెఱిఁగించినమతభేదము, లెఱుఁగుచు హిత మెఱుఁగవలయు నేచందమునన్.

ఉ. మంత్రబలాఢ్యులైననిజమంత్రులచేతఁ బ్రవృత్తమైనయా
మంత్రము నిష్ఠఁ దాన వలుమాఱు మదిం దలపోసి చూచి దు
ర్మంత్రము గాకయుండఁ దనరం దనకార్యము సిద్ధినొంద స
న్మంత్రవిధిజ్ఞుఁడై నరనాయకుఁ డెప్పుడు చేయఁగాఁదగున్. 698

సీ. ధరణీశుఁ డెప్పుడు తద్జులయాజ్ఞలో మెలఁగుచుఁ దనయాజ్ఞ మెలఁగుజనుల
నొకనినైనను నప్రియోక్తులఁ బలుకక కార్యంబు దలపోయఁ గడఁగు నెపుడు

మించినపలుకు గ్రహించుటకై సర్వజనులవాక్యంబులు వినఁగవలయు
నేచి మదోద్వృత్తి నేదియు నెఱుఁగక చేయంగఁ దగుపనుల్ చేయునప్పుడు

ఆ.వె. మంత్రజనుల మీఱి మంత్రరహితుఁడైన
యతని నొక్కపెట్ట యహితవరులు
చిక్కువడఁగ నడఁచి సిరియును రాజ్యంబు
నలమికొంద్రు బుద్ధిబలముకలిమి. 699

ఆ.వె. హితము నడఁపుచును నహితుల నడఁపక, పొదలవిడుచుపేమిబుద్ధి దలఁప
గోరఁ జిదుమవచ్చుకొనయైన ముదిసినఁ, బరశుధారఁ గాక పాపఁదరమె. 700
—నీతిసారము

క. పని యైనమీఁదనేనియుఁ, దను నన్య లెఱుంగకుండఁ దాన విచారం
బునఁ గొనఁగవలయుఁ గార్యము, వినుతనిగూఢక్రియావివేకస్ఫురణన్. 701
—ముద్రామాత్యము

గీ. మంత్రు లాత్మప్రయోజనమహితబుద్ధి, దీర్ఘనిగ్రహ మొనరింపఁ దెలియలేక
కళవళించినయేని రాజలవు దఱిగి, పొసఁగు మంత్రులపాలికి భోగ్యుఁడగుచు.
—కామందకము

మ. నయశాస్త్రజ్ఞులు శుద్ధకర్ములును సన్మార్గప్రవృత్తాత్ములున్
జయశీలాఢ్యులునైన పూర్వులమహాసన్మార్గము న్మాని దు
ర్జయుఁడై మంత్రివినిర్ణయం బెఱుఁగ కున్మాదించి పైఁబడ్డ దు
ర్జయవిద్విష్టరఖడ్గధారకు వెస న్గ్రాసంబు గాకుండనే. 703

ఆ.వె. నీతిపథముఁ దప్పి నెఱి వేగపడి చేయు
నతఁడు దుఃఖఫలము ననుభవించు
క్రిందుమీఁదెఱింగి కృతకార్యుఁ డగువాఁడు
సేయుకార్యమెల్ల సిద్ధిఁ బొందు. 704

వ. అజ్ఞాతవిజ్ఞానంబును నిశ్చయంబు నర్థద్వైధసందేహవిచ్ఛేదనంబును నశేష
దర్శనంబును నన మంత్రంబును నాలుగురూపంబులై యుండుఁ దత్ప్రకారం
బెట్టిదనిన. 705

సీ. దేశకాలాంతరస్థితి నెఱుంగఁగరానిపనివెంట విజ్ఞాన మనఁగఁ జెల్లు
నెఱిఁగినపని బుద్ధి నెంతయు నూహించి నెఱితథ్య మెఱుఁగుట నిశ్చయంబు
ఇరువురపై నెత్తి యరుగంగవలయుచో హితమంత్రివరుల నూహించి చూచి
అందులో నొకనిపై నరుగ నిశ్చయ మొగిఁ జేత సందేహవిచ్ఛేదనంబు

గీ. అడఁగుశత్రువుపై నెత్తి యరుగునపుడు
సంధివిగ్రహములయందు సంధి యధిక
మట్టిసంధియు భేదంబునంద యైనఁ
దనరు ననుట యశేషసందర్శనంబు. 706

క. నరపతులకు నెక్కాలముఁ, బరికింపఁగవలయు మంత్రపంచాంగములన్
వరనీతిజ్ఞులమతమున, వెరవుగ వివరింతు దానివిధ మె ట్లనినన్. 707

గీ. పటుసహాయము సాధనోపాయములును, దేశకాలవిభాగవిధిజ్ఞతయును
ఘనవిపత్ప్రతీకారంబు కార్యసిద్ధు లనఁగ నొప్పగు మంత్రపంచాంగకములు.

సీ. దుర్గకృత్యమునకుఁ దొలుత సహాయాధికారులు పనిసేయుభూరిజనులు
పరశుకుంతాదులు బలుసాధనంబులు నడుభూమి గడు నొందెఁ గడఁగి దుర్గ
మొనరించుటయు గ్రీష్మమున నిష్టకాదులు వర్షకాలము కారువర్గకృత్య
మోలిఁ జేయుట దేశకాలవిభాగంబు లాధర్వసామభేదాద్యుపాయ

ఆ వె. విధుల నాపదలకు వెస శాంతి నెంతవి
ఘ్నప్రతిక్రియ యనఁ గరము వెలుఁగు
కార్యసిద్ధిఫలము లార్యులు మంత్రపం
చాంగ మంచు దీని నండ్రు ప్రీతి. 709

సీ శాశ్వతబుద్ధియై జరుగు నాతనిబుద్ధి యమర నౌత్పాదికి యనఁగఁ బరఁగు
శాస్త్రంబువలనఁ దా సంభూత మగుబుద్ధి ఘనశాస్త్రసంభవం బనఁగఁ బరఁగు
జ్ఞానవృద్ధులతోడిసంసర్గ మగుబుద్ధి సాంసర్గి యనఁగఁ బ్రశస్తమగును
మును పల్కు మఱియుక్తి యొనరింప బుద్ధియై నది పరిణామికయనఁగవలయు

గీ. నిట్టిబుద్ధులు నాలుగు నెసగుమంత్ర, శక్తి కిరయ నాధారమై చనుటఁజేసి
నీతిమంతులు సెప్పుదు రాతతముగ, రాచకృత్యంబు లివి యని రాజితముగ.

ఉ. మంత్రవివేకి యైనతఁ డమందజయంబునఁ బొందు నెంతయున్
మంత్రవిహీనుఁ డైన నవమానముఁ బొందు సమర్థుఁడేని దు
ర్మంత్రు నరాతు లోర్తు రొగి రాక్షసు లధ్వరశీలునట్లు స
న్మంత్రుని వోర్వరా దగుట మంత్రపరుం డగు టొప్పు నెప్పుడున్. 711

—కామందకము

ఉ. నీతిపథంబునన్ బ్రతుకనేర్చుట యుత్తమబుద్ధి కార్యసం
జాతములై కరం బలరుసంపద నొందుట మధ్యవృత్తి య
న్నీతము లైనభారవహజీవనముల్ తలపం గనిష్ఠముల్
నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్. 712

—విదురనీతి

గీ. సూక్ష్మబుద్ధి జనులచొప్పున వర్తించు, వాని కాప్తజనవిహీన మైన
తఱి విచారమునకుఁ దక్కటిజను లేల, తనకుఁ దాన బుద్ధి గనఁగవలయు. 713

చ. కినుకను దుష్టవేదన మొగిం గొను నెంతయు దుష్కరంబు గా
కనుపమనీతికోవిదుల కారయ నెందు నసాధ్య మొందునే
ఇనుమును నీరుగాఁ గరఁగరే మదకుంజరమస్తకంబునం
దొనర మదంబు వెట్టరె సమున్నతవృత్తి నుపాయసంపదన్. 714

ఆ.వె. పెద్దయయినయినుపముద్ద దా నొకలేఁత, తీవనైన నెట్లు త్రెంపనేర్చు
నల్పమైన నదియు నతిశితధారచేఁ, ద్రెంప నోపు నెంతదృఢమునైన. 715

క. నీరున ననలం బాఱుట, నారయ లోకప్రసిద్ధ మయ్యనలముచే
నీరు గడు దోష మొందదె, చారుతరోపాయశక్తిసంపదవలనన్. 716

ఆ వె. అంధకారంబునప్పుడు నడఁగిపోదు
దినపతేజంబునప్పుడు తిరిగి రాదు
యెట్టిమఱుఁగైనఁ గాన్పించు నెచట నున్నఁ
జారుతర మైనయట్టివిచారదృష్టి. 717

—ముద్రామాత్యము

క. వాయువు దూఱనిచోటును, దోయజబాంధవునిరశ్మి దూఱనిచోటన్
ధీయుతులబుద్ధి దూఱు ని, రాయాసంబునను గార్య మగుఁ దుద్బుద్ధిన్. 718

క. ధారుణి నెయ్యది యైన వి
చారము వెలిగాఁగఁ దొడరి సాహసకృత్యం
బూరక యెవ్వఁడు చేయును
నారయ వాఁ డొందు నపజయంబును నెపుడున్. 719

క. ఆతతరథకరితురగప, దాతిసమూహములచేత దారుణశస్త్ర
వ్రాతముచేత నసాధ్యము, లై తక్కినయవియు బుద్ధి కగు సాధ్యంబుల్. 720

క. హితులును బటుశాస్త్రజ్ఞులు, నతిచతురులు నమలమతులు నగువారియస
మ్మతమునఁ జేసినకార్యము, హితములు గానేర వందు రెన్నఁడు పిదపన్. 721

క. తెలిపి యుపాయాపాయం, బులవలనను బెద్దకాలమునకును మఱిరాఁ
గలమేలును గీడును మన,సులకప్పుడె తోఁప బుధులు సూపుదు రరయన్. 722

క. తనకంటెను ధీమంతుని, యనుమతమునఁ జేయవలయు నలవడ నరుఁ డే
పనులైన నట్టిపనులవి, కనుఁగొన మఱిహాని రావు కావున జగతిన్. 723

—పంచతంత్రి

క. మునుమతి పనుల విచార, మ్మున మే లనిపించుకొన్న పురుషునిమతియున్
జనుఁ జీర నేకతమునకుఁ, జనునఘమునిఁ జీరనే విచారంబునకున్. 724

క. సాలీనిని నగసాలిని, మాలనీ బరిక త్రివాని మంగలిఁ జాకిన్
ఆలోకించినపతి ని, ర్మూలత నేటఱితిభూజముంబలెఁ బోవున్. 725

ఆ.వె. తగిలి బయలు నైన మిగులఁ గొందఱు సేయఁ
గార్య మెట్టిదైన కడఁక గలదు
పెక్కుపూరి గూడఁ బెనచినత్రాటిచే
ఘనమదావళంబు గట్టువడదె. 726

క. పలువురు నేర్పరు లగువా, రలవడ నొకచోట నుండి యందఱుఁ దమలోఁ
బలఁ జర్చచేసి పిదపన్, బొలుపొందఁగఁ జేయుపనులు పొరయవు హానిన్. 727

—నీతిసారము

క. వెరపునఁ గార్యము సేయక, యురవడి మొక్కళము సేఁత యూహింపంగాఁ
బరమైనతఱుముపెట్టక, కరమునఁ బెనురాయి ద్రోవఁ గడఁగుట గాదే. 728

—నీతిసారము

క. అరయ శక్యాశక్యవి, చారము గావింపవలయు సన్మతి గాదే
వారణము కొండ డీకొని, యూరక నిజదంతభంగ మొందుట గాదే. 729

—కామందకము

ఉ. అప్పటికిన్ వినన్ విషము లైనను మీఁదను దామసంబుగాఁ
జెప్పెడివారుఁ జెప్ప విని చేయఁగనోపెడువారుఁ బెద్దయుం
జెప్పఁగ లేరు విలసిల్లు ప్రియంబుల నంతకంత నె
ల్లిప్పుడుఁ జెప్పువారలు ననంతమురాకలఁ జెప్పనేటికిన్. 730

—పంచతంత్రి

క. సన్నపువానివిచారము, సన్నపుఁబనులందుఁ గాక చతురం బగునే
మిన్నెన్నఁదైన విందుమె, చెన్నుగఁ జలమూఁది రణము సేసినవారిన్. 731

—ముద్రామాత్యము

ఆ.వె. అర్థిఁ దీపు లైనయాహారములు గొను
టయును దెరువు నడచుటయును నిద్ర
బొందుటయును గార్య మూహించుటయుఁ జాల
నిక్క మొక్కరునకు నీతిగాదు. 732

—పంచతంత్రి

ఆ.వె. కసియఁ బండుచున్న కాయఁ గోసినఁ జవి
చేడు కాదు విత్తుచేటు గలుగు
పక్వమైనఁ గోసినఫల మిచ్చుఁ జెడదు బీ
జంబు కార్యసిద్ధిచంద మిట్లు. 733

ఉ. ఆతతనీతి మేలనకునై యొనరింపగ దైవ మొక్కకీ
డాతరువాతఁ జేయుటయు నక్కఱగామియు శాంతి నెందఁగా
నీతియె చేయఁగావలయు నెక్కుడు నేర్పరు లైనవారు వి
ఖ్యాతి గనంగ నొక్కయెడఁ గాలిన నగ్గిన కాఁపమానదే. 734

—విదురనీతి

వ. మఱియు రాజునకు సర్వకార్యంబులు మంత్రపూర్వకంబు గావున బుద్ధిసహాయులం గూడుకొనియుండవలయు, బుద్ధిసహాయులు ధనార్జకులు రణశూరులు

నాదియగు కార్యపురుషులు కార్యకాలంబ కూర్తు మనుట గృహదాహం బగు వేళ నూతి కుపక్రమించుట, వారికి వలయుధనంబు లిచ్చుట సుక్షేత్రంబున విత్తనం బిడినయట్లు, విభవం బెంత గల్గినను భోజనసహాయులు గల్గుదురు గాక కార్యసహాయులు గల్గనేర్తురే? మఱియు మూర్ఖుండు కార్యసహాయుం డగుట యంధుం డంధునకుఁ దెరువు చూపినయట్లు, వారివలన నొక కార్యంబు గల్గిన నది కాకతాళంబును ఘుణాక్షరన్యాయంబును నగుఁ గాని యథార్థంబు గాదు. రాజు చేపట్టిన మూర్ఖైనఁ గార్యవేది యగు ననందగదు; శివుండు గళంబున ధరియించినకాలకూటం బమృతం బగునె? అది యెంతియు కాదు. మూర్ఖునందుఁ గార్యం బిడుటయె తన్నుఁ జంపురక్కసుఁ దాన సృజియించుకొనుట. ఆ ఫలంబులు నల్పఫలంబులు- సమాయవ్యయం బులు దురంతంబులు హానికరంబులు నగుపనులు విచారయోగ్యంబులు గావున విఘ్నభయంబునఁ గార్యంబు విడుచుట తొడుకు గలుగు నని యారంభంబు విడుచుటయును అజీర్ణంబగు నని యాహారం బుజ్జగించుట యును. దూరభీతత్వంబు నాసన్నశూరత్వంబు మహాపురుషగుణంబుః; దూర శూరత్వంబు నాసన్నభీతత్వంబుఁ గాపురుషగుణంబులు. మయూరంబపోలెఁ బ్రియోక్తులఁబలుకుచు శత్రుసర్పంబుల నడంపవలయు. జలంబులం బోలె భూభృద్భేదనంబు సేయనోపియు మృదువు గావలయు; కాలువఁ దెచ్చుకాష్ఠం బులు దలమోచినట్లు వైరులయెడ నోరుపుగలిగి జయింపవలయు. నదీప్రవా హంబుపడఁ ద్రోవవలయుతీరద్రుమతృణంబులకుఁ బాదప్రక్షాళనంబు సేయు నట్లుచెలుచునంతకు శత్రులయెడ సామంబులే పలుకవలయు; నల్పాధికకార్యం బులం దేక యత్నంబు సేయునది; తృణభూరుహంబులు గొనిపోవునప్పుడు నదీవేగం బొక్కటియకాదే. మేలైనను గీడైనను తలఁచినది సేయునంతకు హృదయంబు బయలుసేయవలవదు. పరుల విశ్వసించి మర్మంబు సెప్పుట తన్నుఁ గోలుపోవుట. చాపలంబున భయంబున నాలస్యంబున నవివేకంబున లోభంబున వేగిరపాటున నుత్సుకత్వంబునఁ గార్యంబుసెడుఁ దద్విపరీతం బైనను నగు. ఎవ్వరి కెట్లు ప్రియం బట్లు చేసి కార్యంబు గొనుట యుచి తంబు. పంకిలం బగుమడువున నిడినఁగాక మొగలికర్పూరకర్దమంబునఁ బూచునే? నీచు లెక్కరానిచెట్టునుబోలె దండప్రయోగంబునంగాని ఫలం బిడరు; అతిక్రోధియయినయతని కైశ్వర్యం బగ్నియందుఁ బడినలవణంబు నుంబోలె నదరులఁ బడి విశీర్ణంబగు. నేరకున్ననైనఁ దనవారిం బరుల

సొమ్ముఁ జేయంజనదు. ఎదిరిసత్వం బె ంగక కలహించుట శలభం బగ్నిలోఁ బడఁ బగగొనినయట్లు మఱియును. 735

—అజ్ఞాతము

క. పొదమదు చేయనికార్యము, పొడమకయుండంగఁ గప్పిపుచ్చెద మన నె న్నఁడు రాదు చేతఁ గలిగిన, పెడమలయపుమనుజు లేల వేల్పులకైనన్. 736

—కేయూరబాహుచరిత్ర

ఆ.వె. హితునియందునేని యెగ్గు నాపాదించి, వెనుక నా పుఁజేయ పెరవుపడును ఓపల మయ్యోనేని విఱిగినపటికంపు, వలయ మేల నదకవచ్చుఁ బిదప 737

—మిత్రనీతులు

గీ. త్యాగదుర్జయజ్ఞానసత్త్వాధికుండు
నాత్మపక్షోన్నతుండు ప్రియంవదుండు
ఆయతక్షముఁ దద్వైధుఁ దమలవంశ్యుఁ
డైనసుజనుండు మిత్రుఁడై యమరవలయు. 738

—కామందకము

క. ఎనయ శుభాశుభఫలమున, కనయము విశ్రమముఁ బ్రోవు నగుమిత్రుండై పనజజుఁ డిట్లు సృజించు నె, యనుపమమిత్రాక్షరద్వయ మను నమృతమున్.

క. మిత్రుం డక్షయుఁ బ్రాణక: శత్రములకు సిగ్గు మదిఁ దలంపక మును నా మిత్రుండు మాట మాత్రమె, మిత్రత్వము దలఁచిచూడ మిత్రనిధానా. 740

క. చెలువార మిత్రసంపద, గలవారి కసాధ్య మొకఁడు గల దనఁ గలదే తలఁప నిది గాన పురుషుఁడు, చెలుములు సజ్జనులతోడఁ జేయఁగవలయున్.

క. కుడుచుట కుడుపఁగఁబెట్టుట, యడిగిన నిడు టడిగికొనుట యంతఃస్థం బే ర్పడ నెఱుఁగుట యెఱిఁగించుట, కడుమైత్రికి లక్షణములు గనుగొన నాఱున్.

క. పెనులేమియైన విడువమి,యును గుహ్యము సెప్పుటయును నొకయాపద బొం దినయప్పు డడ్డపడుటయు,మనమునఁదలపోయఁ బరమమైత్రికిఫలముల్. 743

ఆ వె. ఒకతల్లికొప్ప నుదయంబుఁ బొందినబాంధవంబుకంటె బహుగుణముల పసుధ నెన్నిచూడ వాగ్జాతబాంధవం బధికమండ్రు చూవె యార్యులెల్ల. 744

ఆ.వె. ఆతురమున కైనయాతఁడె చుట్టంబు
నరసి ప్రోవఁజాలునతఁడు తండ్రి
అరయ నమ్మ మెలఁగునతఁడె మిత్రుఁడు తన
మదికిఁ బ్రియము సేయు నదియె తల్లి. 745

క. ఆపదలు వచ్చి పొందిన. నోపికమైఁ బరఁగుమిత్రుఁడొక్కఁడె తక్కన్
ప్రాపగుదు రున్నవారసు. నీపలుకు వినంగఁ జెవుల కింపిద మగునే. 746

క. పరిపూర్ణుఁ డయ్యుఁ బురుషుఁడు,పరమసు హృత్తులన యాసపడవలయుమదిన్
బరిపూర్ణుఁ డయ్యు నంబుధి,పరగఁగ శశిపొడుపు నాసపడఁడే యెపుడున్.747

ఆ.వె. ఎవ్వఁడైన నొక్కయెడరు పుట్టినయప్పు,డైనవాఁడె మిత్రుఁ డరసిచూడ
నేచియున్న యప్పు డెవ్వారు నేటికి, శత్రుఁడైన నపుడు మిత్రుఁ డగును.748

ఆ.వె. అధికశోక మొదవి యానందమైనను. నిష్టజనునిఁ జూచు నెప్పు డెవ్వఁ
డతనికెల్ల దుఃఖ మది క్రొత్తయేకాని, మాననేర దెట్టివారికైన. 749

ఆ.వె. అర్థి నేలికకును నబలేనిసఖునకు, వలయు నంగనకును వరభటునకుఁ
జెప్పవలయు మఱుగు సేయక యెట్టైన, మాను నెట్టిదుఃఖమైనఁ బిదప. 750

—పంచతంత్రి

క. కానలు దరికొనుపావకుఁ, దైనప్రభంజనుఁడు మిత్రుఁ డల్పతదీపం
బైనశిఖి నార్చుఁ గావున, హీనుం డగువాని కెందు నెక్కడిమిత్రుల్. 751

—నీతిభూషణము

క. చెలిచుట్టంబు లడంగిన, నొలసినతఱి బుద్ధిమంతుఁ డొకమార్గమునన్
దొలఁగింపకున్ననాతఁడు,బలుపాపము నొందు మనువుపలు కిది మొదలన్.752

క. పనివడియ తానె వచ్చినఁ, గనుకొని పెడమొగము పెట్టుకష్టునిగేహం
బునకు మఱిపోవు మర్త్యుం,డెనయఁగ శృంగములులేని యెద్దనఁగఁదగున్.753

క. గొనమొందె దోసమొందెసు, నొనరం గని రెంటియందు నొక్కఁడు సేయన్
గనఁజాలనిసరుసింటికిఁ, జనుకంబెను నొండుహోఁత జగమునఁ గలదే. 754

ఆ.వె. ఉల్లమెఱుఁగనీనికల్లరితోఁ జేయు, మైత్రికంటె మేలు మర్కటంబు
తోడనైనఁ బాముతోనైనఁ బెబ్బులి, తోన చేయవచ్చుఁగాని తుదను. 755

—పంచతంత్రి

ఆ.వె. కనకకలశభాతి ఘనుతోడిచెలిమియు, నవియ దవిసె నేని యదకవచ్చు
కష్టుతోడిచెలిమి కడవకంటెను వేగ, మవియు నవిసె నేని యదకరాదు. 756

ఆ.వె. కారణంబు గలిగి కలుషంబుఁ బొందిన, వాని శాంతుఁ జేయవచ్చుఁ గాని
కారణంబు లేక కలుషించువానిఁ గా, రాదు శాంతుఁ జేయ బ్రహ్మకైన. 757

ఆ.వె. తగిలియెవ్వఁ డుర్విఁదనకంటె బలవంతుఁ, డైనశత్రు మిత్రుఁగాఁగఁజేర్చు
కొను నతండు విషము దనకుఁదాఁ దిన్నవాఁ, డగుఁదలంపు సందియంబులేదు.

క. ఘనమును బ్రాతశ్ఛాయయు, వనితాజనయౌవనంబు వండినయన్నం
బును గడుమూర్ఖస్నేహం, బును నిల నవియ్యల్పకాలభోగ్యము లరయన్. 759

క. దూరము వ్యవసాయకులకు, భారంబు సమర్థులకును భాసుర విద్యా
పారగులకును విదేశము, వైరము ప్రియవాదులకును వసుమతిఁ గలదే 760

ఆ.వె. అతివివేకి భక్తి నడిగిన నేమేనిఁ, జెప్ప దాన నేమిసేగి గాదు
వినుభ నెఱుకలేనివానికిఁ జెప్పుట, యడవిలోన నేడ్చినట్లు సుమ్ము 761

—చాటువు

## అనసూయత

క. వినుతచరిత్రులచరితలు, గని విని హర్షించెనేని గనఁదత్కృతపు
ణ్యనికాయసదృశఫల మది, యనసూయతఁ బోలె ధర్మ పవనిం గలదే. 762

క. గుణలగుణంబులఁ బొగడుచు, గుణియౌ నతిలోభ ముడిఁగి గుణుల సముద్య
ద్గుణములు నిందించినఁ దన, గుణములు సెడుఁగాక వారిగుణములు సెడునే.

క. పరగుణములు సైరించెడు, నరుఁ డుద్యోగించునది గుణంబులు వడయన్
బరగుణము లడఁపఁజూచుట, కరకరకిరణములఁ జేతఁ గప్పుట కాదే. 764

—పురుషార్థసారము

ఉ. శ్రీగలవానిఁ జేపయుఁ బ్రసిద్ధపతివ్రతఁ జెడ్డయింతియున్
జాగిని వజ్రలోభియు సుజాతి విజాతియు ధర్మనిర్మలో
ద్యోగిని బాపకర్ముఁడును నొప్పెడువానిఁ గురూపుఁడున్ విశే
షాగమవేది మూర్ఖుఁ జెడనాడుచు నుండుట నీతినైజముల్. 765

—పంచతంత్రము

## దండయాత్ర

సీ. తనయమిత్రామిత్రధనభూమిసాధనం బరయంగ దూరకార్యానుకరణ
మాత్మసైన్యపరిగ్రహములందు రక్షయుఁ బరధీరపరచక్రభంజనంబు
దండంబుచే నివి తగ నుద్భవిల్లు నాదండోపహతిఁ బతి తాన పొలియు
దండబలాఢ్యుఁడై యుండుభూవరునకు నరులైన మిత్రుల యగుదు రెలమి

ఆ.వె. దండబలసముగ్రదర్పాధికుం డగు, భూవరుండు సకలభూతలంబు
నాక్రమించి తాన యనుభవించుచు నుండుఁ, గాన దండబలము కలుగవలయు.

చ. వ్యసనము చెందఁడే వ్యసనియై రిపుఁ డూర్జితుఁడైన నోర్వఁగా
వసమగు నేని యాత్మహితవాంఛితముల్ మడియించె నేనియున్
గసమస మొప్పఁగా విమతకర్కశపీడనకర్మశక్తియున్
బొసఁగినయేని రాజు పరభూమికి నాత్మ యొనర్ప నొప్పగున్. 767

—అజ్ఞాతము

క. ధనమును సైన్యము మిక్కిలి తనకుం, గలయపుడ వలయు దండోద్యోగం
బొనరింప నట్లు సేనా, ధనబలునకుఁ గలుగు సకలధాత్రీతలమున్. 768

—పంచతంత్రి

గీ. మహితనయమార్గశక్తియ మంత్రశక్తి
చారుధనదండములు ప్రభుశక్తి యయ్యె
సత్త్వసంచార ముత్సాహశక్తియయ్యెఁ
ద్రివిధశక్తియుతుండు నిర్జించు రిపుల. 769

సీ. పితృపితామహసమర్పిత మైనధనమును భూరిబలఖ్యాతిపౌరుషంబు
బహువిధయోధసంబాధంబు బహుజన్యకుశలము బహుశస్త్రకోవిదంబు

కుశలావృతంబు నకుంఠితక్రియయును నీరాజితతురంగవారణంబు
అన్యోన్యమిత్రతాఘన్యప్రచారంబు సమయసముత్సాహసంగతంబు

గీ. అమితదీర్ఘప్రవాసనిరంతరప్ర, యాసదుఃఖకృతశ్రమభాసురంబు
నష్టవిధంబును క్షత్రియోగ్రసుభట, బహులమును నివి దండసంపద్గుణములు.
—కామందకము

క. అభిమతనయశాస్త్రస్థ, ప్రభుమంత్రోత్సాహశక్తిపరుఁడై ధాత్రీ
విభుఁడరివరుల జయించుచు, నభయమ్మున నేలవలయు నఖిలావనియున్. 771
—పురుషార్థసారము

క. చప్పలనె యుండి శాత్రపు, లెవ్వనితేజమున కులుక రెక్కాలము వాఁ
డివ్వసుధ తల్లియొప్పెడి. జవ్వన మది పెఱుచుకొఱకు జనియించు టగున్. 772

ఆ.వె. శత్రుశోణితమున శాత్రవకామినీ, చారునయనబాష్పసలిలములను
నవనిఁ దడపఁడేని యారాజులావును, జీవనంబు వేఱ చెప్పనేల. 773
—బద్దెనసీతి

క. ప్రవిమలవిక్రమపరుఁ డగు, నవనీశ్వరునంకతలమునందు రిపుశ్రీ
దవిలి కుటుంబినిపోలిక, నవికళమై యుండు నెపుడు నంచితమహిమన్. 774

మ. తగ వేపట్టును లేక దుర్వ్యసనియై ధర్మక్రియాహీనుఁడై
తగువారుం బ్రజలున్ విరాగు లగుచేఁత ల్సేయుభూపాలుపైఁ
దగ దండెత్తినరాజు గెల్చు నరికిన్ దా దండయై నిల్వఁగాఁ
దగు రా జచ్చట లేకయున్నఁదగు దద్రాజ్యంబుసున్ జేకొనన్. 775

క. అనురాగియు సద్వృత్తుఁడు, ఘనశక్తిత్రయము దైవికముఁ బౌరుషమున్
ఘనమును దన కబ్బినపతి, సనునది యివి లేనియట్టిజనపాలుపయిన్. 776
—నీతిభూషణము

క. ప్రెగడల మనసులు విరసము, లగుగతి నడచురిపురాజ్య మడఁచి విశీర్ణం
బుగఁ దాఁ గలంచి పైకొని, జగతీవర కొనఁగవలయు సౌకర్యమునన్. 777

ఆ.వె. కుటిల నిచ్చుతజియు గురువర కేడించు, నవసరం బెఱింగి యానృపాలు
నిలుపుధీరవృత్తి నిడుదాట బోనిమ్మ, గ్రమ్మకటులసగ్మ గ్రమ్మిచెఱుపు. 778
—ధృతరాష్ట్రనీతి

క. విమతుల కాపదలు ప్రమా, దమునం దొరకొనినయప్పుడ తగుఁ బైఁజని వి
క్రమమెల్లఁ జూపునది సిం, హముగతి నరి యల్పుఁ డధికుఁ డగుకాలమునన్.
—నీతిసారము

క. అరియాప్తులు దనుఁ గూడిన, నరి కాప్తవిరోధ మైన నరి యొక్కెడ నొం
డరిచే డస్సినయత్తఱిఁ, బరిగొని యరిలక్ష్మి భూమిపతి గొను మాత్రన్. 780

క. ఇవియెల్ల శత్రుజయమున, కవసరములు గాఁగ నెఱిఁగి యాత్రోత్సుకుఁడై
తివిరెడిభూపతి రిపునృప, నివహముఁ బొలియించు సమయనిర్భరవృత్తిన్.
—పురుషార్థసారము

క. తనసత్త్వము రిపుసత్త్వము, మనమునఁ దర్కించి శత్రుమర్మజ్ఞులఁ దా
నును జెనకఁ జనిన విజయ, మ్మును నరు దిట తనదుదేశమును గోల్పోవున్.
—పంచతంత్రి

ఆ వె. విమతులావెఱింగి వెఱ పేఁది తొడరుట, మిడుత లగ్గిమీఁదఁ బడినయట్లు
తోడు లేక నధికుఁ దొడరుట యంబుధిఁ, గలము లేక యీదఁ గడఁగినట్లు. 783
—నీతిసారము

క. ఉపచయ మెంతయుఁ దనకై, యపచయము విరోధి కైనయవసరమునఁ బై
నృపులెత్తి యత్రమమునం, దపరాజితలీలఁ గొను జయంబును ధరయున్. 784
—పురుషార్థసారము

చ. మొనకొని దేశకాలబలముం దగ దైవబలంబుఁ గల్గఁగా
మొనసి విశేషమూలబలము న్నిజబాహుబలంబు నచ్చి పైఁ
జని రిపులన్ జయింతు రని శత్రుల కిన్నియుఁ గల్గియున్నచోఁ
జెనయక దానమానములఁజేసి జయింతురు నీతికోవిదుల్. 785
—ముద్రామాత్యము

ఆ.వె. ఒనర ఘనునిఁ జంపు నుత్సాహశక్తిసం, పన్నుఁడైనవాఁడు సన్నమైనఁ
గడఁగి యలఁతియైనకంఠీరవం బేచి, దొడ్డయైనగజముఁ ద్రుంచినట్లు. 786

చ. అతులబలాఢ్యుఁ డైననరుఁ డాఱడిదేశము కేఁగియున్ స్వదే
శమునఁనపోలె నొప్పి మను శాతనఖంబులశక్తియై యవ

ఖ్యాయములకు నేఁగినం దివిరి యప్పటసింహము కుంభికుంభమాం
సము తినుఁగాక యాఁకొనినచక్కటిఁ బూరికి నబ్బు సామునే. 787

ఉ. దైవవశంబునం గలుగు దండ మవగ్రహతీవ్రరోగపీ
డావలి మెట్టి దేశమునసైనను గాలబలాపకృష్టమై
కేవల మట్టిపేళఁ బరికించుచు నల్పకుఁ డేల దండయా
త్రావిదుఁ డైన గెల్వఁడె యరణ్యసురక్షిత దేశమేనియున్. 788

క. తాన పురరక్షకుండై, మానుగఁ బతి నిల్చి తనకుమారునినైనన్
సేనాపతినైనను రిపు, పై ననుపఁగవలయు నల్పబలములతోడన్. 789

——పంచతంత్రి

క. తనచేతఁగాని కాదను, పనికిం బ్రతినిధిగ నెవ్వఁ బంచినను దీ
రునె యౌషధంబుమా ఱిది, యని మూల్యం బిడిన రోగ మరుగుట గలదే. 790

——నీతిభూషణము

క. వివిధకళాకోవిదుఁడై, సవినయుఁడై యీగి గలిగి సంగరజయుఁడై
నిపుడనిన్నృపతులఁబొందునె, యువిదయుఁ గీర్తియును నౌభళోత్తమకందా. 791

——నీతితారావళి

మ. ఘనబాహాబలుఁ డైనశాత్రవునిపైఁ గార్తిక్యచైత్రంబులన్
జను టొప్పు న్మఱిదాడివోవ నెపుడైన న్మేలు శత్రుండు దా
ననయంబున్ వ్యసనం బొకంటఁ బడ యుద్ధాసక్తిమై నున్కిఁ దా
వినునే నత్తఱి భేదమందు హతుఁ గావింపన్ దగున్ జయ్యనన్. 792

——పంచతంత్రి

మ. పరిపాకాగతసస్యమున్ వ్యపగతాంభఃపంకసారంబునున్
ధర సంపుల్లరసాలకంబు నగుయాత్రాయోగ్యకాలంబునన్
ధరణీనాథుఁడు దాడిరూపమున సన్నాహంబుమై నేఁగినన్
బరిపంథిక్షితిపాలకుల్ నిజపదాబ్జద్వంద్వముం జేరరే. 793

క. దేవబ్రాహ్మణపూజలు, గావించి ప్రశస్తతారకాగ్రహబలుఁడై
కేవలతద్భేదయుతుం, డై విభుఁ డభియాతిమీఁది కరుగఁగవలయున్. 794

——కామందకము

క. పరవిద్యాచ్ఛేదకులై యురుసురపతిమంత్రతంత్రహోమక్రియలన్
బరబలసంక్షోభరణా, కరు లగుమాంత్రికులు పతికిఁ గలుగఁగవలయున్. 795

క. ప్రతికూలవేళ లెఱుఁగుచుఁ, బతినృపరాశ్యాదు లెఱిఁగి పతిరాశిఫల
జ్ఞత యొఱు లెఱుంగకుండఁగ, సతతము రక్షింపవలయు సాంవత్సరికుల్. 796

—పురుషార్థసారము

ఆ.వె. మఱి యుదాత్తజనులు మహితవ్యసను లైన
నధికశక్తియుక్తుఁ డైనపతియు
నెత్తి చననశక్తుఁ డెన్నివిఘ్నంబులఁ
బక్షవికల మైనపక్షివోలె. 797

క. అపజయముకంటెఁ గష్టము, నుపమింపఁగ జయముకంటె నొప్పును వసుధా
ధిపులకు లే దట్లగుటన్, గపటోపాయమున నైనఁ గార్యము వలయున్. 798

క. గాంగేయ ద్రోణ రాధే, యుం గపటంబునన గెల్చియును బాండవు లు
ర్విం గడు నుతి కెక్కిరి, రణరంగజయం బఖిలదోషరాశిం గడుగున్. 799

—కామందకము

ఆ.వె. ఆత్మరక్షణార్థ మరుల జయించిన, పాపమొంద దది శుభాకరంబు
కాన కోప ముడిఁగి కడుఁ దమకింపక, గూఢబుద్ధి జయము గొనఁగవలయు.

—ముద్రామాత్యము

క. తా నెంత శూరుఁ డయ్యు న, నూనపరాక్రముని నొక్కయోఁకునఁ జెఱుపం
గా నేరవలయు వాఁడున్, దానును దలపడియెనేని తానో వాఁడో. 801

క. ఒఱపునఁ దనయాజ్ఞకు లోఁ, బఱుచుట తగుఁగాక నధికబలవంతులకున్
మఱు వైనదేశముల్ తెగఁ, జెఱచుట పగతురకుఁ దెరువు సేయుట గాదే. 802

క. గడి నున్న సదృశబలుతో, నొడఁబడియుండునది గాని యోపక వానిన్
గడునధికుఁ దెచ్చి చెఱిచిన, చెడుఁదానుం బొరుగునింటఁ జిచ్చిడినక్రియన్. 803

క. ఇమ్ముగ దవ్వులచుట్టము, నమ్మి సమీపస్థుఁ బగగొనంజన దటుపా
ర్శ్వమ్మున ఫణి గఱచిన దూ, రమ్మునవేఁజెజ్జు దీర్పరా పేర్చుపడిన్. 804

క. ఒఱపైనపౌరుషప్రదేశము, చెఱచుసమీపస్థుఁ డతనిచెలిమియు వేచే
కుఱ(బట్టు నవసరము గా, నుఱుమిత్రుంజేయవలయు నుర్వీశునకున్. 805
—పురుషార్థసారము

క. బలియునకుఁ దనకు నడుమై, నిలిచిన సామంతుఁ జెఱుప నేరమి వచ్చున్
ఫలిబోనుతలుపు చెఱచినఁ. బొలియింపదె మీఁద నటికి పురుషనిధానా. 806
—శ్రీరామాయణము

## శకునజ్ఞానము

సీ. ప్ర(బలఘాతావేశ) భంగిమై నుద్భూతబహురోగసంకటోపద్రవంబు
ఆకస్మికోద్వేగ మతిరజోనీహారచటులవాతోద్ధూతసంవృతియును
(వేఁకమై ధ్వజ మొక్కవెర వేది విఱుగుట ద్రోహ మొందొరులపై
దొరయుచేఁత

విస్వరబహుతూర్యనిస్వన ముద్భవత్త్రిసదీర్ఘోల్కాదిదారుణంబు

గీ. ఆయుధంబులమంట లుదగ్ర మగుట, యప్రదక్షిణ మైనశివారుతంబు
కాకగృధ్రాదివనపక్షిభీకరంబు, రక్తనిర్భరవృత్తియు రక్తవృష్టి. 807

శా. క్రూరోత్పాతకదుర్గ్రహావృతనిజక్షోణీశనక్షత్రమున్
సారాదిత్యకబంధబంధనము సశ్వవ్రాతభేదంబునున్
దూరీభూతమదాంబుశీకరకరోద్భూతంబు ముఖ్యంబుగా
నారూపం బగువైకృతం బొదవ భూపాలప్రణాశం బగున్. 808

సీ. అఖిలజనస్తోమహర్షంబు సమ్మతి నిర్మలదుందుభినిస్వనంబు
భూషితగంధర్వహేషారవంబును మాతంగబృంహితమంగళంబు
పుణ్యచతుర్విధభూరినాదము శుభగీతనృత్యములుఁ బ్రఖ్యాతజయము
నిరుపమద్రవ్యంబు నీరజోవృష్టియుఁ గడుఁ బ్రదక్షిణగతగ్రహగణంబు

గీ. అనుదితోత్పాతములును విహంగసంఘ
మధురరవమును ననులోమమారుతంబు
పొలుపు మీఱఁగ నివియును భూపతులకు
నధికమిత్రబలాభ్యుదయాన్వితంబు. 809

సీ. దక్షిణానిలముఁ బ్రదక్షిణాగ్నియు సేవ్వసంతతోత్సాహంబు సాధువాద
చారుమంగళపాఠకారవంబు సుహృష్టపుష్టజనంబును బొలుపు మిగుల
నతిమనోహరముగా నరసిచెప్పిన శుభకలితలక్షణములు గలిగియున్న
యట్టివేళంబు ప్రఖ్యాతమై పొలుపొందు నతిశుభమై యుండు నధికశత్రు

ఆ వె జయము గలుగు నట్టిచంద మొందఁగ విపరీత మయ్యెనేని.........గదిరి
యపజయంబు నొందునట్టిచందములెల్ల నెఱిఁగి నృపతి నిశ్చయింపవలయు.810

క. ఇప్పగిది శుభాశుభములు. తప్పక చెప్పెడినిమిత్తతత్త్వస్థితిఁ దా
నొప్పగుభూపాలకులకు. నెప్పుడుఁ బరికించునది సమీహితబుద్ధిన్. 811

ఆ.వె. తగుసహాయసంపదయును బ్రజ్ఞానంబు. సత్త్వవృద్ధి దైవశక్తియుక్తి
సముచితోద్యమంబు సద్వ్యవసాయంబు. గలుగునేని కలుగుఁ గార్యసిద్ధి. 812
—కామందకము

చ ఘనతృణధాన్యమిత్రజలకాష్ఠజలంబులనెల్ల నెమ్మెయిన్
బొనరగఁ గూర్చికో కెడరు పొందగఁ జేసిన హాని పుట్టు వీ
డున కటు గాన భూపతి పటుస్థిరబుద్ధి తృణాదిరక్షణం
బనువునఁ జేయు టొప్పగు నిరంతరముం గడు నప్రమత్తుఁడై. 813
—అజ్ఞాతము

మ. పరగన్ భూపతి యిట్లు దండు విడియింపన్ యోగ్యమౌ సేనకున్
పెరవారంగ శుభాశుభంబులు గడు వీక్షించు టొప్పారు ని
ట్లరికి న్మేలును గీడుఁ జూచి యరిసైన్యం బల్ప మైనన్ శుభం
బరియం బొందకయున్న నుద్యమము సేయన్ మేలగున్ యాత్రకున్. 814
—కామందకము

వ. మఱియును. 815

క. ఘనబలనిహితుల శూరులఁ, దనగృహమున దుర్గములను దగ నిడి యుదకం
బును సస్యములును గలపథ,మున రిపుకై యేఁగవలయు మోదముతోడన్.816

క. తనుఁ దనదేశము దుర్గము, ననువుగ రక్షింప నోపునాప్తులఁ దగుచో
సునువక దండెత్తుట మొల, మునుగలవస్త్రంబు మస్తమునఁజుట్టు టగున్.817

క. ఇరువెఱఁగు యానంబుల
నరయంగాఁ బ్రాణరక్షణార్థం బొకఁడున్
మఱ మొనరించుట నొకఁడును
ధరపయి నివి యుభయయానభంగులు జగతిన్. 818

—నీతిసారము

సీ. చిరకాలభటఘోటకప్రజారోహణకుశలుండు ధర్మార్థకుం డరోగి
సంచారదూతప్రచారజ్ఞుఁ డల్పశరీరుండు రాత్రిప్రచారనిపుణుఁ
డరిసైన్యభంజనుఁ డాత్మసేనాధీనపరనయసంధానోపాయదక్షుఁ
డధ్వానశీతాతపాత్యుగ్రతరవృష్టిగురుభయగ్లాన్యాదివిరహితుండు

గీ. సమరసాధ్యనిశ్చయుఁడు మల్ల, యుద్ధనానాయుధానేకయుద్ధజయుఁడు
నైన దళవాయి నేలినయతఁడు రాజు, ఘనకళాభోజ యబ్బయకందరాజ. 819

—చాటువు

క. కులవిద్యాచారంబులు, బలగము కార్యంబు హితవు ప్రభుతయుఁ జలముం
గలిగి శుచి యైనవానిని, దళవాయిం జేయవలయుఁ దంత్రానుమతిన్. 820

—నీతిసారము

గీ. అట్టిసేనాధిపతి సదోద్యమముతోడ, సేనఁ బ్రోవంగవలయు దివానిశంబు
అట్టి వనదుర్గభయముల నడపవలయు, సైన్యసన్నాహవిభవంబు చాల నొప్పు.

—కామందకము

క. పరిగొని శీఘ్ర మరాతులఁ
బరిమార్పఁగ నాదవుఁగానిపట్టులఁ గడు ని
ర్భరముగఁ దొలంగి యప్పుడ
యరివర్గము ముట్టి చంప హయములు వలయున్. 822

—పురుషార్థసారము

క. అశ్వములు గలుగురాజుకు, విశ్వంభర చేతనుండు విమతుల మనుభూ
మీశ్వరు లెవ్వరు వెఱతురు, శశ్వద్ధాటీవిహారసామర్థ్యమునన్. 823

—నీతిసారము

క. దూరమున నున్నరిపులం, జేరంగా వేగ మరుగఁ జేరినమొనలం
బోరఁ బతి వలసెనేనియు, వీరాధిష్ఠితతురంగవితతి ఘటిల్లున్. 824

క. దురమున ఘోటకనికరం, బరుదుగ వాహ్యాళిఁ బ్రీతి యలరించుచు మం
దిరముల లక్ష్మీకరములు, హరులకు వేభంగి నొండుయానము లెనయే 825

—పురుషార్థసారము

క. పూజించి తన్నుఁ బ్రోచిన, రాజుం దా నొచ్చి యైన రణరంగజయ
భ్రాజిష్ణుఁ జేయునుత్తమ, వాజి గరం బరుదు లక్షవారణములకున్. 826

—కామందకము

క. నాలుగుకాళ్లను గొనయును, వాలము వదనము విశాలవక్షము దెలుపై
మే లై నయష్టమంగళ, నేలినపతి యేలు నవని యేలెడుపతులన్. 827

—శాలిహోత్రము

చ. స్ఫుటపరికల్పితంబు నరిసూదనసంయుగదృష్టమార్గముం
బటుతరదంతఘాత మతిబంధురవీరతమాధిరూఢమున్
గటతటవిభ్రమద్భ్రమరగానసముత్సుక మైనయేనుఁగొ
క్కటియ వధించు నాజి నరకల్పితషష్టిశతాశ్వయాసమున్. 828

—కామందకము

ఆ.వె. వరులుగ్రువ్వినపుడు భటు లెందఱైనను, గదియ లేరు వివిధఘాతములకు
సైప నోపుఁగాన సామజంబులకంటెఁ, గలదె విజయమూలకారణంబు. 829

క. తనరూపము రిపుభయదము, తనయంగము లాయుధములు తనవిక్రమసం
జనితమ విజయము తనయుని, కిని సిరియునికియ యనంగ గిరి కరికెనయే.

ఉ. యానము సౌఖ్యకారి యధికారికి రక్ష బలంబు శాత్రవ
స్థానవిరోధినిర్భరత సంఘవిభేదనదార్ఢ్య మొప్పన
న్యూనరయాపహారి మదయోగము నభ్యుదయప్రదంబయా
నేనుఁగుబోలెనే విజయహేతువు రాజులకొండు గల్గునే. 831

క. కూరిమి గలిగిన జీతం, బారగ నిచ్చునది గాని హస్త్యశ్వములన్
నేరనివానికి నెక్కన, కారణమున నీఁగి బుద్ధి గా దధిపతికిన్. 832

—అజ్ఞాతము

క. నచ్చి కడుఁ గడిఁదిరిపుతో, నచ్చుగఁ బోరంగ గిరిగుహాపరిఖంబుల్
చొచ్చి రిపుదుర్గములు గొన, వచ్చునె కాల్బలము లేని వసుధేశునకున్. 833
—నీతిసారము

సీ. ప్రాంతబంట్లును (గూలిబంట్లును) మన్నెలబంట్లును జుట్టపుబంట్లు కొ[illegible]
వశతనొల్చిన పగవారిబంట్లును దమయడవుల బ్రతికి తో నరుగుదెంచు
బంటును నన నాఱుభంగులబలములు వానిలోపలఁ బూర్వవంశ్యు లిష్ట
లన్యుల మన్నించు నప్పుడ తనమూలబంట్లకు నెగ్గగుభంగి వలదు

ఆ.వె. అడుగు విడిచి ప్రాంత లరుగు నష్టమయ్యు, విడిచిపోవునపుడు వెనుకనత్తు
ఱరులు భేదనిరతులైనను బట్టిన. ద్రోహములకు నోడుదురను గాన. 834
— కామందకము

గీ. ప్రజలోపల నుత్సాహపరత నాయు, ధములు ధరియించువారి కౌత్సాహికంబు
గాఁగ నీఁదగువారలు కడలఁ బనికి, వత్తు రేలిక మన్ననవానిఁ గోరి. 835

క. ఈ యేడుబలములందును, నాయకుఁడభిమానులైననరు లనిమొనగాఁ
జేయుచు నితరులఁ బిఱు సనఁ, జేయించుచుఁ గొల్లకాండ్రఁ జేయఁగవలయున్.

ఆ.వె. మానధనములందు మన్నన యిష్టంబు, తద్దయేని యిచ్చు ధనముకంటెఁ
గాన యర్థములకుఁ గడఁగి ప్రాణము లీరు, నరవరేణ్య మన్ననలకుఁగాని.

చ. బలమును బాహుకౌశలము భావము బుద్ధియుఁ గల్గి యాయుధం
బులఁ గడు నేర్చి తొల్లి రణభూములఁ బ్రస్తుతి గన్నబంటులన్
వెలయ నృపాలుఁ డేలునది వింతలఁ బ్రాంతల కేపరీక్షయున్
వలవదు ప్రోవఁగావలయు వారలె మూలము రాజ్యలక్ష్మికిన్. 838

ఉ. తూలినచోట నర్థముఖదోషము ముట్టినచోటఁ బెట్టుచోఁ
జాలనిచో నజేయు లగుశత్రులు దుర్గము ముట్టియున్నచో
నాలములోనఁ గూడుప్రజ యన్యబలంబుల కోడిపాఱుచో
నేలినవానిఁ జుట్టుకొని యెవ్వడి ప్రాంతలు కాక దాల్తురే. 839

చ. జనపతి గర్వియై సుభటసంఘము చూడక యుండఁ జేరవ
చ్చిన నడికింప జీవితము చెచ్చెరఁ బట్టఁగ నోపలేమి సె

ప్పిన నలుగంగ మా అలిగి బీరము( బల్కి-న( జెప్ప నేర్చు( గా
కని మొగరించి మించి బవీయంబడు నయ్యెడు గా(గనేర్చు నే. 840

ఉ. కొందఱు మేలమాడుటలు కొందఱు వావులు దీర్చి పిల్చుటల్
కొందఱు ముద్దుసేయుటయు గొందఱ నెయ్యపు(జూపు సూచుటల్
కొందఱ నాత్మభావమున( గొందఱ మన్నన భృత్యరాజి ని
ట్లందఱ నన్ని భంగుల నృపాగ్రణి వశ్యుల( జేయ(గా(దగున్. 841

మొఱపున( బోవుగాక మొగమోటమి నిల్చునె రాజుమోము ము
న్నెఱు(గనివంట్లువార(బలె యే మని భృత్యుల నూఱడించు( బే
ర్చెఱు(గనిరాజు తాన భటులెల్లను దన్ను నెఱుంగవారి( దా
నెఱు(గుచు( బ్రీతితోడ నిలువందగు రాజనువాని కెప్పుడున్. 842

—నీతిసారము

సీ. వానయు సీతును వర్జించి మండు పేసవి గాకమున్న సస్యములవంట
లోవపెడితటి నెత్తునది శత్రుపై( బూరిగడ్డియు నీళ్లు గలుగుతెరువు
గా( జూచి నడచుట కర్జంబు నిడములు గంకటములు బడిగలును విండ్లు
మొదలగునాయుధములు రథగజహయంబులు సవరణలు నపూర్వభంగి

గీ. నొప్పి యతిభీకరంబులై యుండవలయు, శంఖకాహళపటహనిస్సాణముఖము
లైనతూర్యముల్ మంచివి యగుట లెస్స,యధిప విడిదలనపుతల మగుట మేలు.

—శాంతిపర్వము

సీ. ఎందాక ధాన్యంబు లెందాక నిజమిత్రు లెందాక నుదకంబు లెస(గియుండు
నెందాక విశ్వాసు లే(గి యచ్చటివారి నాప్తుల గావింతు రంతదాక
నెందాక నీరీతి నితరునిదేశంబు శుద్ధమార్గంబయి సొంపు మిగులు
నందాక విజిగీషు( డార్తి జనంబులు నొంపకుండ(గ నే(గవలయు నిట్లు

ఆ.వె. గాక ధాన్యమిత్రఘనతోయవిస్వస్త, జనవిహీనమయ్యు( జనియెనేని
అనుగలంబు నొందియరులచే( గీడ్పడి, మరలి వచ్చునెట్లు మనుజవిభు(డు. 844

క. తనబలములకనురాగము, జనియింపగ ననుదినంబు సత్కారములన్
దనుపును గురుయుద్ధంబుల, జనులెల్లను మిగుల డస్సి చనకునికి తగున్. 845

—అజ్ఞాతము

క. [illegible] వారింపక, చపలుండై దూర పరుగుజనపతి రిపుదో
ర్దృష్టికి [illegible]వాంఛారా, సువదస్థుం డగు నయత్నసుఖసాధ్యుండై. 846

క. అ[illegible]తక్షయవ్యయాయా. సము లొదవెడు నట్టియాత్ర సన దొనరింపన్
గ్రమమున [illegible], సముచితధాన్యములు వ్యయము చాలను నగుటన్.

వ. మఱియును. 848

సీ. గ్రీష్మకాలమున నభోష్మశాంత్యర్థమై యమితజలాస్వాదం బడుగవలయు
నీరావకుండిన భూరితాపంబునఁ గుంజరంబులమేనఁ గుష్ఠమొదవు
[illegible]సంమను సామజంబులమేనఁ బ్రబలోష్మ మెప్పుడుఁ బ్రజ్వలించు
నాయాస మొదవినయపు దుష్టసుఖదమై నీరు లేకుండిన నేలఁగూలు

ఆ.వె. నీరుద్రావకున్న వారణముల కుష్ణతీవ్రవేదనమున దృష్టి సెడును
నిట్టి జంతుపంక్తి నెంతయు దురవస్థ వొదవకున్నె నీటి పొందులేక. 849

ఉ. [illegible]వంక్తికిన్ జలదకాలము యెప్పుడు నొప్పుఁ దా శుభం
[illegible] మేఘహీన మగుకాలము ఘోటహితంబు గావునన్
అ[illegible]పీతవర్ష నిబిడాతపశీతము గాక సస్యసం
[illegible] నట్టికాలము మనఃప్రియదం బగు దండయాత్రకున్. 850

—కామందకము

ఆ.వె. పరుల గెలువ నేఁగునరపతియొద్దన. ధనము బలము దగినధాన్యములును
గలుగు టొప్పుఁగాక పైకొన కెడనెడ, నునిచి సేన నిలిచియుండఁగలదె. 851

—నీతిసారము

ఉ. కొన్నిదినంబు లిక్కడ సకుంతితలీలఁ బథశ్రమార్తియై
యున్నబలంబు గెల్చికొను టొప్పగు నంతియ కాదు శత్రుభూ
మి న్నిజమార్గ మారయక మిన్నక యేఁగుట యేది బుద్ధి యా
యున్నెడఁ జూచి వెళ్లజను లున్నర చెప్పఁడు గూఢచారతన్. 852

—ముద్రామాత్యము

## యుద్ధదాన ప్రకారము

క. ఏనుఁగులమీఁద నతిజవ, యానంబులమీఁద నైనయర్థంబెల్లన్
బూని పతియొద్ద నిడునది, మానుగ నర్థంబ రాజ్యమహిమ దలంపన్. 853

క. నూతనకృత్య మొనర్చినఁ, బ్రీతుండై నృపతి యోధబృందము నర్థ
వ్రాతమునఁ దనుపవలయున్ దాతకుఁ బ్రాణంబు లీఁడె తక్కటిజనుఁడున్. 854

సీ. ఆజిలోపల రిపురాజుఁ జంపినవాని కొాగి నియుతార్థ మీనోపుచుండు
(దానిలో నర్థంబు తత్పుత్రు జంపిన సేనాపతి వధింపఁజెల్లునంతె
పదివేలువీరాధిపతి జంప నగ మందు నేనుఁగైన రథంబు నైనఁగూర్ప
నాశ్వికాధీశ్వరు నడఁగింప నొకవేయి నందర్థ మాశ్వికహతికి నీగి

ఆ.వె నగుఁ బదాతిముఖ్యు నాజిలో మార్కొని, బొరిసమర నూఱు పణము లీయ)
నితరజనులఁ దలకు నిరువదియును, వారి భోగ మినుమడింప నీగి యొప్పు. 855

ఆ వె యుగ్యహేమరూప్యయోగ్యభోగములను. మఱియుఁదగినయట్టి మహితవస్తు
సమితి నిచ్చి యోధజనులచిత్తం బిగు, రొత్తఁ జేయవలయు నుచితవృత్తి. 856

## ప్రయాణవ్యసన పరీక్ష

క. మకరవ్యూహం బొందెను, వికటాస్యం బైనయట్టి వీరాననసూ
చికయైనఁబన్ని చనునది, ప్రకటితశౌర్యమున నెదుర భయ మొదవునెడన్. 857

క. వెనుక భయ మైనశకటము, దనరఁగఁ బార్శ్వముల నైనఁ దగ వజ్రముగా
మొనచేసి నడచునది యెం, దును భీతి దనర్ప సర్వతోభద్ర మగున్. 858

సీ. కందరోన్నతశైలగహనవనీతటసంకటాయతిపథశ్రాంతజనుల
క్షుత్పిపాసాపరిశోషితాత్ముల రోగదుర్భిక్షమరణాదిదుఃఖితులను
రిపువిద్రుతుల భూమిరేణుపంకచ్ఛన్నజనముల బెదరిపోయినజనంబుఁ
బోక నిల్చిన నిద్రఁబొందిన భోజనవ్యగ్రత నొందినయట్టిజనులఁ

గీ. జననభూమిష్ఠజనుల నసంస్థితులను, నగ్నివర్షాధికవ్యసనాధికులను
జేరి నిజసైన్యజనుల రక్షింపవలయు, జనవిభుఁడు......... 859

సీ. అభియాతి రిపుమీఁద నరిగి యచ్చో సమస్థలమైన యెడ శుచిబలము మెఱసి
అధికసంకీర్ణంబు నతివిస్తృతము గాక రవిసోమవీథుల రమ్య మగుచుఁ
జతురస్రమై వాస్తుసమ్మతంబై పరిఖాంకమై యట్టళ్ల నమరి నాల్గు
ధరణీతలంబుగా ద్వారములు నాలుగు బాగుగా నిర్మించి లాగుఁజూచి

ఆ.వె. యదర నర్ధచంద్రునాకృతినొందెను, నొందె దీర్ఘమొందె మండలము
నైనయదిగ వెలయనధిపతి దనవీడు, విడియఁజేసి తనకు పెరవుతోడ. 868

వ. అట్టిశిబిరస్థలంబులు నవభాగంబులు గావించి యందు మధ్యభాగంబు
తొమ్మిదిభాగంబులు గావించి తన్మధ్యభాగంబు వాస్తుపురుషహృదయంబు
గావున నచ్చోటు పరిహరించి యందుత్తరభాగంబున. 869

క. మానుగ జనపతి మధ్య, స్థానంబున రాజగృహముఁ దగఁ జేసి వెసన్
దా నర్థగృహం బం దొగిఁ, బూని రచింపంగవలయు బుద్ధిప్రౌఢిన్. 870

క. మౌలభృతశ్రేణిసుహృ, జ్జాలాహితపన్యసైన్యషట్కము నవనీ
పాలునగృహంబు చుట్టును, బోలన్ విడియింపవలయు భూపతి వారిన్. 871

చ. తిరుగక పంతమున్ మెఱసి తేఁకువ పంతము గొన్న శూరులన్
బరుసనికుక్కలుం గలుగుబంట్లను బన్నియెడం బ్రతీతిగాఁ
దిరిగిన యట్టివారల నతిస్థిరచిత్తుల లోభదూరులన్
బరగఁగ నిల్పఁబోలు నరపాలుఁడు వేలముచుట్టు నుండగన్. 872

క. పేరుగలకుంజరంబులు, వారువములు భూమిపతినివాసముపొంతన్
వారక నిజాప్తరక్షో, దారములై యుండవలయుఁదమతమయెడలన్. 873

క. అంతర్వాసికసేన ని, రంతరసన్నాహమున సదాయతగతి భూ
కాంతుఁ బరిరక్ష సేయుచు, సంతతమును వలయు జాముజామున నిలువన్.

ఆ.వె. సంగరైకయోధసన్నద్ధగజమును, వాయువేగి యైనవారువమును
నుండవలయు నెపుడు నుర్వీశుమందిర, ద్వారభూమిఁ గడు నుదారశక్తి.875

ఆ.వె. కొంతసేన గూడుకొని సైన్యపతి రాత్రిఁ
గడుప్రయత్నపూర్వకంబు గాఁగ

[illegible]యంబు వెలి [illegible]ంతరసన్నాహ
[illegible]మున( జుట్టు( దిరుగవలయు. 876

[illegible]. [illegible]సైనికప్రచారము, పరికింప(గవలయు శీఘ్రపటుసత్త్వగుణా
[illegible] రాహుతు లొగిన, ప్పురసీమాంతఃప్రచారముల నెల్లపుడున్. 877

[illegible]. తో[illegible]మాల్యముల్ పవనధూతపతాకయు( గల్గుయంత్రిత
[illegible]ముల న్నిజా ప్తజనతాపరిరక్షణ మొప్ప( జెప్ప నె
వ్వారికి(బొచ్చి రా వెడల వచ్చుట లేక యరాతిదూతసం
[illegible] రాజశాసనవశంబున నయ్యెడ నిల్చు టొప్పగున్. 878

[illegible]. అతి[illegible]హాస్య, ద్యూతములకు( బానములకు( దొల(గి జనంబుల్
[illegible]కార్యోన్ముఖు, లై తనర(గవలయు మిగుల నాయిత మొప్పన్. 879

[illegible]. పరిఖాచక్రపథస్థలి న్నిజచమూపఙ్క్తి ప్రచారార్థమై
[illegible]భాగము గొంత మాని యితరస్థానంబులం దెల్లచో(
[illegible]ప్రవిఘాతబాధ మొనరింపంజాలునచ్చట్టునం
[illegible] [illegible]కీలభల్లచయమున్ బ్రచ్ఛన్నరూపంబుగన్. 880

[illegible]. [illegible]లు సానువు. లరయ(గ వల్మీకనిమ్నతాదులు బాహ్యం
[illegible]చే(, బరగ(గ వ్యాయామభూమి పరికింప(దగున్. 881

[illegible]. వాహినీవ్యాయామవరభూము లెంతయు నిచ్చానుకూలత నెలమి మిగుల
విమలుల కటుగాక విపరీతమగునెడ లుత్తమస్థలములై యొప్పుమిగులు
[illegible]కి( దనకును నేకరూపం బయి మానగునయ్యెడ మధ్యమంబు
[illegible]మూవ్యాయామపర్యంతమై తన కటుగాక తక్కిన నధమ మయ్యె
[illegible]. గాన యుత్తమంబు గైకొనునట్టిది, యైనచోటు మధ్య మన(గ నొప్పు
[illegible]మ మైన బంధనాగారసదృశంబు. గాన యది భజింప( గాదు పతికి. 882

—కామందకము

[illegible]. [illegible] లంక దుర్గము ఘనం బన నొప్పుత్రికూటశైలమ
య్యొగడిత వార్ధి మోఘులు సురారులు శ్రీలు కుబేరుపెన్నిధుల్

నెగడిననీతిశాస్త్రములు నిచ్చలుఁ జెప్పెడివాఁడు శుక్రుఁ డీ
జగమున నట్టిరావణుఁడుఁ జచ్చెన కాక మనంగ నేర్చెనే. 883

మ. చెలువం బేది యరణ్యవాసగతులై శ్రీరాముఁడున్ బాండవే
యులు చేటొందిరి వృష్ణివీరు లురుదైత్యుం డైనలంకేశుఁడుం
గలఁగె న్మర్త్యులచే నలంగె నలుఁ డీకష్టంపురాజ్యంబుకై
తలపోయం గడుదుఃఖహేతు విది వ్యర్థం బొప్ప దాసింపఁగన్. 884

క. ఆరాజ్యమునకు రాజులు, ధారుణిలోఁ దండ్రి నన్నఁ దమ్ముని సుతులన్
దారు వధింతురు గావున, దూరమునన యడఁగి చూచి తొలఁగఁగవలయున్.
—పంచతంత్రి

గీ. పరుఁడు తనకుఁ దగనిపాటు సంబంధంబు, గలుగఁ జూచికాని కలయఁ డెలదు
చేరినపుడ తన్నుఁ జెఱిచినయాతఁడ, యయ్యెనేమి పగతుఁ డయ్యెనేమి. 886

ఆ.వె. బలియుఁ డెత్తిరాఁగ బలహీనుఁ జేరుట
దంతియెదుర నుఱిమితప్పఁబాఱు
వఱదఁ బోవువాని వఱదఁబోయెడువాఁడు
పట్టు టాత్మసమునిఁ బట్టియునికి. 887

ఆ.వె. పలయు నాశ్రయింపఁ బలుపురిఁ బెక్కండ్రు
జేరినతని కెపుడు చేటు లేదు
పిల్లవెదురు లొప్పఁ బెనగొన్న వెదురొంటి
వెదురువోలె వశమె వేగ నఱక. 888

క. ఒక్కరుని నాశ్రయించిన, పెక్కండ్రును జత్తు రొక్కపృథుబలయుతుచేఁ
బెక్కుమహీరుహములు ధర, నొక్కమహానలము చేతనొఱఁగినమాడ్కిన్. 889

ఆ.వె. జగతిఁ బొగడ నెగడు సజ్జనాశ్రయమున
నెవ్వఁడుండె నెనక మెసఁగుపెంపు
జలజపత్రయుక్తజలము ముక్తాఫల
శ్రీ వహించినట్టి చెలువు దోప. 890

క. పెనుగజము ద్రుంచునక్రము, తననెలపున నుండి నెలవుదప్పిన మఱి తా
శునకంబుచేతఁ జచ్చుం, దననెలవున హీనుఁడైనఁదగ ఘను నోర్చున్. 891

[illegible]. కా[illegible]ముఁ [illegible]ంపు రాత్రియు, ఘూకము కాకంబు పగలు ఘూకచయంబున్
[illegible] త్రుంచుం గావున, గైకొనఁగా [illegible]చ్చుఫ[illegible]ము కాలముతోడన్. 892

[illegible]. [illegible]ండి తిగుచు శునకం, బురువడి నక్రమును నక్ర ముదకస్థితమై
[illegible] నేనుగుఁ దిగుచుం, బరవసమునఁ గాన దేశబల మొప్పు ననిన్. 893

—కామందకము

[illegible] మా[illegible] శత్రునైన నభిమానము సేయక చొచ్చివాఁడు దన్
హీనము గాఁగఁ బల్కిన సహించుచుఁ బ్రాజ్ఞుఁడు శక్తియుక్తియున్
గాన[illegible]బడంగనీక పొసఁగం ధృతిపెంపును గప్పికొంచు నిం
పూన[illegible] వారి గెల్వవలయుం దనకార్యము లైనయంతకున్. 894

—పంచతంత్రి

[illegible]. అరివధకుం దగునంతకు
[illegible]సేతుం డోర్వవలయుఁ దక్కువ యైనన్
[illegible]రుఁ బాఁటవయ్యు నుండఁడె
హరి గొల్లఁ డనంగఁ బడఁడె యనుపగుదాఁకన్. 895

—నీతిభూషణము

[illegible] యెడఁప దలఁచునాతఁడు. పగతుని పగవానిఁ గూడి……
.... .... .... .... .... 896

[illegible]. [illegible]యొకచోట వల యొగ్గి వేఁటకాఁడు
తొలఁ[illegible]యుండి మృగంబులఁ ద్రుంచువగిది
[illegible] శత్రుపు[illegible]ఁగూల్చు
[illegible] [illegible]యమార్గ మిట్లు జయింపవలయు. 897

—ముద్రామాత్యము

[illegible] [illegible]నైన నాతని, బలమది మానవుల మిగులఁ బ్రకటింపమియుం
[illegible] శమీకాష్ఠములోఁ, గలదను ననలంబువోలెఁ గైకొన రెందున్. 898

[illegible] [illegible] గుణమును శీలముఁ, బలమును సత్త్వంబు సాహసంబును ధృతియున్
[illegible] పురుషుని నవనిఁ, స్థలిలోపలఁ దృణము గాఁగఁ దలఁతురు మనుజుల్.

—పంచతంత్రి

క. ధీరుఁడు ముట్టినఁ దొల్లి వి, చారించిన తలఁపు మఱచు శస్త్రాస్త్రకళల్
నేరఁడు మెఱయం గావున, శూరుఁడు గావలయు నృపతి సుస్థిరగతియై. 900
—పురుషార్థసారము

ఆ.వె. తలఁచిచూడ రిపుఁడు తనకంటె ఘనుఁడైనఁ
దనరఁ దన్ను దాఁచికొనఁగవలయు
వానికంటె ఘనుఁడు తానైన హరి శర
జ్జలజరిపుఁడుఁబోలె వెలుఁగవలయు. 901

క. కోపించి రిపుఁడు రిపునకు, రూపింపక తొలఁగు టతనిఁ ద్రుంచుటమీఁదన్
ఏపారఁగుంగి సింహం బేపున, మదగజముఁ జంప నెగసినమాడ్కిన్. 902

క. చేరువకు భూరిబలుఁ డగు, వైరిమహీనాథుఁ డెత్తివచ్చిన నైనం
ధీరత యప్పుడ డింపని, భూరమణుని కీడొకండు వొందకయుండున్. 903

క. పగతుప్రతాపము గనుగొని, మగటిమి దెగఁదునిమి పుచ్చుమనుజేశుఁడు దాఁ
దగరపుఁబొడపునుబోలెను, జగమునఁ బూజ్యుండు గాక చను నెల్లెడలన్ .904

ఆ.వె. పగఱపయి నొకండు పాటించి నడవంగ,వెఱచి తనదునెలవువిడుచునెవ్వఁ
డతనికారణమున నతనిఁ గాంచినతల్లి,వంధ్య యనఁగఁబడుధ్రువంబుసుమ్ము.

క. హీనునకు ఘనునిచేఁ గీ, డైనను దేజంబు సముదహ స్తికి నగముల్
మానుగఁ గోరాడం దగ, హాని యగుం గొమ్మలేమి యది యొచ్చెంబే. 906

ఆ.వె. హీనుఁ డధికుచేత నీల్గుట యొచ్చెమే,మహితయశము కాక మదముకొఱకు
గండతటము ద్రొక్క గజకర్ణహతిఁ దేఁటి,యీల్గెనేని యొచ్చె మేమిగల్గు. 907

క. ఘనమును గడుహీనంబును,ననఁగలదె కరీంద్రుఁ డెంత హరి యెంత కరిన్
దునుమాడును హరిశాబము, ఘనమేటికి మనసు పెద్ద గలవారలకున్. 908

క. నిర్విషము చేసి పడగన్, దర్వీకరములకుఁ జూప దా కావున దో
ర్గర్వంబులేనివానికి, నుర్విం బెను విషయమైన నొక్కటి వలయున్. 909

క. కపటపులేఖలఁ బంపియు, విపులార్థచయంబు లెపుడు పెదఁజల్లియుఁ ద
ద్రిపుపక్షముఖ్యపురుషులఁ, గుపితుల దమసొమ్ముచేసికొనఁదగు పేగన్. 910
—పంచతంత్రి

ఆ.వె. పొద్దువాసితోడఁ బొడరి యూరకయుంట, కసవుకుప్పఁ జిచ్చు గలుగఁబెట్టి
దానిక్రిందఁ గాలఁ నిద్రపోయిన, వానిభంగి గాదె వసుధలోన. 911

—నీతిసారము

క. ఘనుఁ డెత్తివచ్చి విడిసిన, తన కోటయె హీనుఁ డెలమి తగుసుహృదుల రాఁ
బనిచిన యుక్తం బగువా, రును దానును దోల వదియుఁ గ్రొవ్వియ చచ్చున్.

మ. తనకున్ గెల్వఁగరానిపక్షమున వే తా వైరిఁ బోకార్చఁగా
ఘనశత్రుం బలపెట్టఁగావలయు వేగం బొప్ప నీతిజ్ఞుఁ డె
ట్లనినన్ వాఁడును బోరఁగా నిహతుఁ డౌ నట్టైన నప్పిమ్మటన్
పనవైరంబు నడంగదయ్యె దొడలుండన్.....కున్ సైన్యముల్. 913

ఆ.వె. బలియుఁ డగుశత్రుచేతన బలియుఁ డనఁగఁ
బేర్చుశత్రునిఁ బుచ్చి వైపింపవలయు
మూలనాశంబుగాఁ దన్ను మోవకుండఁ
బెలుచ ములుముంటఁ బుచ్చి వైపించినట్లు. 914

క. పొగడఁదగుసహజసత్త్వం బగు నెవ్వఁడు వాఁడు వాలియఁ డహితులచేతన్
జగతిమణిదీపశిఖ కడు, నిగుడుం గా కడఁగిపోవునే పెనుగాలిన్. 915

—పంచతంత్రి

క. వెఱపించి చూచి యెంతయు
వెఱవకయున్నతనిఁ జేర వెఱతురు మదిలో
వెఱచినఁ బాఁ బైపడగాఁ
నెఱుకుం గుక్కయును గ్రోతియును బగవాఁడున్. 916

—పురుషార్థసారము

చ. విను మను నీతియుం గలదు వేయును నేటికి దర్ప మేర్పడన్
అని యొనరింపఁగావలయు నారగ నుత్తమునందు సామమున్
బెనుపఁగ శూరునందుఁ గడుభేదము నల్పునియందు దానమున్
విను సమునందుఁ బౌరుషము నేర్పునఁ జేసిన జాల మే లగున్. 917

—పంచతంత్రి

క. తా నరులు వచ్చుతెరువున, మానుగఁ గలచెఱువులందు మడువులయందున్
బూని ఘనగరళతరళము, గా నొనరింపంగవలయుఁ గడువేగమునన్. 918

—ముద్రామాత్యము

గీ. ఎత్తినప్పుడు విడియుచో నిఱుకటంపుఁ
దెరువునందును నడ చెడి తిరుగఁబట్టి
నట్టియెడ నిద్రపోయెడునవసరమున
శాత్రవుల బిట్టు పైఁబడి చంపవలయు. 919

వ. ఇట్లుభయబలంబులుఁ గదియునప్పుడు 920

—సౌప్తికపర్వము

క. ముందటను భటులు భటుల పి
ఱుందను రథములును నప్పిఱుందను హయముల్
బొంద నటపిఱుద గజములు
నందంబుగ నిట్లు మిశ్ర మచలం బనఁగన్. 921

—కామందకము

క. వికటపటుశూలకళితా, శకటోద్భటగజఘటాదిచక్రవ్యూహ
ప్రకట మొనరింపఁగాఁ దగు, నకుటిలభుజదర్ప మొప్ప నాహవభూమిన్.922

—ముద్రామాత్యము

సీ. గట్టును జెట్టును మిట్టయు బిల్లంబుఁ గలిగినచోటు కాల్బలమునేల
వినుము నీళ్లను రొంపియును లేక సమవిశాలము నైనచోటు గుఱ్ఱములనేల
క్రమ్మి క్రుంగక గదగదగువంపులు గలుగమి నొప్పుచో టరదములనేల
యెడనెడ ప్రూఁకులు మడువులు గలచోటు కురునాథ యెఱుఁగుము కరులనేల

ఆ.వె. యేబలంబు దనకు నెక్కుడు గలుగు న
బ్బలమునేల పోరు గలను గాఁగ
నినుఁడు శశియు గాలి వెనుకగా మొన నడ
పించి పొదువ సంభవించు జయము. 923

—శాంతిపర్వము

చ. హరుమెడ నున్న సర్పము గణాధిపునెల్కఁ గ్రసింపఁ జూచు న
య్యురగము ద్రుంప షణ్ముఖమయూరము సూచు గజాస్యుఁ జంప నా
గిరిసుతవాహనం బయిన కేసరి చూచు నటేల యిమ్మహే
శ్వరుపరివార మిట్లనినఁ గగ్గాన నస్యులు మానవేర్తురే. 924

—పంచతంత్రి

క. మొన కొక్కఁ శౌర్యభూషణుఁ, జను నధిపతిఁ జేయ సమరసమయంబున వా
డును దళవాయికి నొఱపై, చనఁదగుఁ జనకున్న భేదశంకయుఁ బుట్టున్.925

క. మొనసేయ నేరకుండిన
మును శూరులు నడవఁ ద్రొల్లి మొనయును రాజున్
వెనుకొనకయున్నఁ బిఱుకుల్
మొన నొకరుఁ డున్న జయముఁ బొందఁగ వశమే. 926

ఆ.వె. నిబ్బరంపుఁదాఁకు నిలుపక రిపుసేన
దిరుగు మంద మైన విరుగుఁ దాన
కడవఁ గుడుప దాఁకునెడనైన వేగంబు
గలిగియునికి నిలుచుఁగాదె యిట్లు. 927

—నీతిసారము

క. నెఱబిరు దొకండు నిలచిన
బిఱుకులు నఱుముదురు వాని బిరుసున కని ను
క్కఱి యొకఁడు విఱిగెనేనియుఁ
బఱిపఱియై సేనయెల్ల భంగము నొందున్. 928

—పంచతంత్రి

ఆ.వె. రాజరాజవంశభూజనపతు లీల్లి, రకట మంత్రి దొలఁగి చులికినాఁడు
ఏది పనుపు సేయ నిటు నిల్వఁబోలదు, రాజులేనికయ్య మోజపడునె. 929

—ముద్రామాత్యము

క. జడియక మును నడచినభటుఁ, డడుగడుగున కశ్వమేధయాగఫలంబున్
బడయును వెనుకకు నొదిగినఁ, బడు దుర్గతి నంద్రు సమరపతనులకెల్లన్ 930

క. నరులకు నెచటికి నరిగిన
మరణము నిజ మగుట యెఱిఁగి మనుజుఁడు సమర
స్ఫురణంబు విడిచి వెనుకకు
నరిగిన నపకీర్తి దక్క నన్యము గలదే. 931

ఆ వె. చచ్చు నూర కొకఁడు జావఁ డొక్కఁడు పోటు
లెన్ని సోఁకియైన నింత యెఱిఁగి
మున్న నడచి కీర్తిఁ జెన్నగు టొప్పదే
దైవఘటన కేల తలఁక నరుఁడు. 932

—నీతిసారము

సీ. సమర మొనరించినంతనె చావురాదు, పాఱిపోయినయంతనే బ్రతుకు లేదు
యెటులఁ బోవుప్రాణ మిచ్చియు రణమున, పతిఋణంబు తీర్పఁ బాఁడిగాదె.
ఆ.వె. చచ్చెనేని యోగిచొప్పున ముక్తికి, సూర్యమండలంబు చొచ్చి యేఁగు
బ్రతికెనేని యుభయబలములఁ బొగడంగ,నుండు సమరకేళి యొప్పుచెట్లు.934

—మార్కండేయము

వ. మఱి యుద్ధంబు నిరూపింతు నదియును సంకులద్వంద్వైకాకిభేదంబు లన
మూఁడు తెఱంగు లందు ద్వంద్వైకాకియుద్ధంబులు మత్సరగ్రస్తులగు వీర
భటులపని గాని రాజకృత్యంబులు గావు. సంకులంబునకుఁ గరికోటచతురంగ
యుద్ధంబు లన మూఁడు భేదంబు లందును జొచ్చిపోయి పోరుట కరి
యుద్ధంబు, దుర్గంబుమీఁద విడిసి పోరుట కోటయుద్ధంబు. బయలం జతు
రంగబలంబులం బన్ని యుద్ధంబు సేయుట చాతురంగసంబంధంబు. ఇవి
క్రమంబున నధికునందును హీనునందును సమునందును బ్రయోగించునది.
యధికుం డెత్తినఁ గార్యోపాయంబున వేలంబు సొచ్చి పొడుచుటయు నను
వైన దుర్గంబు కల్లకోటగోడ గొనుటయు సంధికి నుపాయంబులు; హీనుం
డగువానిదుర్గంబు మీఁద విడిసి మహాయత్నంబున బహుయంత్రతంత్ర
కార్యంబుల గొనుట యుచితంబు. సముతోడ బయలఁ బోరునప్పుడు బలు
వెఱుంగని నరుగొంత మిగులం జూచి కాని యుపక్రమింపవలయు దైవ
మానుషంబు కలిమి యధికశక్తి యనంబడు. చతురుపాయషాడ్గుణ్యవేదియు
బలశక్తిసంపన్నుడును నూతనానితరసాధనోపేతుండును నయ్యును బయల

నధికుతోడ యుద్ధంబు సేయుట కొండతోఁ దగరు దాఁకినయట్ల యపజయంబు సిద్ధంబు. సముం డొడరినఁ బచ్చికడవ పచ్చికడవం దాఁకినయట్లు జయం బసాక్షికంబు. శూరుండు నుపాయవేదియునైనవానిని వాఁ డల్పుండైనను మిత్రుఁ జేయునదిగాని తెగవలదు, శూరబలం బల్పంబయిన గెల్చునుపాయ వేది శూరుండు గాకయు గెలుచు ననిన శౌర్యోపాయంబులు గలుగు నతని వేఱ చెప్పనేల. పరుండు సాధ్యుఁడు గా నిశ్చయించి యతని సహాయుల నుపాయంబునఁ బాపి యతనిదాయాదుల నేమి యిచ్చియైనఁ దొలగించి మఱియు ననేకప్రకారంబుల నదృష్టదూరార్థసాధకం బగుప్రజ్ఞాశస్త్రంబులన యుద్ధంబు సేసి యింక యిట్లనియున్నహాని యగువేళ నాసన్నదృష్టార్థ సాధకం బగుశస్త్రయుద్ధంబు సేయునది. కార్యవేళ యెఱుంగ కుపక్ర మించుట నీరు గానకమున్నె చెప్పు లూడ్చినట్లు. అవశ్యంబునం గెలుచు వానికి వైపరీత్యంబును గలుగు, అని యెల్లసంధులఁ గాక శకున స్వరభూమి గ్రహాదిబలంబులు గలవేళన యుపక్రమింపవలయు. పొడుపునకుఁ బిఱు కుబలం గూర్చిన బలంబు లెల్ల వెఱతురు. శూరులకైనను దాఁకుదలతెచ్చుట జయకారణంబు. మున్న రణంబునఁ గని యెఱుంగనివారు పరులసామర్థ్యం బెఱుఁగకైనను సర్వపదావిరుద్ధంబునైనను వీరాలాపంబులు పలికిన నమ్మ వలదు. మఱియును. 935

ఆ. వె. ఆహవేచ్ఛలేనియతని నాయతపాటు
లేనివాని భీతుఁ డైనవాని
యుద్ధకృత్య మొల్ల కున్నవానిని జంపి
నతనిఁ బొందు బ్రహ్మహత్య యనిరి. 936

క. యుద్ధమున గెల్చి రిపుచే, నెద్దన మెవ్వాఁడు దెచ్చె నేర్పడఁ బతి యం
మిద్ధారము గొన కాతని, కద్దన మంతయును నిచ్చునది ధర్మమతిన్. 937

క. ఇత్తెఱఁగు దెలిసికొని దం, డెత్తి చననిరాజు పరమహీశుల సిరు లు
ద్వృత్తిగొను నెట్లు సేకొను, గృత్త్రిమనయమతము లేక కేశవనాథా. 938

—మదీయము

ఆ వె. సింహవృత్తిఁ దాల్చి చేకొనవలయుఁ దా, సద్వివేకన్నృపతి శత్రులక్ష్మి
నధికదుర్వినీత లగుకామినులఁ గచ, గ్రహణ మమరఁ జేసి కవసినట్లు. 939

—పంచతంత్రి

## కూటయుద్ధము

క. లలితమణికూటశోభా, కలితప్రత్యర్థిమస్తకస్థలవీథిన్
లలి వామపాద మిడఁడేఁ, బొలుపుగఁ బరవీరలక్ష్మి బొందఁగ వశమే 940

క. భూరిప్రయత్నములచేఁ, బ్రేరిత మగుచిత్తహస్తిఁ బృథుసత్త్వమునన్
భూరమణుఁడు మూఢారి, క్ష్మారుహములఁ బెఱుక కెట్లు గైకొను శుభముల్.

క. హేలాకృష్టసుతీక్ష్ణత, రాలోలకరాళమండలాగ్రమరీచి
వ్యాలీభవాహు స, మాలంబన సేయు లక్ష్మి యభిసారికయై. 942

క. అనుకూలదేశకాలం, బును శత్రుప్రకృతిభేదమును ఘనబలముం
గని చనఁ బ్రకాశయుద్ధం, బొనరు నొనరకున్నఁ గూటయుద్ధం బమరున్.943

గీ. కందరప్రయాణాద్యవస్కంధవేళ
గని యభూమిష్ఠుఁ డగువానిఁ (గలఁచియైన
నతఁడు భూమిష్ఠుఁ డగు నేని) నట్టియెడన
జనుల భేదముచేసియేఁ జంపవలయు. 944

గీ. భగ్నమైనట్లు ద్రిమ్మరిఁ బాఱుతెంచు, వనచరాదుల వెనుకొని వచ్చువాని
నుఱక పాశాపకృష్టుని నొడుచుపగిది,యడరి సుభటులచేత నుక్కడపవలయు.

సీ. ముందఱ తేపఱర సముగ్రత నరుదేర నెక్కుచుఁ దిమురుచు నేపుఱించి
పటువైరిసైన్యంబుఁ బంచి యుదగ్రత దక్కించవలయుఁ దా నొక్కదెసను
వెనుకసైనను బంచి వికలము గావించి కడుకొని యెదుర నే పడఁపవలయు
నొకకెలంకున యుద్ధ మొనరించి వేఱొకకెలఁకునఁ దాఁకి స్రుక్కించవలయు

గీ. నెదుర విషమస్థలం బైన నెగిచి వెనుక
వెనుక విషమస్థలం బైన వేగ యెదురఁ
దాఁకి గెలువంగవలయు నుదగ్రగతిని
నిరుగెలంకుల నిట్లు జయింపవలయు. 946

క. బవరము దూష్యామిత్రా, టవికుల మును దాఁకి కడుదృఢంబుగఁ జేయన్
దివుటను వేసటపడుశా, త్రవుని నిరాక్రందు నుక్కడంపఁదగున్.947

క. తొలికొలి దూష్యామిత్రులు, దలపడి నీల్గుటయు నతఁడు దనజయమునకున్
బలి నమ్మియుండ నొక్కటఁ, జలమునఁ బైఁబోవవలయు సత్త్వాధికుఁడై.

క. విడిపలయు నిజపురంబును
గడిపల్లెలు సస్యగోనికాయాదులు దా
పడిఁ బొడిచి కలఁచి కలఁగెడు
నెడపున నేపడరఁ బొడుచు నెంతయు నొప్పున్. 949

క. బలుబలము గొంచు వేతొక
నెలపున నిడి యడఁగియుండ నిజశిబిరముపై
బలిఁ బొడిచి తిరిగి యరిగెడు
బలముపయిం బోదువవలయుఁ బటుసింహగతిన్. 950

ఆ.వె. విమతు లెల్లప్రొద్దు వేఁటలాడెడువానిఁ, దొడరి యట్టిచోన త్రుంపవలయుఁ
బసులఁబట్టి యరుగఁ బఱతెంచు నాదటఁ, ద్రోవగట్టియైనఁ ద్రుంపవలయు. 951

మ. సమరస్కందభయంబు పెక్కువ నిశన్ సంజాగరశ్రాంతిమైఁ
గమియ న్నిద్రకు నాససేయుఁ బవ లుగ్రస్ఫూర్తిమైఁ దాఁకియున్
అమరంగాఁ బగ లాయితం బయినచో నామాపు పైఁ జాఁటియున్
గ్రమసంసుప్తబలంబు రాత్రిమెయి స్రుక్కం దాఁకి కూల్పందగున్. 952

మ. వరశస్త్రాణమదానివారణమహాస్తంబేరమశ్రేణిచే
ఛురికాత్యుగ్రజనప్రవీరసుభటస్యూతంబుచే నొండె న
చ్చెరువంద న్నడురేయి హస్తికరణశ్రీ లీలమైఁ జొచ్చి భీ
కరభంగిం బరిమార్పఁగావలయుఁ దత్కల్పాంతకక్రీడలన్. 953

క. ప్రాలేయతిమిరగోగణ, శైలవనశ్వభ్రతావిశాలనదీజం
బాలచ్ఛిద్రములన్నియుఁ, బోలఁగ సత్రములయెడలు పోరులచోటుల్. 954

ఆ.వె. అప్రమత్తుఁ డగుచు నహితుల నెబ్బంగిఁ
దా జయింపవలయుఁ దద్విధమున
నరులు దన్ను నోర్తు ననుశంక మెయిఁ దప్పి
చార మరయవలయుఁ జరులవలన. 955

ఉ. ఒక్కట గూటయుద్ధమున నుక్కఱ శత్రు వధించినన్ జయం
బెక్కుడు గల్గి పాప మొకయించుక పొందదు నిశ్చయంబు పే
రెక్కిన ద్రోణసూనుఁ డుఱ కొక్కయెడ న్నడురేయి నిద్రమైఁ
జొక్కినపాండునందనులఁ జూచి వధింపఁడె సౌప్తికక్రియన్. 956

—కామందకము

## కార్యత్వరితనీతులు

క. ఆద్యావస్థనె నృపతులు, ఛేద్యులఁ జెఱుచునది తడవు సేయుటయు నఖ
చ్ఛేద్యము ముదిరి కుఠార, చ్ఛేద్యం బగు నండ్రు నీతిసిద్ధాంతవిదుల్. 957

—బద్దెనీతి

క. ధీయుతులమాట లప్పుడ, సేయక మోహమునఁ దడవు సేయునతఁడు దా
నాయెడ దా శేరకుగతి, వేయును జెప్పంగ నేల వేగమె పొలియున్. 958

—పంచతంత్రి

క. డెందమునఁ దెలిసియును జే, యం దెంపరి గాకయుండునాతనితలపో
తం దీరునె యవకార్యము, మం దెఱిఁగినమాత్ర తెవులు మానుట గలదే. 959

—నీతిభూషణము

క. పదను దొరకొనుడుఁ జెచ్చెర, వదలక వెదబెట్టుహాలికవర్గముకరణిన్
బదను దొరకొనుడుఁ జెచ్చెర, వదలక కార్యంబు దీర్పవలయుం బతికిన్.960

—బద్దెనీతి

క. స్వపరహితకార్యకర్మము, నిపుణుండై వేగ చేయ నేరకయున్నన్
విపరీతస్థితికాలము, కుపితంబై తత్ఫలంబు కొనిచనుఁ బిదపన్. 961

—చాటువు

## అధికాధముల సయోధ్యప్రకారము

ఉ. గండతలంబులం బెలుచఁ గ్రమ్ములసన్మదవారికై యళుల్
పిం డదుదెంచి యంటి కడుఁ బ్రేమబలాయతమూర్తు లయ్యు పే
దందవిభు ల్సహించి తమదర్పము సూపక చూచినట్ల హీ
నుం డగువాని కల్గునె ఘనుండు దలంప ధరాతలంబునన్. 962

క. కులగిరులు పెఱుకు సత్త్వము
గలపురుషుఁడు తృణముఁ బెఱుకఁగడఁగునె మదిలోఁ
దలపోయ నట్లపోలెను బలహీనున
కరుగఁ జొరఁడు ప్రబలుం డెపుడున్. 963

ఆ.వె. అరుల బలుని సబలుఁ డనిలోన నలిగినఁ, జేట కాని యొకటిఁ జేయలేఁడు
సనసగింజ పెటిలి చనుఁగాక మంగలం, బవియఁ జేయఁగలదె యరయ నెందు.

గీ. వరలు మైత్రివివాహోత్సవమ్ము సేయ
సిరులు నెఱుకలు సమమైన పురుషు లెవ్వ
రరయ వారికిఁ దమలోన నమరుఁగాని
ఘనులకును నీచులకుఁ బొందు గలుగ దెందు. 965

గీ. కడియ నోరికి దశమైనకడియ కాని, పెగ్గలము గొన గ్రుడ్డులు పెలికి నుఱుకు
కాన యభియాతిజయకాముఁ డైనవాఁడు, చేత నయ్యెడుపని గాని చేయవలదు.

—పంచతంత్రి

ఆ.వె. ఎదిరివానిసత్త్వమెఱుఁగక పైఁబడి
సేయదగదు గాక చేసెనేని
నతఁడు గీడువొందు నల టిట్టిభముచేత
నబ్ధి గీడు నొందినట్లు వోలె. 967

## చోర నీతులు

క. ముచ్చిలుటయుఁ బాతకముగ
ముచ్చిలమియు ధర్మముగను మున్నుపదేశం
బిచ్చిరి పూర్వమునీంద్రులు
ముచ్చిలకుండునది యెరుల మొల్లములు జనుల్. 968

క. ధనమునకు బ్రాణమమ్ములు
ధనమునకేఁ బ్రాణమీగి దలఁపజనులకున్
ధనమది ప్రాణులప్రాణము
ధనహారిత ప్రాణహారితకుఁ దక్కువయే. 969

క. ప్రాణిదయఁ జేసి చోరుని
ప్రాణములకుఁ దెగని భూమిపతికాజ్ఞలచేఁ
ప్రాణులనేకులు విగత
ప్రాణులుగాఁ జూచునది కృపాభావమొకో. 970

క. ఖలునొకని జంపమియె సా
ధులఁ బలువురఁ జంపినట్లు దొరకొనినను గ్రో
ల్పులిఁ జంపకునికి చాలదె
చలమువ గోసమితి వేఱ చంపఁగ నేలా. 971

క. భూవరుఁడు కూర్మిగలిగినఁ
బ్రోవందగు జనవుగలిగి భూప్రజకహితో
ద్భావియగుమ్రుచ్చు గావం
గావచ్చిన వాని మ్రుచ్చుగాఁ దలఁపఁ దగున్. 972

## శత్రునపనమ్మికనీతులు

ఆ.వె. అబలుఁడైనఁ జిక్కఁడతి బలుచేతను
నెదిరి కెపుడు మర్మ మీని వాఁడు
మర్మమిచ్చెనేని మదియెంత బలవంతుఁ
డైనఁ జిక్కునొక్కయబలు చేత. 973

ఆ.వె. దేవగురుని బోలుధీమంతుఁడైనను
వేగ మొరుల వలదు విశ్వసింప
విమల యశము సుఖము విత్తంబు వృద్ధియు
వర్ణనీయ జయము వడయువాఁడు. 974

క. అమరులకైననువిశ్వా
సము వెలిగాఁ జెఱుపరాదు శత్రులవిశ్వా
సమునకాదే దితిగ
ర్భము శక్రుఁడు సొచ్చివ్రచ్చి పాఱఁగవైచెన్. 975

ఆ.వె. పగతుఁడైన నపుడు భయమందియింటికి
నేఁగుదెంచునప్పుడెవ్వఁ డతనిఁ
జులుకఁ జంపఁజూచు నొలవక తత్పాత
కంబు బ్రహ్మఘాతుకంబు సమము. 976

క. పలుకులు తేనియతేటలు
దలపడి ముసు చేసికొనుమతంబునశత్రున్
జలము గొని చెఱుపఁగడుఁదగు
నలసితిమిది మిగుల కఠినమనక నయాఢ్యున్. 977

క. తనకార్యంబగునంతకు
గొనగొని తాఁగానియట్ల కూడి మతిం గీ
డొనరింపవలయుఁబరునికి
పనపునఁ జతురకుఁడువోవె వలనేర్పడఁగన్. 978

ఆ.వె. నయము మీఱవాక్కు నవనీత సదృశంబు
మానసంబు ఆసమంబు చేసి
కొని చరింపవలయునయంబు దనశత్రు
కులమడంచు నంతకును నెఱింగి. 979

క. నమ్మకచేసిననైనను
నమ్మంగావలవ దహితు నయమార్గజ్ఞుల్
నమ్మించెననుచు వృత్రుఁడు
నమ్మిక దాఁబోలిసె నాకనాయకుచేతన్. 980

ఆ.వె. దేవగురుని బోలు ధీమంతుఁడైనను
నమ్మవలవ దహితు నమ్మవల
దతులయశము మిగుల నాయువువృద్ధియు
భూరిసౌఖ్యములను గోరువారు. 981

క. అలఁతియగు తెఱపిగనినను
వలవడ భేదించి చొచ్చునల్లన పిదపన్

జెలువుగని చెఱుచుశత్రుఁడు
పొలుపగు వృక్షమును వారిపూరముపోలెన్. 982

క. గురుమత మెవ్వరి నమ్మమి
పరమాప్తులగూడి సేత భార్గవుమత మి
ద్ధర విష్ణుశర్మమతమిది
గురుదిరమతి సేనదీర్చుకొని యరిఁదగులన్. * 983

క. మునుమున్న ప్రీతి తోడన్
జని లోపలఁ జొచ్చి పిదప సకలంబునుఁజే
కొనుదాన శత్రుఁ డల్లన
చనుబో జారాంగనలకు జారుఁడు పోలెన్. 984

ఆ వె. ఎదిరి వాని కులము హృదయంబు బలమును
ముట్ట నెఱిగి కొనక మున్న మున్న
చెలిమి సేయఁ జనదు చేసిననొప్పదీ
పలుకు దేవగురుని పలుకు సుమ్ము. 985

గీ. జగతిలోపల వేదపారగుల చేత
బ్రహ్మహత్యాది దుస్తరపాపములకుఁ
దలఁచిచూడంగ నిష్కృతిఁ గలుగుగాని
వినుము నిష్కృతియనఁ గృతఘ్నునికి లేదు. 986

క. విను మెవ్వఁడేని తనుని
చ్చిన వానికిఁ బిదపఁగీడు నేయునతఁడు స
చ్చినయప్పు డతని మాంసము
గని కాకము నైనరోయుఁ గబళింపంగన్. 987

ఆ వె. యానపానభోజనాసనశయనంబు
లందు రంధ్ర మొక్కటైన ఁదెలియఁ
గనిననైనఁ జొచ్చికడతేర్చు నదిగాన
వైరియొద్దివాని వలదు నమ్మ. 988

క. ఖలుసంగతి గూడిన ని
ర్మల చిత్తుండైనఁ జేయుఁ బ్రతికూలుండై
యలనూనియ కర్పూరము
గలసిన విషమైనయట్లు కందామాత్యా. 989

—నీతితారావళి

క. విడిచుంనిమివైపఁ దన కగ
పమునంతకు శత్రునెడగపటఁ భక్తిదగున్
కడుగదె నదీప్రవాహము
వడిద్రిప్పగ వలసి యంఘ్రిపముపాదంబుల్. 990

—అజ్ఞాతము

## ఆశ్వాసాంతము

క. పంచేషుజనకరిపుగజ
పంచాననపాంచజన్యభాసితహస్తా
పంచానన నారీముఖ
సంచితవాగ్విజితపాదసరసిజయుగళా. 991

క. మురళీఘననాదామృత
తరళీకృత యోగిహృదయతామరస మహత్
ఖురళీమల్లవిమర్దన
విరళీకృతజననమరణ విశ్వాతీతా. 992

మాలిని. స్ఫురదురుశుభకీర్తి ! భూరి విజ్ఞానమూర్తీ
గురుతరగుణశీలా ! గోపికాచిత్తలోలా
సరసిజదళనేత్ర ! సత్యభామాకళత్రా
విరళితభవపాశా ! విశ్వలోకప్రకాశా. 993

గద్యము : ఇది శ్రీ నరసింహవరప్రసాదలబ్ధకవితావిచిత్ర భారద్వాజగోత్ర పవిత్రాయ్యలామాత్య పుత్ర సరసగుణధుర్య సింగనార్య ప్రణీతంబైన సకలనీతి సమ్మతం బను రాజనీతిశాస్త్రంబందు రాజుల కవశ్యకర్తవ్యంబగు సంధి

విగ్రహయానాసనసమాశ్రయ ద్వైధీభావంబు లను రాజషాడ్గుణ్యంబులును, మంత్రిరక్షణకార్యాకార్యవిధంబును, మిత్రామిత్రవివేకంబును, నుపాయ వికల్పంబును, దండయాత్రావిధంబును, జతురంగబలప్రకారంబును, ప్రయాణ ప్రయత్నంబును, దత్తచ్ఛకుననిశ్చయంబును, యుద్ధదానవివరణంబును, నీతిస్కంధమూలప్రకారంబును, ప్రత్యర్థిరాజబలాబలచింతనంబును, నుభయ బలవ్యూహరచనచాతుర్యంబును, గరికోట చతురంగాయోధన నిశ్చ యంబును. గార్యత్వరితక్రమంబును, అధికాధములసయోధ్యావిధంబును, జోరనీతిప్రకారంబును, నవిశ్వాసిపరిశీలనప్రకారంబు నన్నది

తృతీయాశ్వాసము.

## 1. సకలనీతిసమ్మతమునుండి

## ఇతరకవు లుదాహరించిన పద్యములు.

(1) 22 ఉ. ఆకులవృత్తి రాఘవు శరాగ్రమునందుఁ దృణాగ్రలగ్ననీ
రాకృతి వార్ధియింకుట దశాస్యునిఁజంపుట మిథ్యగాదె వా
ల్మీకులు సెప్పకున్న కృతిలేని నరేశ్వరు వర్తనంబు ర
త్నాకరవేష్టితావని వినంబడ దాతఁడు మేరు వెత్తినన్.

—నీతిభూషణము

ఈ పద్యమును కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున భైరవుని శ్రీరంగమాహాత్మ్యములోనిదిగా నుదాహరించినాడు. (చూ. పుట 49) కాని యిది నీతిభూషణములోని దని యిపుడు స్పష్టమైనది.

(2) 150 శా. ఉత్సాహప్రభు మంత్రశక్తులనజేయుండై పరిక్షీణసం
ధిత్సావ్యగ్రుఁడుగాక విగ్రహముతోఁదేశంబుఁ గాలంబు సం
పత్సామగ్ర్యముఁజూచి కార్యముదెసన్ ప్రారంభియై భూప్రజన్
వాత్సల్యార్ద్రమనస్కుఁడై నపతి శశ్వచ్ఛ్రీసమేతుండగున్.

—నీతిభూషణము

ఈ పద్యము ప్రబంధరత్నావళిలో తిక్కన విజయసేనములోనిదిగా నుదాహరింపబడినది (ప. 154). ఇందు రెండుచోట్ల పాఠభేదములుగలవు-

| స. స. | ప్ర. ర. |
|---|---|
| పరిక్షీణసంధిత్సా | పరీక్షించినన్ దిత్సా |
| శక్యముదెసన్ | కార్యముదెసన్. |

(3) 339 శా. నానాశాస్త్రవిచక్షణుండు నయనానందాంగుఁడున్ సత్కుల
స్థానశ్రేష్ఠుఁడు నిస్పృహుండు పరచిత్తజ్ఞుండు వాక్సిద్ధుడున్
శ్రీనిత్యుండును లోకమాన్యుఁడగు నిశ్చింతుండునై యుండినన్
వానిన్మానుగ రాజదూతయని తల్పన్వచ్చు సుర్వీస్థలిన్.

—పంచతంత్రి

ఇది ప్రబంధరత్నావళిలో (ప. 303) బద్దెభూపాలుని నీతిసారము లోనిదిగా నుదాహరింపబడినది.[1] కాని యిది పంచతంత్రిలోనిది.

పాఠభేదములు

| స. స. | ప్ర. ర. |
|---|---|
| విచక్షణుండు | విశారదుండు |
| వాక్సిద్ధుఁడు | వాక్చుద్ధుఁడు |
| తల్పన్వచ్చు. | చెప్పన్వచ్చు. |

(4) 485. క. పతిచీరలట్టి చీరలు
పతితొడవులబోలు తొడవు పతిగతివేష
స్థితియును సేవకులకుఁ దగ
దతిధనయుతులైన నసుఁగులైనన్ ధరలోన్.

—నీతిసారము

ఇది ప్ర.ర.లో నీతిసారములోని పద్యముగా నుదాహరింపబడినదిఁ (305ప).

(5) 307 సీ. ఊరకమురియక యుబ్బసంబందక
వెఱవక దేహంబు విఱిచికొనక
నిడుసునఁబెట్టక నిప్పోటమునఁబోక
తరవాయి దప్పక తడవి కొనక
యక్షరస్పష్టతయన గీతినష్టత
గాకుండనర్థంబు గానఁబడఁగ
నష్టైరసంబుల కనురూపముగఁబెక్కు
రాగముల్ ఫణితులు బాగుపట్ట

గీ. చెఱకు కొననుండినమలిన చెలువు దోఁప
నంతకంతకు వేడుక లతిశయిల్లఁ

1. ప్రబంధరత్నావళి సంపాదకులగు కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు పుట 189లో "ఈ నీతిసారము బద్దెభూపాలునిదిగా ముద్రించుట పొరపాటు" అని వ్రాసియున్నారు. కావున కర్తృత్వము సరికాదు.

జదువుచున్నారు వీరల చదువుఁబోలఁ
జదువు లేదని పొగిడిరి సభికవరులు.

—పురుషార్థసారము.

ప్రబంధరత్నావళిలో నిది 376వ పద్యము. జైతరాజుముమ్మయ విష్ణుకథానిధానములోనిదిగా నుదాహృతము.

పాఠభేదములు

| స. స. | ప్ర. ర. |
|---|---|
| నిడుసునఁబెట్టక నిద్రోటమునఁబోక యనగీత | నిడుచన పెట్టకనిద్దొట.... యతిగీత |
| చెఱకు కొననుండి నపలిన చెలువుదోప, | చెఱకు కొనను.... వుదోఁప |

(6) 306 చ. వెనుకకుఁబోక హా యనక వేసటఁనొందక పంక్తిపంక్తికిన్
బెనుపక కానమిన్ బ్రసుసి బెగ్గిలకెంతయు మున్నుచూచుచున్
గనుగొని యక్షరాక్షరము కందువుదప్పక యేకచిత్తుఁడై
యనుపమభక్తితోఁ జదువునాతని వాచకుఁడండ్రు భూవరా.

—పురుషార్థసారము

ప్ర. ర. లో నిది 399వ పద్యము. పై విష్ణుకథానిధానము లోనిదిగా నుదాహృతము. పాఠభేదములు—స్పష్టము.

(7) ప్రబంధరత్నావళిలో నింకను నీ క్రిందిపద్యములు సకలనీతిసమ్మతము నుండి యుదాహరింపబడినవి.

పంచతంత్రము

| స. స. | ప్ర. ర. |
|---|---|
| 435. చెలువుగ | 519. చెలువుగ. |
| 437. అన్యదేశమెల్ల | 518. అన్యదేశమెల్ల |

438 మానుగఁబతి
470. బలుకొఁడువోలె

521. మానుగఁబతి
520. బలుకొఁడువోలె

కామందకము

382. అరుణుండు కిరణముల

517. అరుణుండు కిరణముల

(8) 60. సీ. బలుగాఁపు వాకిళ్లఁబగలు రేయును నిడి
కోటపాళెము తగు చోటఁబెట్టి
కనుమపట్లను నెల్లఁగావలి నియమించి
నడిమి చావడిఁ దగునరుల నునిచి
నగరి చుట్టును బారి నడిపించి క్రంతలఁ
దిరుగు చుండఁగఁ దలవరులఁ బనిచి
దినచర్య బాలెముల్ దృష్టివెట్టుచు రేలు
దివియలు విడువక తిరుగఁజేసి

ఆ. వె. దొరలరాజులందు నరయుచు భటులందు
భేద మొదవకుండ నాదరించి
యుచితవృత్తిఁగావకుండిన దుర్గంబు
నేలఁగలఁడె భూమి నింద్రుఁడైన.

—నీతిసారము

ప్ర. ర. లోనిది 306 వ పద్యముగానున్నది. ఇది నీతిసారములోనిదే కాని పాఠభేదము లున్నవి—

| స.స | ప్ర.ర. |
|---|---|
| కనుమపట్లను నెల్ల | కనుమట్ల నెల్ల (?) |
| బారినడిపించి | బాలెనడిపించి |
| దినచర్య | దిన (?)....ర్య |

(9) 512. సీ. ఒనరఁ గపాలంబు నుపహారసంధియు
సంతానసంధియు సంగతంబుఁ
జాల నుపన్యాససంధియుఁ బ్రతికార
సంధియు సంయోగసంధికంబుఁ

బురుషాంతరాదృష్టనరనామకమ్ములు
నాదిష్టకంబు నాత్మామిషంబు
పరిక్రయవిగ్రహబంధురోపగ్రహ
సంధులు సుచ్ఛిన్నసంధికంబు

ఆ. వె. ననుపమపరదూషణాంచిత స్కంధోప
సేయసంధు లనఁగ నిశ్చితముగ
షోడశప్రకార సునిశిత సంధివి
ధాన మెఱుఁగ వలయు ధరణిపునకు.

—పంచతంత్రి

ప్ర. ర. లోనిది 302 వ పద్యము. పోలమరాజు (పర్వతపురాణము) నుండి గ్రహింపబడినది. కాని యిది పంచతంత్రిలోనిది.

పాఠభేదములు

| స. స. | పు. ర. |
|---|---|
| జాలనుపన్యాస సంధియుఁ బ్రతికార | జాల నుపన్యాససంధియు |
| సంధియు సంయోగసంధికమును | ....సంధియు యోగసంధికమును |
| పురుషాంతరాదృష్ట | పుష్పాంతరాదృష్టపురుష |
| నరనామకంబులు | నామకములు. |

ప్రబంధరత్నావళిలో పైని చూపబడిన పద్యములన్నియు సకలనీతి సమ్మతమునుండి గ్రహింపబడినవేయని నిశ్చయముగా చెప్పవచ్చును. ఏలననగా, కామందక, పంచతంత్ర, పురుషార్థసార, నీతిసారములనుండి సింగన యుదాహరించిన పద్యములే యిందున్నవి గాని వానినుండి క్రొత్త పద్యమొకటైన లేదు. ప్రబంధ రత్నావళి సంకలన కర్తలు – పెదపాటి జగ్గన – ఉదాహరణ పద్యకర్త– సకలనీతిసమ్మతమునుండి వీనిని గ్రహించినట్లు విశదమగు చున్నది. ఇదియు సకలనీతిసమ్మతము ప్రాశస్త్యము వెల్లడించు చున్నది.

## 2. గ్రంథ సంఖ్యా సూచిక

| | | |
|---|---|---|
| అజ్ఞాతము | 92, 93, 94, 95, 96, 317, 72, 406, 07, 08, 09, 410, 572, 89, 90, 91, 92, 93, 94, 95, 96, 97, 598, 99, 600, 01, 25, 26, 27, 28, 59, 60, 69, 88, 92, 93, 735, 66, 67, 813, 29, 30, 31, 32, 44, 45, 989.... | 47 |
| కామందకము | 44-46, 54, 55, 63-66, 68-75, 132-33, 147, 152-58, 186, 201, 234-39, 254-56, 258, 260-71, 273-88, 323, 334-36, 338, 340, 347-53, 355-66, 373-74, 378-83, 385, 388-91, 478, 514-64, 567-71, 573-76, 586-88, 602-11, 616-24, 632-38, 661-68, 670-83, 702-11, 729, 738, 769-70, 793-94, 798-99, 807-12, 814, 821, 826, 828, 834, 846-50, 853-64, 867-82, 886-93, 921, 940-56.... | 310 |
| కుమారసంభవము | 184, 644 .... .... .... | 2 |
| కేయూరబాహుచరిత్ర | 504, 736 .... .... .... | 2 |
| చాటువు | 191, 92, 243, 304, 05, 401, 66, 756, 57, 58, 59, 60, 61, 819, 961 .... .... | 15 |
| చారుచర్య | 259 | 1 |
| ధృతరాష్ట్రనీతి | 169, 98, 404, 87, 88, 89, 777, 78 | 8 |
| ధౌమ్యనీతి | 79, 480, 481, 482, 483, 486, | 6 |
| నీతి తారావళి | 23, 24, 25, 26, 27, 28, 30, 41, 85, 411, 791, 989, .... .... .... .... | 12 |
| నీతిభూషణము | 20, 21, 22, 31, 32, 77, 103, 24, 40, 48, 49, 150, 90, 227, 439, 61, 62, 503, 751, 74, 75, 76, 90, 895, 959. | 25 |

| | | |
|---|---|---|
| బద్దెననీతి | 78, 90, 99, 104–05, 108–10, 113–14, 128–131, 172–74, 176, 228, 230, 231, 405, 413–15, 420–21, 446–48, 496, 499, 501, 691, 695, 772–73, 957, 960, .... .... | 39 |
| భీష్మపర్వము. | 97 .... .... .... | 1 |
| పదీయము | 1–19,29,76,160,96.229,89,90,91,95,96,97,98,99, 303,44,639–42,684,85,86,87,935–38,991–93.... | **48** |
| మార్కండేయము | 188, 933, 934. ... .... | 3 |
| మిత్రనీతులు | 737 .... ... ... | 1 |
| ముద్రామాత్యము | 36, 37, 39, 40, 42, 146, 70, 202, 320, 21, 22, 345, 54, 95, 96, 97, 98, 99, 422, 629, 30, 631, 94, 701, 713, 14, 15, 16, 17, 31, 85, 800, 852, 65, 96, 97, 918, 922, 929. .... | **41** |
| విదురనీతి | 199, 369, 70, 450, 51, 712 33, 34. .... | 8 |
| శాంతిపర్వము | 843, 923. .... .... .... | 2 |
| శాలిహోత్రము | 827. .... ... .... .... | 1 |
| శ్రీగిరిశతకము | 240,241. .... .... .... | 2 |
| శ్రీరామాయణము | 806. .... ... .... | • |
| సభాపర్వము. | 56, 67, 168, 205, 06, 07, 24, 25, 26, 318, 324, 25, 27, 28, 71, 400, 12, 26, 27, 28, 29, 689, 90. | 24 |
| సౌప్తికపర్వము | | 2 |
| | | 993 |

## 3. మడికిసింగనకాలము

వాఙ్మయచరిత్రవిషయమున, కవికాలనిర్ణయసందర్భమున, నొకరు వ్రాసినది మఱియొకరు విచక్షణలేకుండా గ్రహించుటవలన నెట్టియనర్థములు వచ్చుచున్నవో ఈ మడికిసింగన చరిత్రవిషయమున పై గ్రంథము (సమగ్ర ఆంధ్రసాహిత్యము) నుండి యుదాహరించుచున్నాను—

4వ సంపుటము 76వ పుటలో 'ఆకరయుగానల' అన్న పద్యము నుదాహరించి, 76–78, పుటలలో దీనినిగుఱించిగ్రంథకర్తలు చర్చించినారు. 77వ పుటలో "ఈ పద్యం అన్నిప్రతులలోనూ లేదు. కనుక నమ్మదగ్గది కాదు అని వేదం వెంకటరాయశాస్త్రిగారు చెప్తున్నారు"...అనివ్రాసి మడికిసింగన కాలమును పై పద్యమును బట్టి క్రీ.శ. 1420 ప్రాంతమని నిర్ణయించిన ఆంధ్రకవితరంగిణీ కారుల అభిప్రాయమును విమర్శించుచూ, తుదకిట్లు నిర్ణయించారు.– "ఆకర యుగానల' పద్యాన్ని నమ్మితే ఈ బెడదతప్పదు. అందుచేత వేదం వెంకటరాయ శాస్త్రిగారు చేసిన కాలనిర్ణయమే గ్రాహ్యం" అనివ్రాసిరి.

వెంకటరాయశాస్త్రిగారు చేసిన కాలనిర్ణయము అనగా క్రీ. శ. 1347 మడికిసింగన కాలమనికదా ఈ గ్రంథకర్తల ఆశయము. వేంకటరాయశాస్త్రి గారి మాటలను నమ్మి మద్రాసు ప్రభుత్వప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో, భాషోద్ధారకులైన బ్రౌను దొరగారు అయిదు తాళపత్రప్రతులు సంప్రతించి, జూలూరి అప్పయ పండితులచే పరిష్కరింపజేసిన ప్రామాణికప్రతినిగూడ ఈగ్రంథకర్తలు నమ్మరన్నమాట. ఆయితే ఈగ్రంథకర్తలే ఆ ప్రతిని 'ఒకతీర్పు ప్రతి' అని ఆ ప్రతిలో పీఠికలోని రమారమి ఒకపుటపరిమిత భాగమును, ఎట్లు తమ గ్రంథములో (63,64 పుటలు) నుదాహరించిరో దురూహ్యము.

ఇంతేకాదు మడికి సింగన కాలము క్రీ. శ. 1347 అయినప్పుడు సకలనీతి సమ్మతములో నుదాహరింపబడిన కవులంతకు ముందువారు కావల యునుగదా ? అసలు గ్రంథకర్త సింగనయే ఆ కాలము వాడైనప్పుడు ఆతడు ఎఱ్ఱన, నాచనసోమనలతో సమకాలికుడగును. గ్రంథకర్త ప్రణాళిక ననుసరించి, సింగన చరిత్ర మూడవ సంపుటములోనుండవలెను. అట్లుగాక, ఇది నాలుగవ సంపుటము శ్రీ నాథసమకాలికకవులలోనున్నది; దీనికి సమన్వయ మెట్లు ?

సింగన తనకృతిలో 'శాలిహోత్రము' నుండియొక పద్యమునుదాహరించినాడు. శాలిహోత్రమనగా అశ్వశాస్త్రము; మనుమంచిభట్టు రచించినది. కాబట్టి శాలిహోత్రకర్త మనుమంచిభట్టు క్రీ. శ. 1347 ప్రాంతమునకు ముందువాడు కావలయునుగదా! అతడు మూడవ సంపుటములో ముందుండవలెను. ఇట్టి సందర్భములో గ్రంథకర్తలు మనుమంచిభట్టును గూర్చి 4, 5, 6 సంపుటములలోకూడ విడిచిపెట్టి. క్రీ. శ. 1500 తో ప్రారంభమైన, మలిరాయల యుగ సంపుటము ఏడవ దానిలో చేర్చుట యన్నింటికన్న అసంగతము, ఆ సంపుటాలలోని కవికాలక్రమములు తప్పినవి. ఈ అవ్యవస్థ అంతయు వెంకటరాయశాస్త్రిగారి వచన నమ్మినందువలన వచ్చినది.

## 4.నీతితారావళి — కందనామాత్యుడు

ముందు నేను చూపినట్లుగా, నితితారావళి సింగన రచితమై, కందనమంత్రికంకితము చేయబడినది. వాస్తవికస్థితి యిట్లుండగా, "సమగ్ర ఆంధ్రసాహిత్యం" నాలుగవ సంపుటంలో కందనామాత్యుడు కవిగా పరిగణితుడైనాడు. నీతితారావళి కందనమంత్రి కృతియే అని అందు నిరూపితమైనది. ప్రస్తుత మీ పీఠిక గ్రంథస్థవిషయవివేచనమునకే గాని విమర్శనమునకు గాదు. అయినను, ఇది ప్రాచీనవాఙ్మయమునకు సంబంధించినది యగుటచేతను, వ్రాసిన విషయమంతయు నసంబద్ధము నసంగతమునగుటచేతను, విమర్శింపక తప్పలేదు.

పుట 48లో "కందనామాత్యుడు కేవలం కృతిపతేకాక కృతికర్త.... కందనామాత్యుడు నీతితారావళి అనేకృతి రచించాడు. ఇందులోని 12 పద్యాలను మడికి సింగన తాను సంకలనంచేసిన సకలనీతిసమ్మతములో చేర్చుకొన్నాడు". ఈ వాక్యములనుబట్టి గ్రంథకర్త నీతితారావళికర్త కందనమంత్రి యని నిశ్చయించినట్లుస్పష్టము. ఇది గ్రంథకర్త 50వ పుటలోవ్రాసిన యీ క్రింది విషయమువలన పూర్తిగా పరాస్తమగుచున్నది.

"తనకాలంలోఉండే కావ్యదోషాలేమేమిటో కందనమంత్రికి బాగా తెలుసు.

1. సమగ్రఆంధ్రసాహిత్యం—ఆరుద్ర—నాలుగవ సంపుటం—సంఖ్య 6. పుటలు 46–52.

సీ. గ్రామ్యంబు దుస్సంధి కాకువిరోధోక్తి
పొల్లు సంక్లిష్టంబు జల్లిపొడవు
వ్యర్థబంధంబు నిరర్థంబు పునరుక్తి
దోషం బలంకారదూషణంబు
రసవిరుద్ధము క్రియారాహిత్య మస్పష్ట
భావంబు గణయతిభంగశబ్ద
భంగంబు లెఱుఁగక సంగతంబుగ పట్టి
మాటలు పురికొల్పి మచ్చరమునఁ

గీ. బెనిచిపడ్డను బెరుపును బిసికినట్లు
కెలను నవ్వంగ బిలిబిలికృతులుసెప్పి
వాదు లడువంగ బరతెంచువారు కవులె
గోపికాజాల సుఖలోల గోపబాల (స. స. 26)

ఇందులో చివరపాదం ఒకశతకంలో మకుటంలాగ కనబడు తున్నది. కొన్నిపద్యాలు దేవుణ్ణి సంబోధిస్తూ కొన్నిపద్యాలలో తనను తాను సంబోధించుకొంటూ కందనమంత్రి నీతితారావళి చెప్పాడు".

పై వాక్యములవలన "గోవబాల" మకుటముతోదేవుణ్ణి సంబోధిస్తూ కందనమంత్రి పద్యములు రచించినట్లు గ్రంథకర్త చెప్పుచున్నాడు. అయితే సకలనీతిసమ్మతములోనే పైనుదాహరించిన పద్యముతరువాత 29వ పద్యములోనే

సీ. సుందరీ నఖముఖ................
..............................
..........,....................
..............................
..............................
..............................
..............................
కుతిలపడకేల సైరించు గోపబాల —మదీయము

అన్నపద్యమున్నది.

ఇచ్చట గోపబాల మకుటముతోపద్యము స్పష్టముగా "మదీయము" అనియున్నది-అనగా ఇది సింగనరచన యన్నమాట. సింగన తన సొంతరచనలను "మదీయము" అని యుదాహరించుకొన్నట్లు గ్రంథకర్తలే 57వ పుటలో నిట్లు నిర్ణయించినారు-

"ఇందులో 'మ దీ య ం' అని కవి గ్రంథమధ్యలో వ్రాసినవి 39 పద్యాలుమాత్రమే".

దీనినిబట్టి 'గోపబాల' అనుమకుటముగలరచన సింగనదేగాని, కందనది కాదు.

ఇక "కొన్నిపద్యాలలో తననుతాను సంబోధించుకుంటూ కందనమంత్రి చెప్పాడు" అన్నదికూడా అప్రమాణికమే ! చూడండి-.

295 సీ. ఆయవ్యయంబుల............

..............................

..............................

..............................

..............................

..............................

..............................

..............................

ఆ.వె. ...కరణికంబు ధాత్రిఁగందమంత్రి. చివరిపాదము

296 గీ. వ్రాయఁడేని మఱచె..........

....కందమంత్రి. ,,

297 సీ. సరులుగ్రుచ్చినయట్లు....

గీ. మంత్రిమందారయబ్బయ కందమంత్రి. ,,

298 గీ. పదియంకనంబును......

...కందమంత్రి. ,,

299 గీ. దొరలు ప్రజలు....

....మంత్రికంద — చివరిపాదము "మదీయము"

కందమంత్రి సంబోధనలున్న పై అయిదుపద్యములు, "మదీయము" అని స్పష్టముగా అచ్చులోనున్నది ఇంకాచూడండి—

344 ఉ. మేధయు వాక్పటుత్వమును...... — మదీయము

"మదీయము" అనగా సింగనరచనలని గ్రంథకర్తల యభిప్రాయము గదా ! అప్పుడు పై పద్యములు కందమంత్రి రచితములా ?

ఇంతేకాదు.

401 సీ. సత్కులుఁడౌదార్యసంపన్నుఁడు......

గీ. ఘనకళాభోజ యబ్బయకందరాజ — చాటువు

819 సీ. కరిరథభటఘోటక....

ఘనకళాభోజ యబ్బయకందరాజ — చాటువు

పై రెండును కందమంత్రి సంబోధనలున్నను "చాటువు" అని యున్నది; ఇవి కందమంత్రివే అయినయెడల సింగన "చాటువు" అని చెప్పనేల? ఇవి సింగన కృతములే.

వీనియన్నింటికన్న మించిన స్వసంబోధన- తన్నుతాను సంబోధించుకొనుట-యనగా, ఆత్మ సంబోధనగదా ! అప్పుడెవ్వడైన 'నేను ఫలాని వారి కుమారుడనని' తనంతటతాను సంబోధన చేసికొనునా ?

ఔబళార్య కందన మంత్రీ
ఔబళకందా
ఔబళోత్తమ కందా
అబ్బయమంత్రి కందా
అబ్బయ కంద
మనుజమందార అబ్బయమంత్రి కంద
ఘనకళాభోజయబ్బయ కందరాజ

తన్నుతానుసంబోధించుకొన్నప్పుడు తండ్రిప్రసక్తియేమి! ఇంతకంటె లోకవ్యవహార విరుద్ధమును హాస్యాస్పదమునగు విషయము మఱియొకటి యుండబోదు.[1]

గ్రంథకర్తలు సరిగా పరిశీలింపలేదు గాని నీతితారావళినుండి 12 పద్యములుగాక 17 పద్యములుదాహరింప బడినవి.

గ్రంథప్రారంభమున 22వ పద్యము నీతిభూషణము తరువాత 23. అమలమగు, 24.అమరంగ, 25.బహ్వర్థ, 26.గ్రామ్యంబు, 27.తెలుఁగని చెప్పి, 28 పలుకులుగొన్ని-అన్నియు కందనవే. 28 పద్యముక్రింద 'నీతితారావళి' అని కలదు; ఇది సింగనకృతమే కాబట్టి పై పద్యములన్నియు సింగనవే. అందువలననే 27వ పద్యముక్రింద మదీయము అని ప్రత్యేకముగ లేమ. ఈ పద్యములలో కావ్యప్రశస్తి, కుకవి నిందగలవు. అనగా, సింగన తాను సొంతముగా కావ్యమంతయు రచింపకపోయినను, తాను గ్రహించిన కావ్య ప్రబంధము లన్నియు, నుత్తమ కావ్యములని కుకవికృతులను విడిచిపెట్టితినని యర్థమువచ్చునట్లు పై 6 పద్యములేగాదు తరువాత నీతిశాస్త్రప్రశంస అను శీర్షికవఱకు నున్న 4 పద్యములు సకలనీతిసమ్మతమునకుపోద్ఘాతమువంటివి. ఈ విషయమును గ్రహింపక గ్రంథకర్తలు వీనిని కందనమంత్రి కృతములుగా భావించుట పొరబాటు

గ్రంథకర్తలు కందనకృతముగా నిరూపించిన రెండు పద్యములను గూర్చి విమర్శింపవలసి యున్నది-

(1) క. అమరఁగ వేల్పులచేఁగ
బ్బము చెప్పియకాదె పరమువడసిరి మును జా
ణమయూరాదులు సత్కా-
వ్యముఁజెప్పినఁ బడయరాని వస్తువుగలదే.

ఈ పద్యము మొదట కవి జనాశ్రయములోనిదని నేనాగ్రంథమునకు పీఠిక వ్రాసినపుడు తెలిపితిని.[2] కాని యీ పద్యమునుగూర్చి గ్రంథకర్తలిట్లు

---

1. ఇట్టివి గ్రంథకర్తలకు క్రొత్తగాదు; పరిపాటియే- 1. దస్తగిరి (చేయుదు + అస్తగిరి.); 2.పుక్కగుజ్జు-"గుజ్జని"-దీనిని కుజ్జనిగా భావించుట; 3. "భీమ కుమార" భీమాంబ కుమారుడనుట; అసలు పదభేదము "దోర్బలభీమ ; కుమార మన్మథా" అని.

2. చూ. వావిళ్ళ ముద్రణము - 1950 పుట 3. ప. 9.

వ్రాసిరి— "ఇది యధాతథంగా కవిజానాశ్రయంలో సంజ్ఞాప్రకరణంలో ఒక పద్యంగా కనబడుతుంది..... కవిజానాశ్రయంలోనికి కందనామాత్యుని నీతి తారావళినుండే ఈ పద్యం వెళ్ళడానికి ఆస్కారముందని చెప్పాలి" ఇది ఎంతమాత్రమూ సరికాదు. కవిజనాశ్రయములో (సంజ్ఞాప్రకరణం కాదు) సంజ్ఞాధికారములో ఈ పద్యము 9వది. ముందువెనుక పద్యాలు కావ్యప్రశస్తిని తెలుపుచున్నవి (మూడుకులకము). ఇతర గ్రంథములనుండి తెచ్చిపెట్టినది కాదు.

క. అతిశయముగఁ జెప్పిన స
త్కృతి కవుల కుదాత్తఫలము కీర్తిగఁజేయున్
మతి నెఱుఁగక చెప్పిన దు
ష్కృత కవుల కుదాత్తఫలము కీర్తినిఁజెఱచున్. 8

క. అమరఁగ వేల్పులచేఁగ
బ్బము సెప్పియ కాదె వరముఁబడసిరి ముని బా
ణమయూరాదులు సత్కా
వ్యము సెప్పిన బడయరాని వస్తువుగలదే. 9

క. కమనీయ సమస్తకళా
గమములకును జన్మభూమి కావ్యము కావ్యా
గమవిదుఁడు సర్వవిదుఁడని
సమయచతుష్టయమునందుఁ జదివిరి మొదలన్. 10

సింగనయే యీపద్యము కవిజనాశ్రయమునుండి గ్రహించినాడు. కాని పేరుతెలుపలేదు. ప్రాచీన సాహిత్యమున నిట్టి సంఘటనలు క్రొత్తవికావు. 'బాలరసాలసాల' అన్నపద్యము పోతనదిగా అన్నిటియందుగలదు. కాని యది పోతనకు రెండుశతాబ్దులకు పూర్వుఁడగు మంచన కేయూరబాహుచరిత్ర ప్రథమాశ్వాసమునగలదు. శ్రీనాథుని హరవిలాసమున "ఎంచి నుతింప శక్యమె మహీశ్వరునంతటి వానికైన" అన్న పద్యము పిల్లలమఱ్ఱి పినవీరన యథాతథముగా శృంగారశాకుంతలమున నున్నది.

(2) సీ. "గ్రామ్యంబు దుస్సంధి" అను సీసపద్యము కుకవినిందకు సంబంధించినది. కందనవ్రాసినది నీతితారావళి అనికదా గ్రంథకర్తల యభిప్రా

యము అప్పుడు కుకవినిందయేల ? అది కావ్యమా ? సుకవిస్తుతి, కృత్యాది యున్నవా ? ఇది సింగనదే— పాల్కురికి సోమనారాధ్యుని పండితారాధ్యచరిత్ర లోని కుకవినింద కనుకరణము. (చూ. పూర్వకవియనుసరణలు).

పై విమర్శనను పరిశీలించిన, కందన కృతిపోషకుడేగాని కవియెంత మాత్రమూ కాడని ఢంకాగొట్టి చెప్పవచ్చును. ఇక ఈనాటి పరిశోధకులు, విచక్షణలేకుండ విషయములను, సాహిత్యచరిత్రలో గ్రహించుట పరిపాటి యైనది కాబట్టి యింత దీర్ఘముగ దీనిని విశదము చేయవలసి వచ్చినది.

— నిడుదవోలు వేంకటరావు

## పాఠభేదములు

ఈ సకలనీతిసమ్మతమునకు ఆకరము అమరచింత సంస్థానాదీశ్వరు లొసంగిన కాగితపు సంపుటమనియు, దీనికి నాదర్శాంతరము లభింపలేదనియు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రథమముద్రణము 'ఉపోద్ఘాతము' చివర పేర్కొనియున్నారు. బద్దెభూపాలుని నీతిశాస్త్రముక్తావళితో కూడిన ఈ కాగితపు సంపుటమున 146 పుటలున్నవి. నీతిశాస్త్రముక్తావళి, సకలనీతిసమ్మతము – ఈ రెండింటి గద్యపద్యసంఖ్యయు కలిపివేయబడినది. మొదటి 21 పుటలలో 150 గద్యపద్యములుగల భాగము బద్దెనరాజనీతి; 22వ పుటనుంచి 146వ పుట వరకుగల భాగము సకలనీతిసమ్మతము (150 నుంచి 1128 వరకు గల గద్య పద్యములు).

ఈ కాగితపు సంపుటము లేఖన వివరములిట్లున్నవి—

1. 12వ పుటలో—ప్లవ సం॥ర చైత్ర బ॥ ౧౦లు మూడు ఝాముల వరకు సమాప్తము.
   ౨౩ జిలహేజు సన్న ౧౩౧౮ హిజరి సన్న ౧౩౧౦ ఫసలి.

2. 21వ పుటలో—ప్లవ సం॥ర అధిక ఆషాఢ శు॥ ౯ మంగళవారం యామంవరకు సమాప్తము.
   సన్న ౧౩౧౦ ఫసలి చ ౭ రబ్బిలవ్వలు సన్న ౧౩౧౯ హిజరి.

3. 59వ పుటలో—ప్లవ సం॥ర నిజఆషాఢ బ॥ ౧౧ శనివారం సాయంత్రి వరకు సమాప్తము.
   సన్న ౧౩౧౦ ఫసలి చ ౨౪ రబ్బిస్సాని సన్న ౧౩౧౯ హిజరి.

4. 146వ పుటలో—ప్లవ సం॥ర ఆశ్వీజ బ॥ ౪ గురువారం రెండు ఝాములవరకు సమాప్తము.
   సన్న ౧౩౧౧ ఫసలి చ ౧౮ రజ్జబు సన్న ౧౩౧౯ హిజరి.

కాగా, ఈ కాగితపు సంపుటము క్రీ.శ. 1901 నాటిది. ఇందలి అక్షరములు ముద్దులొల్కుచున్నవి. కాని శ్రీకవిగారే పేర్కొన్నట్లుగా ఇది లేఖకదోష సహస్రపరిపూరితమగుటచేత దీని సంస్కరణమునకు శ్రీ కవిగారెంత శ్రమపడి

యుండిరో యూహించుట కష్టముకాజాలదు. ఈ మొత్తము సంపుటమును శ్రీ కవిగారు క్రీ. శ. 1956 ప్రాంతముల దయతో నాకొసంగిరి. ఇది నేటికి వినియోగపడినది. మిత్రులు శ్రీ మిరియాల రామకృష్ణగారి సాహాయ్యమున దీనిని, ముద్రితగ్రంథముతో సరిచూచి. విస్పష్టముగా కన్పట్టిన పాఠభేదము లను క్రింద పొందుపరచుచున్నాను. (ఈ కాగితపు సంపుటమిప్పుడు ఆంధ్ర ప్రదేశ్ ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున భద్రపరచబడినది).

| గద్యపద్యసంఖ్య | ముద్రితప్రతి | వ్రాతప్రతి |
|---|---|---|
| **ప్రథమాశ్వాసము :** | | |
| 7 | ఆంధ్ర | ఆంధ్ర |
| | ఊహించి | ఉచిత |
| 11 | తటాగ్రరత్న | తటాంచిద్రత్న |
| 17 | ప్రజాపాలనంబును | ప్రజాపాలన నియమంబును |
| 58 | జలావిక | జలాదిక |
| 66 | నందనృపాలుండు | నం నరనాథుండు |
| 67 | దగులక | దలగక |
| 73 | పరిఘ | పరిఘ |
| 74 | దరియనడుగుట | దరియనడుచుట |
| 76 | సారక్ష | సంరక్ష |
| 102 | పతికాకనీతితో | పతిగోరినీతితో |
| 113 | నన్నిచోడ నరేంద్రా | నెన్నిచూడ నరేంద్రా |
| 118 | బడకుండ | బడుచుండ |
| 124 | కువలయపతికన్యాయపరి | కువలయపతికిన్ న్యాయపుది |
| 129 | పాయదుపేదరిమి | పాయదు పెద్దమ్మ |
| 133 | —కామందకము | —పురుషార్థసారము |
| 145 | బమంత్రంబనిశ్చిత | బహుంత్రజ్ఞనిశ్చిత |
| 150 | —నీతిభూషణము | —శాంతిపర్వము |
| 168 | —సభాపర్వము | —ధృతరాష్ట్రనీతి |
| 173–74 | —బద్దెననీతి | —ముద్రామాత్యము |
| 194 | యాగపశుపిశసనమట్లు | యాగపశువిధంబునట్లు |

| 233 | భూపతులమతుల్ | భూపతివితతుల్ |
|---|---|---|
| 240_41 | _శ్రీగిరిశతకము | _కామందకము |
| 255 | వ్రాతప్రతిలో ఇక్కడనుంచి | విషపరీక్షాలక్షణము |
| 262 | విషదిగ్ధంబగు | విషవిశదంబగు |
| 270 | విపులప్రసాధనంబులు నృపతికినీవలయు | విపులప్రసాదములుతాన్నృపతికి మరివలయు |
| 273_80 | _కామందకము | _పురుషార్థసారము |
| 281_88 | _కామందకము | _పురుషార్థసారము |
| 278 | వయోవిహితసుఖభోగలీల | వయోవిహితోపభోగలీల |

ద్వితీయాశ్వాసము :

| 292 | నధికారమునకు | నధికారునకున్ |
|---|---|---|
| 295_99 | _నీతిసారము | _మదీయము |
| 306_08 | _పురుషార్థసారము | _చాటువు |
| 317 | _అజ్ఞాతము | _పురుషార్థసారము |
| 320 | విదుండు | విదగ్ధ |
| 329_33 | _పంచతంత్రి | _సభాపర్వము |
| 366 | కులవిహీనుఁడు | రూపహీనుడు |
| 372 | _అజ్ఞాతము | _సభాపర్వము |
| 392_93 | _పంచతంత్రి | _నీతిసారము |
| 395 | _పంచతంత్రి | _ముద్రామాత్యము |
| 420 | నన్నిచోడనరేంద్రా | నెన్నిచూడ నరేంద్రా |
| 421 | నన్నిచోడనరేంద్రా | నెన్నిచూడ నరేంద్రా |
| 427 | అనుగుజనుల | అను పుత్రుల |
| 481 | బుట్టినపని వినవగుపని | బుట్టినపతి వినదగుపని |
| 512 | ఒనరన్నృపాలంబు రాదృష్టనరనామకమ్ములు | ఒనరకపాలంబు రాదృష్టపురుషనామకములు |
| 513 | యైనకపాల | యైనన్నృపాల |
| 514_64 | _కామందకము | _పంచతంత్రము |
| 520 | యానమతక్కన్ | యానమతక్కన్ |

| | | |
|---|---|---|
| 533 | యుపేక్షింతురతఁడు | యుపేక్షించరతడు |
| 536 | నాయెడయయదేశ | నాయెడనాదేశ |
| 553 | తాసపసత్త్వనితోఁడ | తాపససత్త్వనితోడ |
| 566 | నుత్తరోత్తరము | నంతరాంతరము |
| 572 | —అజ్ఞాతము | —కామందకము |
| 637—38 | ఈ రెండుపద్యములు 'ఇంద్రజాలమార్గము' లోనివి | |
| 645—51 | —నీతిసారము | —కుమారసంభవము |
| 652—53 | —పురుషార్థసారము | —నీతిసారము |
| 659—60 | —అజ్ఞాతము | —నీతిసారము |
| 669 | —అజ్ఞాతము | —నీతిసారము |
| 670—83 | —కామందకము | —నీతిసారము |
| 684—86 | —మదీయము | —నీతిసారము |
| 688 | —అజ్ఞాతము | —మదీయము |
| 718 పైని | —పంచతంత్రి | —పంచతంత్రము |
| 730 పైని | —పంచతంత్రి | —పంచతంత్రము |
| 735 | కర్దమంబునఁబూచునే | కర్దమంబుననిడినబూచునే |
| 738 | దుర్జయజ్ఞానసత్త్వాధికుండు<br>తుండుప్రియంవదుండు<br>క్షముఁడద్వైధు | దుర్జయహిత సమత్వాధికుండు<br>తుడు శుభప్రియవదుండు<br>క్షీణుడద్వైతు |
| 739 పైని | —పంచతంత్రి | —పంచతంత్రము |
| 752 పైని | —పంచతంత్రి | —పంచతంత్రము |
| 767 | వ్యసనము చెందఁడే | వ్యసనము నిత్యమున్ |
| 775 | పట్టును లేక | పట్టున లేక |
| 813 | —అజ్ఞాతము | —కామందకము |
| 815—16 | —నీతిసారము | —కామందకము |
| 829—32 | —అజ్ఞాతము | —నీతిసారము |
| 832 | నెక్కున కారణమున | నెక్కుంగా రణమున |
| 839 | కాకదాల్తురే | కాకనిల్తురే |
| 859 | జన సభామిష్ఠ | సరసభామిష్ఠ |
| 886—91 | —కామందకము | —నీతిసారము |

968_972 _పంచతంత్రి _పురుషార్థసారము
984 జారాంగనలకు జారాంగనలను
990 _అజ్ఞాతము _నీతితారావళి

క్రింది రెండు పద్యములు – వ్రాత ప్రతిలో నున్నవి – అచ్చు ప్రతిలో లేవు:

(1) 734 తరువాత —

ఆ. వె. "పుడమి మూర్ఖునకును బుద్ధిసెప్పుట శాంతి
కొరకుగాదు తగవుకొరకు గాని
భుజగమునకు పాలుబోసిన విషము వ
ర్ధిల్లుగాక యందు తీపుగలదె." (871)

—విదురనీతి.

(2) 884 తరువాత —

ఆ. వె. "ఎపుడువచ్చురాజ్య మపుడు చిత్తము వారు
వ్యసనములకు గాన పొసగదెప్పు
డరుగుచెంచు దలకు నభిషేకజలము దా
నపుడ యరుగుచెంచు నాపదలను." (1019)

—పంచతంత్రి.

— పోణంగి శ్రీరామ అప్పారావు.

# మార్పులు

## పీఠిక

| పుట | పంక్తి | ఉన్నది | మార్పు |
|---|---|---|---|
| 4 | 6 | రిల్తు | రిల్లు |
| 5 | 18 | బాహు | బహు |
| 9 | 11 | పొత | పోత |
| 12 | 13 | కాబ | కాబ్ద |
| 13 | 3 | యుము | యము |
| | 25 | తాల | తాళ |
| | 26 | తాల | తాళ |
| 14 | 27 | జ్జా | జ్ఞా |
| 26 | 14 | దము | దకము |
| 36 | 6 | కొనఁ | కొనం |
| 45 | 14 | 88 | 915 |
| 53 | 12 | త్రి | స్మృతి |
| 54 | 5 | 298 | 484 |
| | 6 | హా | హో |
| | 11 | 196 | 138 |
| 55 | 21 | ముద | ముద్ద |
| 64 | 17 | జ్మ | జ్మ |
| 65 | 5 | శివ | శివ |
| | 21 | నిశి | శ |

## ప్రథమాశ్వాసము

| గద్యపద్యసంఖ్య | పంక్తి | ఉన్నది | మార్పు |
|---|---|---|---|
| 6 | 1 | వోపు రాజు | నోపు రాజుల |
| 10 | 1 | వయనున | నయనున |
| 17 | 2 | రాజునవశ్య | రాజునకవశ్య |
| | 4 | జ్యాతి | జ్యోతి |
| 18 | 3 | మూలకరి | మూలకరి |

| | | | |
|---|---|---|---|
| 21 | 1 | దెలు | దెలి |
| 26 | 2 | బంధంబు పునరుక్తి | బంధంబు నిరర్థంబు పునరుక్తి |
| 28 | 2 | గూర్వంగ | గూర్పఁగ |
| 32 | 2 | నిజ్వ భా ఁ | నిజస్వభావుఁ |
| 65 | 1 | భుజంగ | భుజగ |
| 66 | 1 | సానూప | నానూప |
| | 5 | గీ. | ఆ. వె. |
| 76 | 1 | గారా | గార |
| 92 | 2 | సఖిల | నఖిల |
| 94 | 2 | సాయక | పాయక |
| 102 | 1 | గీ. | ఆ. వె. |
| 104 | 2 | ప్రోపు | ప్రోపు |
| 109 | 3 | బ్రోవఁ | బ్రజఁబ్రోవఁ |
| 127 | 2 | నాఁడన | నౌండన |
| 128 | 2 | విదారము | విచారము |
| 146 | 2 | తా సుఁ | తామసుఁ |
| 149 | 1 | రా ష్రము | రాష్ట్రము |
| 151 | 4 | కామందకము | — |
| 152 | 2 | మూన | మాన |
| 156 | 1-2 | మున్. బ్రి | ము, ప్రి |
| 157 | 4 | యువి | ఋవి |
| | 5 | శ్రీఘ | శీఘ్ర |
| 158 | 2 | సురల | సురుల |
| 193 | 4 | కృపా | కృప |
| 208 | 2 | కా ము | కారము |
| 227 | 1 | రము త్తు | రము మత్తు |
| 240 | 1 | కి ర్తి | కీర్తి |
| 256 | 1 | విషరోదక | విషహరోదక |
| 263 | 2 | మీఁద | మీదఁ |
| 265 | 2 | పాతం | ఘాతం |

| | | | |
|---|---|---|---|
| 281 | 1 | కాత్మయు | కాత్మయ |
| | | మఱపక | మఱవక |
| 282 | 2 | డంచు | డందు |
| 286 | 4 | నేసి | సేసి |

ద్వితీయాశ్వాసము

| | | | |
|---|---|---|---|
| 302 | 3 | మేతంబు | సమేతంబు |
| 311 | 3 | వూజ | పూజ |
| 312 | 2 | ఖ్యా | ఘ్యా |
| 313 | 2 | సురల | సురుల |
| 315 | 3 | వూజ | పూజ |
| 323 | 2 | కెపు | కెప్పు |
| 328 | 1 | క్షీతి | క్షితి |
| 333 | 1 | ములఁ | ముల |
| 339 | 3 | నిశ్చితు | నిశ్చింతు |
| 340 | 1 | మంతుడు | మంతుండు |
| 349 | 4 | తోడరి | తొడరి |
| 357 | 1 | విభము | విభవము |
| | 2 | బను | బును |
| 366 | 3 | జ లుఁడు | జవలుఁడు |
| 377 | 1 | పరేగింత | పరేంగిత |
| 385 | 2 | నలుపు | నలువు |
| 389 | 2 | రధ | రథ |
| 392 | 2 | బొసఁగి | బొసఁగిన |
| 396 | 2 | మానగు | మానుగ |
| 418 | 4 | వెఱపు | వెఱవు |
| 434 | 2 | ప్రియుడు | వాఁడు ప్రియుఁడు |
| 463 | 2 | తోడఁదేఁడ | తోడనాడ |
| 480 | 2 | గొలచి | గొలిచి |
| 482 | 1 | మ, నా | మ, హీనా |

| | | | |
|---|---|---|---|
| 518 | 1 | భుమి | భూమి |
| 531 | 2 | ప్ర యాం | ప్రణయాం |
| 546 | 4 | న్మొరసి | న్మొనసి |
| 550 | 3 | గాంక్ష | కాంక్ష |
| 587 | 2 | కొండం భేదిలచు | కొండల భేదించు |
| 602 | 2 | దఁగు, జారుక్రిన్ | (దగు. చారుక్రియన్ |
| 605 | 2 | పా న | పాలున |
| 625 | 2 | మైతనర్చు | మైదనర్చు |
| 639 | 1 | వనచ్ఛృంగార | మందిరవనచ్ఛృంగార |

తృతీయాశ్వాసము—

| | | | |
|---|---|---|---|
| 644 | 2 | పతి జా | పతినిజా |
| 648 | 4 | జ | జని |
| 661 | 1 | మృగఘా | మృగయా |
| 680 | 1 | స్థలన | స్థలన |
| 693 | 2 | వంది సునకు భటు కు | వందిజనునకు భటులకు |
| 705 | 1 | విచ్ఛే ంబును | విచ్ఛేదనంబును |
| 716 | 2 | రోపాశక్తి | రోపాయశక్తి |
| 729 | 2 | జదంత | నిజదంత |
| 730 | 3 | లేరు విల | లేరుగాని విల |
| 734 | 1 | మే న | మేలున |
| 744 | 2 | వాగ్జాత | వాగ్జాత |
| 756 | 2 | చెలమి | చెలిమి |
| 758 | 2 | దలంపు | దలంప |
| 763 | 1 | గుణలగు | గుణులగు |
| 771 | 1 | శాస్త్రస్థ | శాస్త్రస్థితి |
| 808 | 2 | శ్వ | సశ్వ |
| 810 | 1 | నిపరీత | విపరీత |
| 813 | 1 | తృధాన్య | తృణధాన్య |
| 818 | 1 | డెఱఁగు | డెఱఁగుల |

| | | | |
|---|---|---|---|
| 819 | 1 | సమరసాధ్య | సమరసాధనసాధ్య |
| 834 | 1 | కా ్య | కార్య |
| | 3 | బ ట్లును | బంట్లును |
| 837 | 2 | యిష్ట బు | యిష్టంబు |
| 844 | 4 | సొంవ | సొలప |
| 849 | 1 | జలా ్వ | జలాఖ్వ |
| 859 | 1 | జనన | జన న |
| 865 | 1 | బా లు | బావులు |
| 868 | 1 | పండలబు | మండలంబు |
| 871 | 2 | పాలున | పాలుని |
| 911 | 2 | గాలఁనిద్ర | గాలఁదానిద్ర |
| 914 | 1 | లియు | బలియు |
| 929 | 1 | లీలి | లీల్గి |
| 942 | 2 | బాహు | రూఢబాహు |
| 945 | 2 | ృష్టుని | కృష్టుని |
| 951 | 2 | గడి | గడ్డి |
| 978 | 4 | వోపె | వ్రోలె |
| 981 | 4 | సౌఖ్యా | సౌఖ్య |
| 983 | 4 | గురుదిర | గురుతర |
| 993 | 1 | కీ ర్తి | కీర్తి |
| | 3 | నేత్ర | నేత్రా |

ముద్రణ (సొంత) ప్రతిలో శ్రీ కవిగారు సూచించిన కొన్ని మార్పులు :

| | | | |
|---|---|---|---|
| 202 | 3 | యుండి తనర్చినం | యుండక నిల్చినం |
| 302 | తరువాత | రాయసము | వ్రాయసము |
| 540 | | సందేహ | సంధేయ |

# చేర్పులు

| పీఠిక | పుట | పంక్తి | |
|---|---|---|---|
| | 6 | 30 | అథోజ్ఞాపిక (భారతి వ్యాసము) (1967) |
| | 70 | 5 | ,, ,, (1963) |

పై రెండు వ్యాసములను 'భారతి' నుండి పునర్ముద్రించుకొనుట కనుజ్ఞనిచ్చిన భారతీ పత్రికాధ్యక్షులు శ్రీ శివలెంక శంభుప్రసాదుగారికి నా కృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను.

| | పుట | పంక్తి | |
|---|---|---|---|
| | 31 | 1 | ఇది పద్యముగానున్నది. 'ఇది 26వ' అని చేర్చి చదువగోరెదను. |
| | 65 | 15 | భూపాలీయము 'వీర' అని చేర్చి వీరభూపాలీయము అని చదువగోరెదను. |
| | 72 | 5 | ఇందలి ప్రథమగణితములు గణితము ముద్రణ భాగ్యము నందినవి.[2] |
| | | 2 | అథోజ్ఞాపిక క్రింద నీ క్రిందిపంక్తులు చేర్చి చదువుకొన గోరెదను. |

పావులూరి మల్లనగణితమున మొదటి రెండధ్యాయములు పరికర్మభిన్నగణితములు కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేతను, మూడవ నాల్గవ అధ్యాయములు ప్రకీర్ణ త్రైరాశికగణితములు డాక్టరు తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారిచేతను పరిష్కృతములైనవి.

తృతీయాశ్వాసము

క్రింది వాక్యమును 643 వ గద్యముగాచేర్చి చదువుకొనవలయును—

దేవా ! దివ్యచిత్తంబున నవధరింపుము.